వెంకటశివుఁడు, రాయసం, 1868-1953

వ్యాసావళి

బెజవాడ, 1925

Record no. 527

Bibliographic Record Target

వెంకటశివుఁడు, రాయసం, 1868-1953.

వ్యాసావళి / రాయసం వెంకటశివుడు.- బెజవాడ : వేంకటరామ్ అండ్ కో., 1925.

2 volumes ;22 cm.

Record no. 527

Veṅkaṭaśivum̐ḍu, Rāyasaṃ, 1868-1953.

Vyāsāvaḷi / Rāyasaṃ Veṅkaṭaśivuḍu.- Bejavāḍa : Vēṅkaṭarām aṃḍ Kō., 1925.

2 volumes ;22 cm.

Record no. 527

# వ్యాసావళి

## రెండవ భాగము

గ్రంథకర్త:

రాయసం వేంకటశివుడుగారు. యం. ఏ, యల్. టి.
ప్రిన్సిపల్ - వెంకటగిరి రాజాస్ కాలేజి:
నెల్లూరు.



వేంకటరామ్ అండ్ కో,
బుక్ సెల్లర్సు, పబ్లిషర్సు & స్టేషనర్సు
బెజవాడ.

రామా, ముద్రాక్షరశాల ఏలూరు.

1926

 వెల 0-10-0

# పీఠిక.

నేను చిరకాలము ప్రకటించు చుండిన తెలుఁగు జనానాపత్రికలోని కొన్ని వ్యాసముల నిప్పుడు పుస్తకరూపమున ప్రచురించుచున్నాను. వీని లోఁగొన్ని నాతమ్ముఁడగు చి॥ వేంకటరామయ్య వ్రాసినవి. "ఉత్తర గోగ్రహణము" ఆంధ్రపత్రిక సంవత్సర సంచికకు నాచేఁబంపఁబడిన వ్యాసము. ౩౧, ౩౨, ౩౩, వ్యాసములు, అప్పుడప్పుడు నేనిచ్చిన అధ్యక్షకోపన్యాసములలోని భాగములు. ౩౧-వ సంఖ్యగల వ్యాసము ఆంధ్రపత్రికలోను, ౩౨-వ ది ఆంధ్ర రాష్ట్రప్రారంభ విద్యయను పత్రికకనుబంధమగు పుష్కరసంచికలోను మొదటఁ బ్రకటింపఁబడినవి. 1925సం॥ ఏప్రిల్ నెలలో రాజమహేంద్రవరమున జరిగిన శ్రీ వీరేశలింగ వర్ధంతి సమయమున నేనిచ్చినయుపన్యాసభాగము ౩౧ వ వ్యాసముగను, ఇందుకూరుపేటలో 6-12-24 తేదీని జరిగిన నెల్లూరు తాలూకా ప్రాథమికోపాధ్యాయ ద్వితీయ మహాసభలో నొసఁగిన యుపన్యాస భాగము ౩౨వ వ్యాసముగను, నరసాపురమున 16-4-1911 వ తేదీన జరిగిన కృష్ణా గుంటూరు మండల సంఘ సంస్కరణ సభలోనిచ్చిన యుపన్యాస భాగమును 3౩వ-వ్యాసముగను నేనిందుఁబొందుపఱిచితిని. పఠితలీవ్యాసములలోఁగల గుణములఁ గ్రహించి దోసముల క్షమింతురుగాక!

గ్రంథ ప్రకటనమున నాకన్ని విధములఁ దోడ్పడుచున్న శ్రీరామ ముద్రాక్షరశాలాధిపతులగు శ్రీ ఈదర వేంకటరావు గారికి నాకృతజ్ఞతా పూర్వక వందనము లర్పించుచున్నాఁడను.

నెల్లూరు.
21-4-26

గాయసం వేంకటశివుఁడు.

# వ్యాసావళి.

## విషయ సూచిక.



# వ్యాసావళి

## రెండవ భాగము

### ముత్యము.

సముద్రమునుండి యుత్పత్తియగు వస్తుసముదాయమంతటిలోను, మిక్కిలి యందమగునది ముత్యమని చెప్పవచ్చును. ముత్తెములు, సౌందర్యము నందు మణులమీదఁ గాలుద్రువ్వుచున్నవి. మణులవలె మెఱుఁగుపెట్టకయే ముత్యములు కాంతిమంతములుగ నుండును. కావుననే ప్రాచీనులు ముత్యముల నెంతో ప్రేమతోఁ జూచుచువచ్చిరి. ముత్యములయం దన్ని దేశములవారికిని నైసర్గికముగనే వాంఛగలదని చెప్పవచ్చును. నగలలోనెల్ల ముత్యములే శ్రేష్ఠములని పూర్వకాలపు జనులు భావించుచుండినట్లు ప్రపంచచరిత్రము వాకొనుచున్నది. తరతరముల నుండి, నాగరికులు ననాగరికులునుగూడ, నైర్మల్యమునకును, సొగసుదనమునకును ముత్తియముల నిదానములని నమ్ముచువచ్చిరి.

ముత్యముల విలువ, వానికాంతి, యాకృతి, వర్ణము, పరిమాణము, మొదలగువానినిబట్టి యుండును. ముత్తెము లనేకరీతులనుండును. కొన్ని గుండ్రముగను, కొన్నికోలగను, కొన్ని బొత్తాములవలెను మఱికొన్ని వేర్వేరువిధముల యాకృతులుగలవిగాను నుండును. సాధారణముగ మిగుల గుండ్రముగనుండు ముత్యమే శ్రేష్ఠమైనదిగ నెన్నఁబడుచున్నది. మిక్కిలి బరువుగనుండి తళుక్కుతళుక్కుమను ముత్యములు మిక్కిలి యరుదుగనుండును. వీని వెల నానాటికి అధికమగుచుండును. ఇట్టి ముత్యములె హారములలో నాయకమణులుగ నుపయోగింపఁబడుచున్నవి. బొత్తామువంటి యాకృతిగల ముత్తెములు విలువలో రెండవతరగతి ముత్తెములు. గుండ్రనిముత్యము వెలలో నాల్గవవంతుకంటె నీముత్యము

వెలయుండదు. గోలగానుండు ముత్యమువెల గుండ్రపుముత్యము వెలలో నాలవవంతుగాని, యెనిమిదవవంతుగాని యుండును. వికృతాకారము గల ముత్యములవెల స్వల్పముగ నుండును. మిక్కిలి మంచిముత్యము యొక్క యాకార మెట్టులున్నను, మీఁదపూత్రము గంట్లుగాని, హెచ్చుతగ్గులుగాని యుండఁగూడదు.

ముత్యములు వివిధవర్ణములతో నుండును. వెండివలె తెల్లగను, కొంచెము నీలివర్ణము గలిగియును నుండు ముత్యములను యూరపియనులును, అమెరికావారును శ్రేష్ఠమైనవని యెంచెదరు. మంచియాకారము గల నల్లనిముత్యములు తఱచుగా తెల్లనిముత్యములకంటె విలువగలిగి యుండును. ప్రాచీనులు నల్లనిముత్యములను మెచ్చకయుండిరి. కావుననే వారు వ్రాసినగ్రంథములం దట్టిముత్యముల ప్రశంసయే లేదు. ప్రస్తుతమున నవి మిక్కిలి యరుదుగనుండుటచేత హెచ్చు వెలగలిగి యున్నవి. యూజీనురాణియను నొక యూరోపుఖండపు చక్రవర్తినికి చక్కని నల్లనిముత్యములహారము గలదు. ఆమెనుజూచి జనులు నల్లని ముత్యములం దాసక్తిగలిగియుండిరి. ఆమె ధరించినసరము నెలయైదులక్షల ఫ్రాంకులఁట ! ఈ నల్లనిముత్యములు కాలిఫోర్న్యాఖాతమునందును, టహాటి, ఫిజి, పెనమా పశ్చిమ ఆస్ట్రేలియా దేశములందును దొరకును. కొంచెము ఆకుపచ్చని రంగుతోఁగూడిన నల్లనిముత్యములు మిక్కిలియరుదుగ దొరకుటచేత, ముత్యములన్నిటికంటె నెక్కువ వెలగలిగియున్నవి. ఇవికాక, పసపు, ఎఱుపు, జేగురురంగులుగల ముత్యములుగూడఁగలవు. వీనిలో మంచివానిధరలు హెచ్చుగ నున్నవి.

మన హిందూదేశములోను, చీనాదేశమునందును, కొంచెము పసుపుచాయ గలిగిన ముత్యములు ప్రశస్తమైనవిగ భావింపబడుచున్నవి. కొంచెము నల్లనిశరీరకాంతిగల హిందువులకు, తెల్లని ముత్యములకంటె, ఈపచ్చని ముత్యములే బాగుగనుండును.

నీరుల్లిగడ్డవలెనే, ముత్యము చాల పొరలుగలిగియుండును. కావుననే, ముత్యమునకు మంచికాంతి రావలెనంటిమా, పైపొర తీసివేసిన



యెడల, లోపలిపొర కాంతిమంతముగనుండును. ఇంకను లోపలనుండు పొరలు మిక్కిలి చక్కగనుండును. ముత్యములు రంగుమాయక యుండవలెనని కోరినయెడల, వానికి సబ్బు, క్రొవ్వు, సారాయి, పండ్లరసము మొదలయిన వస్తువులతోడిసంపర్కము గానీయకుండవలయును.

---

## మంచిబాలికల లక్షణములు.

పూవులలోను, పండ్లలోను, కొన్ని మంచివి, కొన్ని చెడ్డవియు నెట్లుండునో, అదేవిధమున బాలికలలోఁ గొందఱు మంచివారును, కొందఱు చెడ్డవారును, నుందురు. మంచిపువ్వులు సువాసన లిచ్చుచును, మంచిపండ్లు తీయనిరసము నిచ్చుచును మనకానందము నెట్లు గలుగఁ జేయుచున్నవో, అదేతీరున మంచిబాలికలు తమ గుణములచేత జనులకు సంతోషము గలుగఁజేయుచున్నారు. ఇఁకఁ జెడ్డబాలికలు, చెడ్డపూవులవలెను, చెడుఫలములవలెను, ఇతరులను సుఖపెట్టుటకు మాఱుగా, కొంతవఱకు వారికష్టములకు హేతు వగుచున్నారు.

మంచిబాలికల లక్షణముల నిచట సంగ్రహముగ వివరించెదము.

మంచిబాలిక లెప్పుడును తల్లిదండ్రుల యాజ్ఞలనుమీఱక, వారి యెడల ప్రేమ గలిగియుందురు. మనలను గని పెంచి, ఎన్నికష్టములకైనను తాములోనై మనను రక్షించి, మనకు విద్యాబుద్ధులు చెప్పి, ఎప్పుడును మన యారోగ్యమును, క్షేమాభివృద్ధులును గోరుచున్న తలిదండ్రులకంటె నీలోకమున మనకు ముఖ్యులెవరు గలరు ? ఇన్నిమేళ్ళనుమన కొసఁగినవారియెడల మన మత్యాదరమును, దయను, వినయవిధేయతలును జూపకున్నయెడల, ఇఁక మన మంచితన మేమిటి ? "నామనస్సులో మాయమ్మమీఁద నెంతో యపేక్షగ నున్నది గాని, పైకిమాత్ర మామెమీఁదఁ గోపపడుచుండెదను!" అని కొందఱు బాలికలనుచుందురు. కాని వారిట్లు చేయుచుండుట యుక్తము గాదు. ప్రతివారి

కిని, తమ తలిదండ్రులయెడలఁ గొంత ప్రేమయుండుట స్వాభావికమే. కాని, సహజముగనుండు నీప్రేమను వృద్ధిపఱచుకొనుచు, దాని కనుగుణ్యముగ నడచుకొనునప్పుడే, మనకుఁ బితృభక్తియు, మాతృభక్తియుఁ గలదని జనులు వ్యవహరింతురు. "నాకు నీమీఁద మిక్కిలి దయయున్నదిసుమీ!" యని మనస్నేహితు లెవరైన మనతోఁ జెప్పి, వెంటనే మనను గొట్టినయెడల, వారిని మంచివారని మనము భావింతుమా? లేదు లేదు. అట్లే, మనకు నిజమైన భక్తిప్రేమలు మనజననీజనకులయెడల నున్నదియు లేనిదియును, మనము వారియెడల నడచుకొను రీతినిబట్టియే తెలియును.

కావున, మంచిబాలిక లెప్పుడును తలిదండ్రులయెడల మిగుల నమ్రతయు, దయయుఁ గలిగి, వారికి సంతోషమును గలుగఁజేయుటకై ప్రయత్నింతురు. కొందఱు బాలలు, ఇంటఁ దల్లి యేదైన పనిచెప్పిన యెడల, విసుగుకొనుచు, అది బాగుగఁజేయక, చెలులతో నాడుకొనుటకై పొరుగువారింటికి వెడలిపోయెదరు. ఇంకఁ గొందఱికి, పొరుగువారే మంచివారుగాని, ఇంటనుండువారియందు మంచితనము గానఁబడదు! ఇట్టి బాలికలు మంచివారు గారని వేఱె చెప్పనక్కఱలేదు. ఇంటఁగల పనులను జేసికొనలేక బాధనొందుచున్న తల్లినివిడిచి, పరుల యిండ్ల కాటపాటలకొఱకై పరుగులెత్తు బాలికలకుఁ ద్వరలో చెడుగుణములు పట్టుపడును. ఇట్టివారికి ముఖ్యముగఁ దలిదండ్రులమీఁదఁ గొండెములు చెప్పుట యభ్యాసమగును. "పొరుగింటిపుల్లకూరరుచి" యన్నటుల, పొరుగువారు చెప్పెడిపనులను జేయుటయందుమాత్ర మిట్టి బాలికల కెంతోసంతోషము! కాని యట్టిబాలికలచేఁ బనులు గైకొనుటకై, పొరిగింటి యమ్మలక్కలు తరుచుగ వారినిఁ బొగడుచు, లేనిపోని సుగుణములు వారియందున్నట్లు వారిని గీర్తింతురు. చూచితిరా! తల్లిమాట వినని బాలిక, పొరుగింట నెట్లు పనులుచేసి, వారితో మనసు గలసి మాటాడుచున్నదో! ఇట్టి బాలికల హృదయమునఁ దప్పక ఒక చెడుగుణము వెంటవెంటొక చెడుగుణము ప్రవేశించును.



కాఁబట్టి, మంచిబాలిక లిట్లు మెలఁగక, తమసౌఖ్యముకంటె ముందుగఁ దమతల్లిసౌఖ్యము నొడఁగూర్పఁ బ్రయత్నింతురు. తల్లి చెప్పినమాటలచొప్పున నడచుకొని బుద్ధిగలిగి ప్రవర్తించిన బాలిక సామాన్యముగ మంచిప్రవర్తన గలిగియేయుండును.

మంచిబాలికల రెండవలక్షణము శ్రద్ధ. తల్లి నేర్పెడి యింటిపనులు గమనించుటయందును, విద్యనేర్పుటయందును శ్రద్ధలేని బాలికకుఁ బనిపాటలును చదువును లభించుట దుస్తరము. కాని కొందఱు పిల్లలు, విద్యయందు శ్రద్ధ గలిగియున్నను, ఇంటిపనులు నేర్చుకొనుటయందిష్టము లేకున్నారు. మఱికొందఱు, ఇంటి పనులుచేయుటయందే మక్కువగలిగి, పుస్తకములందు శ్రద్ధ లేకయున్నారు. ఇట్లు చేయువారిపద్ధతి మంచిదిగాదు. చేయవలసిన మంచిపను లన్నిటిలోను బాలికలు శ్రద్ధగలిగియుండవలయును. శ్రద్ధలేనికృషి నెఱవేఱదు. శ్రద్ధ గలిగి చదువుకొనిన బాలకు వేవేగమే చదువుపట్టుపడును. శ్రద్ధ లేనిబాలిక, చదివినదే పలుమారు చదువవలసివచ్చును. ఉపాధ్యాయులచేతఁ జీవాట్లు తినుచు, పరీక్షలందపజయము నొందుచును, నలుగురిలోను దలవంచుకొని యుండవలసివచ్చును. ఇంటిపనులను నేర్చుకొనుటయందు శ్రద్ధగలబాలిక, తల్లికి మంచిస్నేహితురాలై, శీఘ్రకాలములోనే పనులలోని మెలకువలను గమనించును. అట్లుచేయక, పని తప్పించుకొనవలెనని ప్రయత్నించు బాలికకుఁ దల్లి రాక్షసివలెఁ గానిపించును. తండ్రి పిశాచమువలె నుండును. ఇంటిలోనుండు నితర బంధువర్గము శత్రుసముదాయమువలెఁ గనఁబడెదరు. వారి కంటఁబడకుండనుండు నాలుగు నిముసములే యట్టిబాలికలకు సౌఖ్యముగ నుండునట్లు తోఁచును. పాపము! ఇట్టి బాలికలు ముం దెన్నియో కష్టములు పాలయ్యెదరుగదా! చిన్ననాఁడు తల్లియొద్ద పనులు నేర్వని బాలలకు ముందు పెద్దవారై కాపురము చేయుట కత్తవారింటికిఁ బోయిన పిమ్మట, ఎవరికనోపికతోఁ బనులు నేర్పెదరు? పనిపాటలయం దెంతో

నేర్పుగలిగి, విద్యనేర్చి, ఎన్నిసుగుణములో గలిగియుండు బాలలే, సామాన్యముగ నత్తయాఁడుబిడ్డల బుగ్గపోటులఁ దినవలసివచ్చుచున్నది! అట్టిచో, చిన్ననాఁడు విద్యను, పనిపాటలను నేర్వనిబాలలకుఁ దరువాత సువిద్యయు, గృహకృత్యనిర్వహణమును బట్టుపడుట మిగులకష్టము. కావున, బాల్యమునందే యాఁడుపిల్లలు శ్రద్ధగలిగి చదువుకొని, యింటిపనులు నేర్చుకొనవలయును.

తలిదండ్రులు మొదలగువారియెడల దయయును, విద్యయందును, పనిపాటలయందును శ్రద్ధయునుగల బాలికలకుఁ దక్కినసుగుణములు సులభముగ లభించును. ఒకసుగుణము మఱియొకసుగుణమునకు దారిఁ జూపుచుండును.

తమవారియందు ప్రేమగల బాలికకు మంచిచెలికత్తెలు దొరకుదురు. స్నేహమును రుచిగొనిన హృదయ మెప్పుడును వెన్నవలె మెత్తనిగుణమును దాల్చియుండును. అట్టి బాలికలకు దయ, సత్యము, ధర్మబుద్ధిమొదలగు సుగుణములు వేగమే లభ్యమగును. శ్రద్ధగలిగి పనులు చేయనేర్చిన బాల లోకములోని కష్టములకు భయము నొందక, తాను జేయవలసిన విధికృత్యముల నోపికతో నెఱవేర్చుచుండును. తనసత్ప్రవర్తనచే జనుల మెప్పువడసి యట్టిబాల దైవభక్తి గలిగి ధన్యురాలగును.

---

## గోరువంక.



హిందూదేశమునందు, కాకివలెనే మనుష్యుల యిండ్లననుసరించు పక్షులలో గోరువంక యొకటి. కాకిలేని గ్రామమును, గోరువంక లేని తోఁటయును, హిందూదేశమున నుండదు. 'మైనాలు' సాధారణముగ వెదురు మొదలగు చెట్లలోఁ దమగూళ్ళను గట్టుకొనును. కాని, సాధారణముగఁ గాకిగూళ్ళవలెనే, వానిగూళ్ళును నరుని కంటఁబడవు.



ఈ పక్షులు తాము మనుష్యుల యిండ్లకడఁ జేరి, వారి యిండ్ల గుట్టును గనిపెట్టుటకుఁ గుతూహలము గలవైనను, తమనివాసముల గుట్టును మాత్రము మనుష్యుఁడు గ్రహింపకుండునటులఁ బ్రయత్నము చేయునట్టుగ నుండును!

కాకివలెనే గోరువంకయును మిశ్రాహారమును భుజించును. ఇది పురుగులను, చిన్నపండ్లను, భక్షించును. ఆహారమును సంపాదించుకొనుటయందు సహా యీపక్షి తెలివితేటలు గానవచ్చుచున్నవి. పచ్చికబయళ్ళలో మేయు ఆవులను గేదెలను వెంబడించి యీ పక్షి పోవుచుండును. పశువులు నడచునప్పుడు, భయపడి, పచ్చికలోనుండి మిడుతలు మొదలగు పురుగు లెగురుచుండును. అప్పుడు పశువుల ననుసరించునట్టి గోరువంక, ఎగురుచున్న పురుగులను మ్రింగివైచును. సాధారణముగఁ బగటిపూఁట యంతయును ఈపక్షి పురుగులను వెదకుచు, భూమి మీఁదనే తిరుగుచుండును. ఇది పండ్లను, ధాన్యాదులను ఆరతుతో భక్షించును. అడవి యుసిరికఫలము లెపుడు పక్వమగునో యీ పక్షియే మొదట గనిపెట్టును. గోధుమకోఁతయైన పిమ్మట, ఈ పులుగు క్రిందపడిన గింజల నేరి తినుచుండును. మనుష్యుల నివాసముల దగ్గఱఁ బారవేయఁబడిన యాహారపదార్థములను, కాకులతోఁగూడ గోరువంకలు దీసికొని తినును.

మైనాగోరువంకలు జంటలుగఁ గానిపించును. నరులవలెనే యీ పక్షులును దాంపత్యధర్మములను మిగుల నిష్ఠతోఁ జెల్లించుచున్నవి. ఈ పక్షులెపుడును జంటగనే యాహారమును సంపాదించుకొనును, వేటాడుచుండును. మచ్చికపడిన గోరువంక, మనుష్యుని యనురాగమును సంపాదించుటకై సర్వదా ప్రయత్నించుచుండును. అదివఱకొక గోరువంక, బురదలోఁ బొరలాడుచుండినను, మనుష్యునిఁ జూచినతోడనే, బురదను దులిపివైచికొని, పరిశుభ్రము గాంచియుండును!

మైనాగోరువంక కొట్టిమాటలనైనను నేర్పవచ్చును. ఇది యనేక స్వరములతో రుతముచేయును. కొన్నిస్వరములు శ్రావ్యముగను, కొన్ని కటువులుగను నుండును. ఎగురుచుండునప్పుడు చేయు రుతము మిగుల మధురమైనది. నిద్రించుటకు ముందుఁజేయు రుతము మిగుల పరుషముగ నుండును.

ఈ పక్షులు, కడమపక్షులతోఁగూడి ప్రాతఃకాలమందును, సాయంసమయమందును గానము చేయును. మంచి నిద్దురపట్టుటకై యివి యిట్లు అఱచి, శ్వాసకోశములను బలపఱచుకొనుచున్నవో, లేకయీధ్వనులవలనఁ దాము దినమంతయుఁ జేసినపను లొకదానితో నొకటిచెప్పుకొనుచున్నవో మనకుఁదెలియదు. మనుష్యులవలెనే శీతలోదకమున జలకమాడుటయందు మైనాల కెక్కువ యాసక్తిగలదు.

పక్షిసమూహములో నెప్పుడును, ఏవియో కొన్నిపక్షులు, తమజ్జాతిపక్షులనేకాక, కడమ పక్షిసముదాయమంతటిని, ద్వారపాలకులవలెఁ గాచుచుండును. ఈ పని హిందూదేశమున మైనా గోరువంకలు చేయుచుండును. పక్షులన్నియుఁ నొకచోటఁ జేరి యాటలాడుచున్నప్పుడు, అకస్మాత్తుగ దగ్గఱ మైనాబిగ్గరగ ధ్వని చేయును. అప్పుడు కాకులుతప్ప కడమపక్షులన్నియు చెల్లాచెదరై నలుదిక్కులకుఁ బారిపోవును. అప్పుడే చేరువ నొకచోట, చిన్నపక్షుల శత్రువగు డేగయుండుట మనకుఁ గానఁబడును !

తనయాహారమును సంపాదించుకొనుటయందే మైనా కాలమునంతయును గడపక, మనుష్యునివలెనే కొంతసేపు, ఆటపాటలయందు వినోదించుచుండును. ఈ మైనా గోరింకల యాటలు కొన్ని మిగుల చిత్రముగనుండును. ఐదారు గోరువంక లొకచోటఁ గూడును. వీనిలో నొకటి యొక చెట్టుకొమ్మమీఁదఁ గూర్చుండఁగా, తక్కినవన్నియును ఏక కాలముననే దాని వీపుమీఁదికి దుమికి యన్నియుఁ గ్రిందఁబడి, చెరియొక ప్రక్కకును బారిపోవును. ఒక్కొకసారి, ఒక మైనా చెట్టుకొమ్మమీఁదఁ



గూర్చుండి యుండఁగా , దానికి మిక్కిలి దగ్గఱగానున్నది. యింకొకటి దానివీపుమీఁదికి దుముకఁజూచును. కాని యీ లోపలనే మొదటిపక్షి దాటిపోవును. అప్పుడు వేగమే రెండవపక్షి, దానిని వెంటనంటి తఱుము చుండును !

---

## బంతిపువ్వు

బాలికలకు బంతిపూవులెంతో ప్రియమైనవి. వాన లారంభింపఁగనే, క్రిందటి సంవత్సరమున విత్తనము కొఱకై దాచిన యెండు బంతిపువ్వులను వారు సంపాదింతురు. సామాన్యముగా బంతిపువ్వులింటిగుమ్మమునకు దోరణముగ గ్రుచ్చఁబడి యుండుటచేత, బంతి విత్తనములు సులభముగ దొరకును. అప్పుడు వారు బంతిపూవును రేకులు విడఁదీసి, నేలత్రవ్వి, యందు వేసి నీరు పోయుదురు. కొన్ని దినములలోనె యవి మొక్కలగును. దీనినే నాఱందురు.

బంతి నాఱు సామాన్యముగ నెల్లచోట్లను దొరకును. ఈనాఱు పెరళ్ళలో నాటి, కొన్ని దినములు కొంచెము నీరుపోసినయెడల, పెద్ద చెట్లగును. భూసారము ననుసరించియు, చెట్టు జాతినిబట్టియు, కొన్ని సమయములందు బంతిచెట్లు పెద్దవగును. ముఖ్యముగఁ బొలములలో నాటఁబడినవి ధ్వజస్తంభములవలె మిక్కిలి పెద్దవియగును. బంతిలో ననేక యుపజాతులు గలవు. బంతిమొక్క మిక్కిలి నిడుపుగఁ బెరిఁగి, నిడుపగు నాకులతోనుండును. ఇది సామాన్యముగ నంతగఁ గొమ్మలు పెట్టదు. కొన్నిజాతుల బంతిచెట్లు కొమ్మలు సమృద్ధిగఁ బెట్టును. సామాన్యపుబంతియొకొక విధమగు వాసనగలది. కొన్నిజాతుల మొక్కలకు సువాసనలుండును.

మన దేశపుబంతిలో సామాన్యముగ మూఁడుజాతులు గానవచ్చుచున్నవి. ఇవి ముద్దబంతి, రేకుబంతి, ఊఁకబంతి యని. రేకుబంతిపూవు భాగమున నొక వరుసమాత్రమే రేకులుండును. ఊఁకబంతిలో నెక్కు

పుగ విడివిడిగ రేకులుండును. కాని ముద్దబంతి నిండుగ రేకులుదాల్చి, దర్శనీయముగ నుండును. ఇదియే బాలికలకుఁ బ్రియతమమైనది. సామాన్యముగ దీనిపూవులనే బాలికలు తలలో ముడుచుకొనుచును, దండలుగ గ్రుచ్చి మెడలో వైచుకొనుచును నుందురు. రంగువిషయమై బంతిలో రెండు ఉపజాతు లున్నవి. కొన్నిపూవులు బంగరువలె మిక్కిలి పచ్చనికాంతిని గలిగి యున్నవి. మఱికొన్ని, కొంచె మెఱుపురంగుతోఁ గూడిన పసిమిని దాల్చి యున్నవి. భూసారమునుబట్టి యీపువ్వులు పెద్దవిగను జిన్నవిగను నగుచున్నవి.

ఒక విధమగు బంతిచెట్టు, కొంచెము సువాసనగల పూవులఁ బెట్టుచున్నది. మన దేశమున నిపుడు పట్టణములందలి తోఁటలలో వేయు సీమబంతిచెట్టు మిక్కిలి చిన్నదిగ నున్నది. దీనిపూవు దేశీయపు రేకబంతి పూవువలెనే కొంచెము రేకులు గలిగియున్నది. కాని యీ కుసుమము లెఱ్ఱనిరంగు గలిగి, దర్శనీయములుగ నుండును. ఇంగ్లండులోఁ గూడ బంతిచెట్లలో ననేకజాతు లున్నవి. వీని పూవులును సువాసన లేకున్నవనియె తోఁచుచున్నది.

మల్లి, గులాబి మొదలగు తక్కినపూవు జాతుల మొక్కలవలె బంతిమొక్కను బెంచుట కష్టముగాదు. సామాన్యముగ నెచ్చట నాటినను బంతిమొక్క పెరుఁగుచునే యుండును. మనము భూమినుండి తీసి వైచివేసిన మొక్కలయినను, సగము విఱిగినవియును, కొంచెము మన్ను తమవేళ్ళ కాధారముగ దొరకినచో, తిరిగి చిగుర్చుచున్నవి. కావున నే యీజాతిమొక్క లింత ప్రబలి యున్నవి.

పట్టణములలోని బాలికలును, నాగరికతయందు ముందడుగు వేయుచున్న స్త్రీలును, ఇప్పుడు బంతిపూవులను ధరించుట లేదు. గులాబి, మల్లి, మొదలగు తక్కిన పూవులు మాత్రమే వారి యాదరమును గాంచుచున్నవి. కుగ్రామములవారు మాత్రము బంతిపూవునే సింగారించుకొను చున్నారు. బంతి యిట్లు వన్నె వాయుటకుఁ గారణము



దానికి సువాసన లేకపోవుటయే. ఈపూవు నిర్గంధ కుసుమములలో నొకటి. కావున బంతిపువ్వును జూచినప్పుడెల్లను, మన మొక సంగతి జ్ఞాపకముంచుకొనవలయును. పూవులకు రూప మొకటియెగాక, సువాసనగూడ నావశ్యకము. మనుజులకును, పైమెఱుఁగు లేగాక, వినయవివేకాది సుగుణములు గూడ నుండవలయును. చదువును సద్వర్తనమును లేని వానిని నిర్గంధ కుసుమమునువలె నిరసనభావముతోఁ జనులు చూచెదరు.

లోకమునఁ బరిపూర్ణమగు ప్రజ్ఞను బడసియుండుట యెవరికిని సాధ్యముగాదు. ఒక్కొక్కరి కొక్కొక్క సుగుణమును, ఒక్కొక్క నేర్పును లభించియుండును. తనయందు సువాసన లేకపోయెనని బంతిపూవెప్పుడును తలవాల్చి చూచుట కసహ్యముగ నుండక, తృప్తిని దాల్చి, మందహాసముఁ జేయుచు, నందఱిని తన మంచి యాకారముతో నానందపఱుచుచు, సృష్టికర్త మాహాత్మ్యమును బ్రకటించుచున్నది. మన కున్న శక్తులతో మనమును దనివిఁ జెంది, యానందించుచు, సాధ్యమయినంత వఱకుఁ బరులసౌఖ్యము నొడగూర్చుచుండవలయును.

---

## భూతదయ.

కొంతకాలముక్రిందట శిక్ష యనుభవించుటకై సైబేరియా దేశము పంపఁబడిన పోలాండు దేశస్థుఁ డొకఁడు, ఒకగ్రామముదగ్గఱ నుండి నడచిపోవుచు, చేరువనున్న యొకయింటిలోనుండి యేడ్పులు వినఁబడఁగా, కారణము తెలియఁగోరి, యచటికిఁ బోయి చూచుసరికి, అక్కడ నొకవ్యవసాయదారుని కుమారుఁడు కుక్కనొకదానిని హింసించుచుండెను !

పాప మాకుక్కకుఁ బెద్దగాయములు తగిలి మరణావశిష్టమై యుండెను. అది జీవించనేరదని తెలిసికొని యాపోలండు దేశస్థుఁడు, దానిబాధను వేగమే సమాప్తి నొందింపఁబూని, తన చేతిలోనున్న తుపా

కితో దానినిఁగొట్టి చంపివేసెను. కాని తన కడ్డువచ్చినందున కా కాఁపు చిన్నవాఁడు కోపించి యేడువసాగెను. అంతి వాని తండ్రి వచ్చి, తన కుమారుని జోలి కేల పోయితివని యాపెద్ద మనుష్యు నడిగి "వాని కుక్కను వా డేమి చేసికొనినను, నీకేల ?" యని వానితో వాదించెను. ఇట్టి మనుష్యునితో తగవులాడుట మంచిది కాదని యెంచి యాపెద్ద మనుష్యుఁడు, ఆచిన్నవానిచేతిలోఁ గొంతసొమ్ము పెట్టి, తనదారిని తాను వెడలిపోయెను !

ఈతండ్రికుమారులసుగుణములను వేఱ వర్ణింప నక్కఱలేదు. మనుష్యనామమునకు వారి కర్హత లేదని యెల్లరకును దెలియును. జంతువుల నిట్లు హింసించుటకు మోటుమనుష్యులే సాహసించెదరుగాని, విద్యావంతులును, నాగరికత గలవారును బూనరు గదా!

నలుగురితోను గలసిమెలసియుండుట మనుష్యునికి నైసర్గికగుణము. దీని కనుగుణ్యమగు గుణము లెంతయుశ్లాఘాపాత్రములుగా నున్నవి. ఈ గుణములలో దయ యనునది ప్రధానమయినది. దయలేనివానిని పశుసమానుఁడనియు, రాక్షసతుల్యుఁ డనియును మనము పిలుతుము.

నోరులేనిజంతువులయెడ దాక్షిణ్యములేనిబాలుఁడుగాని, బాలికగాని, యిఁక మనుష్యులయెడలమాత్ర మంతగా కరుణఁ గలిగి యుండునా ? మనుష్యులనిన ప్రేమలేనివారి కిఁక జంతువులందు ప్రేమకుదురునా ? తనవలెనె సర్వభూతములను దయతోఁ జూచుట ధర్మాత్ముల గుణ మని యన్ని దేశములవారు నొప్పుకొని యున్నారు.

ఇండ్లలో మనము పెంచుచున్నకుక్క, పిల్లి, చిలుక, మొదలగు జంతువులయెడల మనము దయఁ జూపించుచున్నకొలఁదిని మనల నవి ప్రేమించుచుండును. దీనివలన మనకెంతో సంతోషముగలుగు చున్నది. పెంపుడుజంతువులయందేగాక, కడమజంతువులయందుఁగూడ మనము దయఁ జూపించవలయును. అట్లు చేసితిమేని, అవి రానురాను మచ్చికపడి, మనలను ప్రేమించును. జంతువులయందు మనము దయగలిగి



యుండుట యన్నివిధముల శ్రేయస్కరము. దానివలన వానికి సౌఖ్యసంతోషలాభములును, న్యాయమార్గావలంబకులకు మఱింత ధైర్యము గలుగును.

జంతువులయందు దయగలిగి యుండవలెననుటచేఁబట్టి, వానినెప్పుడుగాని మనము బాధింపఁగూడదని యెంచఁగూడదు. సుఖదుఃఖము లు మనుష్యులమగు మనకే లాభకారులుగ నున్నప్పుడు, కడమ జంతువులకుఁగూడ నుండునని వేఱ చెప్పవలయునా? ఏదైన వ్రణముచే మనము బాధనొందుచున్నప్పుడు, శస్త్రవైద్యుఁడు మనకుఁ జికిత్సచేసి, తాత్కాలికమగు బాధను గొంతవఱకు హెచ్చించినను, వ్యాధినివారణ చేసి, మనబాధను తొలఁగించి, మనసౌఖ్యము నభివృద్ధి పఱచుచున్నాఁడు. అదేరీతిని, జంతువులకు విద్య చెప్పునప్పుడును, వానిని మచ్చికపఱచునప్పుడును, వానివ్యాధి నివారణ చేయునప్పుడును, మనము వానికిఁ గొంతబాధ గలుగఁజేయవలసి వచ్చును. కానియిట్లు చేయుట క్రూరకృత్యముకానేరదు.

ఒక్కొకప్పుడు ప్రజాసౌఖ్యమునకు భంగకరము లగుపనులు చేయుమనుష్యులను మనము చెరసాలలయం దుంచుచున్నాము. మిక్కిలి దుర్మార్గులు శిరశ్ఛేదనాశిక్ష ననుభవింతురు. అదేరీతిని, మనుష్యులకుఁ గష్టములు తెచ్చిపెట్టు తేళ్ళు, పాములు, పులులు మొదలగు జంతువులను మనము నిర్మూలము చేయవలసివచ్చుచున్నది. కాని వానిని జంపవలసివచ్చినను మనము వాని ననావశ్యకమగు బాధలపాలు చేయక, శీఘ్రమే వాని ప్రాణములను తీసివేయవలయును.

మనుష్యులలో ననేకులు మాంసభక్షకు లుండుటచేత, కొన్ని జంతువులను ఆహారము నిమిత్తమై చంపవలసివచ్చుచుండును. మనుష్యులలో దాక్షిణ్యబుద్ధియు, నాగరకతయు నభివృద్ధిఁ జెందినకొలఁదిని, స్వలాభమునిమిత్తమైనను మనుష్యులు జంతువులను జంపరని కొందఱు నమ్ముచున్నారు. ఏదియెట్లున్నను, జంతువులను హింసించుటమాత్రము

మిక్కిలి క్రూరకృత్యము. వానిని జంపవలసివచ్చిన యెడల, సాధ్యమయినంతవేగముగను, బాధలేకుండఁగను, వాని ప్రాణములు తీసివేయవలయునే గాని, వానినిమాత్రము హింసింపఁగూడదు. నిర్హేతుకముగ హింసించుటయె రాక్షసకృత్యము.

---

## చక్కెర.



పంచదారయని మనము సామాన్యముగ వాడెడిమాటకుఁ బర్యాయ పదమగు "చక్కెర" సంస్కృతపదమగు "శర్కర" యను మాట నుండి వచ్చినది. ఇంగ్లీషుభాషలో దీనికి "షుగర్" అనిపేరు. సంస్కృత పదమగు "శర్కర" నుండి ప్రాకృతపుమాట "సర్కర" యును, అంత పారసీకమాట "షక్కర్" యును, దానినుండి అరబ్బీమాట "సక్కర్" యును, లాటిన్మాట "సుక్కారమ్" యును, ఫ్రెంచిమాట "సూకర్" యును, తుదకు ఇంగ్లీషుమాట "షుగరు" యును, బుట్టినవి. ఇంగ్లీషుమాట యగు "షుగర్" యొక్క వ్యుత్పత్త్యర్థము గనుగొనుట వ్యాకరణ పాఠకులకే గాక, చరిత్రపాఠకులకుఁగూడ లాభదాయకముగ నున్నది. ఏలననఁగా, ఒకభాషనుండి యింకొక భాషలోనికి మాట యెట్లు వచ్చినదో, అదే రీతిని, ఒక దేశస్థులనుండి యింకొకరు చక్కెరచేయురీతిని కాలక్రమమున నేర్చుకొనిరి. ఇట్లు క్రమక్రమముగ నొక దేశస్థులనుండి మఱియొకరు పంచదారచేయుట నేర్చుకొనిరి. కావుననే, పదార్థముతోఁగూడ పదమును లోకములో వ్యాపించినది.

చక్కెరచేయు విధము ప్రాచీనకాలమునందే హిందువులు నేర్చియుండిరి. మనదేశీయు లేకాలమున నేవిధముగఁ జక్కెరచేయు విధము గనుగొనిరో తెలియదు గాని, ప్రాచీన కాలపు గ్రంథములనుబట్టి వారు చక్కెర నుపయోగించుచు వచ్చిరనియును, చెఱకుకఱ్ఱల రసమునుండి వీరు దీనిని జేయుచువచ్చినట్లును స్పష్టము. యూరపుదేశీయు లెవరికిని



జక్కెర చెఱకు మొక్కలనిన నేమో తెలియుటకుఁ జాలకాలమునకుముందే హిందువులును చీనా దేశీయులును బంచదార నుపయోగించుచు వచ్చిరి. మహాఅలెగ్జాండరు తూర్పుదేశములను జయించుచు, హిందూదేశముమీఁదికిదండెత్తివచ్చినప్పుడు, హిందూదేశపు సముద్రతీరములను జూచిరమ్మని తన సేనానాయకుఁడగు నియర్కసును బంపెను. హిందూదేశమున నుండు నొకవిధమగు కఱ్ఱలనుండి తేనెవంటి తియ్యని రసమ్ము వచ్చునని యానియర్కసు వర్ణించిచెప్పెను. బహుశః చెఱకును గుఱించి యైరోపా వారికిఁ దెలియుటకిదియే మొదటిసారి కావచ్చును. మహాఅలెగ్జాండరు హిందూదేశమును క్రీస్తుశకమునకు 326 సంవత్సరములవెనుక దండెత్తి వచ్చెను.

ఇటుతరువాత 400 సం॥ల కొక సిలీషియా గ్రంథకర్త "ఇది గట్టిపడిన యొకవిధమగు తేనె. హిందూఅరేబియా దేశములలో నిది దొరకును. ఉప్పువలెనిది గట్టిగ కరకరలాడును" అని చక్కెరనువర్ణించెను. ఆకాలపు రోమను గ్రంథకర్తయగు ప్లైనీకూడ, చక్కెరను కఱ్ఱలనుండితీయఁబడిన తేనెయనివర్ణించి, యిది మందుగ వాడఁబడుచుండెనని వ్రాసెను! తరువాతయూరపుగ్రంథకర్తలు చక్కెరను "హిందూదేశపుఉప్పు" అని వాకొనుచువచ్చిరి! ఆకాలమునఁబశ్చిమదేశీయులకుఁ జక్కెర మిక్కిలి యరుదుగదొరకుచుండెను. తూర్పుదేశములతో వాణిజ్యముచేయువారి మూలమునఁ జక్కెరకొంచెముకొంచెములభించుచుండెను. కావున నిది వారౌషధముగమాత్రము వాడుకొనుచుండిరి. పిండివంటలును తీయనిభక్ష్యములును జేసికొనవలెనని వారు చక్కెరకు మాఱుగాఁ దేనె నుపయోగించుచుండిరి.

క్రీ॥శ॥ 766సం॥ నందు చెఱకు మొక్కలపైరు ఈజిప్టు దేశమున నారంభమైనది. నల్లసముద్రతీరపు ప్రాంతములందు చెఱకుపైరగుచుండఁగా, పశ్చిమ యైరోపా దేశీయులు యుద్ధము నిమిత్తమై పాలస్తీను వచ్చి, ఒకపర్యాయము చెఱకుతోటలుచొచ్చి, చెఱకుకఱ్ఱలు నమలిరఁట.

వారు తమ తమ దేశములు వెడలిపోయిన పిమ్మట, చెఱకు కఱ్ఱను గుఱించియు చక్కెరను గుఱించియు, తమ దేశీయులకుఁ జెప్పియుందురు.

ఇట్లుండఁగా, 710 వ సం॥నందు సారసీనులు ఆఫ్రికాఖండము యొక్క యుత్తరతీరములందుపోయి, స్పెయిను దేశములోఁ బ్రవేశించి, యచట నాలుగు శతాబ్దములు రాజ్యము చేసిరి. వీరాసమయమున స్పెయిను దేశమునఁ జెఱకు నాఁటి, చక్కెర చేయసాగిరి. వీరినుండియే యింగ్లీషువారులోనుగాఁగల యూరపుఖండవాసులు చక్కెరఁ జేయను దాని నుపయోగింపను నేర్చుకొనిరి.

క్రీ॥ శ॥ 13 వ శతాబ్దమువఱకును ఆంగ్లేయులు చక్కెరనుపయోగించుచువచ్చినట్లు తోఁచదు. ఆ కాలమున నింగ్లీషువారు చక్కెర నెంతో ప్రియముగఁ జూచుచు మందునకు మాత్రమె దాని నుపయోగించుచు వచ్చిరి. 1 వ శతాబ్దమున వారు తేనీళ్ళు, కాఫీయును త్రాగుట కారంభించినప్పటినుండి చక్కెర నెక్కువగఁ దెప్పించుకొనుచుండిరి. ఎలిజబెతు రాణి కాలములో నింగ్లండు దేశమునఁ జక్కెర చేయనారంభించిరి.

ఇట్లుండఁగా, ఐరోపాఖండవాసులు అమెరికాఖండమును గని పెట్టి, అక్కడ చెఱకుతోటలు వేయించిరి. కొంతకాలమువఱకును స్పెయిను దేశీయులు అమెరికాతో చక్కెరవ్యాపారమును జరిపి, మిగుల భాగ్యవంతులయిరి. తరువాత నింగ్లీషువారు అమెరికాలోని దేశములనుగొన్ని స్వాధీనము చేసికొని, చక్కెరవ్యాపారమును జరుపసాగిరి.

ఇట్లు, ఆసియాఖండవాసులు ప్రాచీనకాలమునుండియుఁ జక్కెరయుపయోగము నెఱింగియున్నారు. ఇంక నైరోపావారు చాలకాలము వఱకును జక్కెరప్రయోజనము నెఱుఁగకున్నను, ఆసియావారితో వ్యాపారములు జరిపి, అందువలన సంగతులన్నియుఁ దెలిసికొని, తమ దేశములందు చెఱకునాటి, పంచదార చేయనారంభించిరి. ఇప్పుడు లోకములో నాగరకత గల జనులందఱును పంచదార యుపయోగము నెఱిఁగియున్నారు. కాని ఆఫ్రికాఖండ మధ్యముననున్న వివిధజాతులవారు,



తమ దేశములలోఁ బెరుగు చెఱకు మొక్కల కఱ్ఱలను నమలి, రసము ద్రాగి వినోదించుచునె యుందురుగాని, పంచదార యనిన నేమో యెఱుఁగరు.

## చక్కెరచేయువిధము.

చక్కెరచేయువిధ మిట సంగ్రహముగఁ దెలిపెదము. ఇది ద్వివిధము. మొదట చెఱకురసమునుండి బెల్లము చేసెదరు. పిమ్మట బెల్లమునుండి పంచదార చేసెదరు. ఈ రెండుపనులు నించుమించుగ నొకరీతిగనె చేయఁబడుచున్నవి. కోయఁబడిన ముదురు చెఱకు కఱ్ఱలను గానుగలలో నాడఁగా ఆకుపచ్చనిరసము వచ్చును. ఇది రాగిపాత్రలలోఁ బోసి సన్నని సెగను గాచెదరు. రసములో వేయఁబడిన సున్నము వలన దానిలోనుండి మకిలియంతయుఁ బైకి తేలును. అది తీసివైచి, రసము నింకొక పాత్రలోనుంచి కాచి, మరల నింకొక దానిలోనుంచి మఱిగించెదరు. ఇట్లు బాగుగ మూఁడునాలుగు పాత్రలలోఁ గాగిన పానకమును కొయ్యతొట్టిలోఁ బోసెదరు. అదియంత గట్టిపడి చల్లారును. పైని తేలిన నీటి నంత వంచివేయఁగా గట్టిబెల్ల మేర్పడును.

ఇఁక బెల్లమునుండి చక్కెర చేయుపద్ధతి యేదనఁగా:—బెల్లము నొక పెద్దపళ్లెరములోని నీళ్ళలోఁ గలిపి, ఆవిరిచేసి యుడకఁబెట్టెదరు. బెల్లములోని మకిలి పోవుటకై దానిలోఁ గొన్ని వస్తువులను కలిపెదరు. అపుడు కొంతమకిలి పైకిఁ దేరఁగా దానినిఁ దీసివైచెదరు. దూది వడపోత సంచులలోను, బొగ్గు తెరలలోను ఈ పానకమును బోసి, వడఁబోసి, మిగిలిన మకిలిని తీసివైచెదరు. బాగుగ శుద్ధిపఱచిన పాకమునంత నొక విధమగు పాత్రలోనుంచి సన్నని మంటఁబెట్టగా, నల్లబడక యది మఱుగును. చక్కఁగఁ గాగినపిమ్మట దానినిదింపి చల్లారఁబెట్టఁగా, అది గడ్డకట్టును. అడుగునఁ జిన్ని రంధ్రములుగల కాలని యచ్చులలో గట్టిపడుచుండు పాకమును బోయఁగా, గట్టిపడనేరని నీరు క్రిందికిఁ బోవును. కాని యింకను పంచదారరంగు బాగుగ నుండదు కావున, పంచదార

చిక్కఁగఁ గలిపిన నీరి యచ్చులలోఁ బోయఁగా, అప్పుడు మకిలి యంతయుఁ గొట్టుకొనిపోయి, అచ్చులలోని పంచదార తెల్లఁబడును.

బెల్లపుపాకమును బాగుగ శుభ్రపఱచుటకొఱకుఁ గొందఱు రక్తము నుపయోగించెదరు. కాని యీ రక్తము పంచదారలో నిలిచియుండు నదిగాదు. వడియఁగట్టినప్పు డీరక్తమంతయు బైటికిఁ బోవును.

చెఱకు రసమునుండియే కాక, బీటుగడ్డ, ఖర్జూరము, మేపిలు మొదలగు వానినుండికూడఁ జక్కెర చేయఁబడుచున్నది. సామాన్యముగఁ జెఱకు ఉష్ణదేశములలోఁ బైరగును. చెఱకు రసము తీసిన వెంటనే బెల్లము చేయవలయును. అంత తయారయిన బెల్లమును పరదేశములకుఁ గొనిపోయి చక్కెర చేయుచున్నారు. అందువలనఁ జెఱకు చక్కెర చేయుట ప్రయాసకరముగ నున్నది. ఇఁక బీటుగడ్డనుండి చేయఁబడు చక్కెరను గుఱించి యంత ప్రయాస పడనక్కర లేదు.

---

## ముత్తువ తల్లి

తల్లిప్రేమకంటె ముత్తువతల్లి ప్రేమ ద్విగుణమని యొక గ్రంథకర్త చెప్పియున్నాడు. పిల్లవానిని వలసిన యెడల శిక్షించుచు, వానిని సరియైన మార్గములో నడపింపవలసిన భారము తల్లిమీఁద నుండును గావున, తల్లి పిల్లవానిమీఁద నంతయెక్కువగ ప్రేమగలిగినదానివలెఁ గానిపించదు. ఇఁక ముత్తువతల్లియన్ననో, తాను లోకములోఁ జేయవలసిన ముఖ్యకార్యములు జరిపి, తీరికగా నుండునుగావున, పిల్లలను ముద్దాడుటతోను, వారినెంతో గారాబముతోఁ జూచుటతోను గాలము గడపును.

“అమ్మమ్మయు నాయనమ్మయు నెప్పుడును జీవించియుండవలయును. దైవము వారికి నిత్యజీవము గలుగఁజేయవలయును” అని మనము కోరవలెనని యొక గ్రంథకర్త వచించుచున్నాడు.



“మీకు అమ్మమ్మ లేదా?” యని యొక పిల్లవాఁడు వేఱొక పిల్లవాని నడిగెను.

“లేదు” అని రెండవవాఁడు ప్రత్యుత్తరమిచ్చెను.

“అయ్యో లేదా ! అయితే అమ్మమ్మనొకదానిని సంపాదించుకొమ్ము” అని మొదటివాఁడనెను !

దీనినిబట్టి, పిల్లవాండ్రకు, సాధారణముగ ముత్తువదగ్గిరనుండు చనవును, వారియెడల ప్రేమాతిశయమును దేటపడును.

సమానవయస్సుగలవారి కెప్పుడును స్నేహము గుదురుచుండును. బాలురకును, రెండవబాల్యమనఁదగు వార్ధకమునందున్న ముసలివారికిని, సాధారణముగ మనసు గలియుచుండును. చిన్నపిల్లల మనస్సును ముసలమ్మలు బాగుగ గ్రహించి, ఓపికగలిగి, వారి కిష్టమగుసంగతులను గుఱించి వారితోఁ బ్రసంగించి, వారితో సఖ్యముగ నుందురు. చిన్నపిల్లలకుఁ జిన్నచిన్నకథలును, చిత్రములగు వృత్తాంతములును జెప్పుచుండువారు ముత్తువతల్లులే. కావుననే, ఏ దేశమునందును, పిల్లలు, తలిదండ్రులయొద్దకంటె తాతముత్తువలదగ్గరనే యెక్కువ చనవు గలిగియుందురు.

ముత్తువతల్లి మనుమని గారాబముతోఁ బ్రేమించును. మనుమఁడు ముత్తువయందును మిగుల ప్రేమగాంచియుండును. పిల్లవాఁడు, తల్లిదండ్రులు తనకుఁ జేసిన యక్రమములను నాయనమ్మతోఁగాని, అమ్మమ్మతోఁగాని చెప్పుకొని, వారిచే నోదార్పును గాంచుచుండును. ఈదట్టమగు స్నేహము, సాధారణముగఁ బిల్లవానికి సుఖావహముగనున్నను, ఒక్కొకప్పుడు వాని కెంతో చెరుపుచేయును. అమ్మమ్మతోడి మిత్రత్వము పెచ్చుపెఱిఁగి, చదువు సంధ్యలుమాని, తాముకూడ, జ్ఞానస్వీకారవిషయమున “అమ్మమ్మ” లేయైన మనుమల నెందఱిని జూచుచున్నాము కాము! బడిపంతులబెత్తమునుజూచి యడలి, అమ్మమ్మయొడిలోఁ దాగి,

చదువు చెడగొట్టుకొనిన బాలురనేకులుగలరు. తెలివిగల ముత్తవతల్లి మాత్ర మిటుచేయక, పిల్లవాని భయములను మెలకువతోఁ దీర్చి, వానిని బడికిఁ గొంపోయి, విద్యయందు పిల్లవానికి రుచి గలుగఁజేసి, యింటనుండునపుడు జ్ఞానదాయకములగు సంగతులను వానికి కథారూపమున నేర్పుచు, సర్వవిధముల మనుమని ప్రేమించి వృద్ధినొందించును.

ముత్తవలు చెప్పినమాటలు పిల్లలు వినుచుండుటకుఁ గారణము, ముత్తవలు పిల్లలు చెప్పినమాటలు వినుచుండుటయేయని యొకరు చెప్పియున్నారు. తల్లిమీఁదఁ గోపగించిన బాలికయొకతె ముత్తవతల్లియొద్దకువచ్చి, "అమ్మమ్మా ! అమ్మ నన్ను అన్నము తిననిచ్చినదికాదు. నీవు కూడా తినకు" అని పలికెను.

అంతట ముసలమ్మ మనుమరాలిని బుజ్జగించి, ఉపవాసముచేయుటకోపక, "అమ్మాయీ ! నీవు అల్లరిచేసితివిగనుక నీవు అన్నము తినఁగూడదు. కాని, ఏమికర్మము నెఱుఁగని నాకీకర్మమేమి?" అని యడిగెను.

అప్పుడు పిల్ల, "అదియంతా నాకుఁ దెలియదు. నీఅమ్మాయికే భోజనము లేనప్పుడు నీ వేలాగున భోజనము చేసెదవు!" అని పలికి, వెనుకటికంటె దీనత్వముతో నేడ్చెను.

అంత మనుమరాలికై ముత్తవతల్లి యా రాత్రి యుపవాసము చేసి, ఆమె మాటయందు తనకుఁ గల యాదరణను జూపించెను.

మనుమని యొక్కయు, మనమరాలియొక్కయు కోరికల కడ్డు చెప్పక నడచుకొను ముత్తవతల్లియొక్క ప్రేమ కపటమైనదని యెంచఁగూడదు. అది యదార్థమైనదే.

---

## సా లె పు రు గు.

చూచుటకు మిగుల చిన్నదిగనుండినను, సాలెపురుగుమంచిబుద్ధితీక్ష్ణముగలజంతువు. ఇదిచేయుపనులు మిగులచిత్రముగ నుండును. వీనిలో



ననేకజాతుల పురుగులున్నవి. కొన్నిటికిమాత్రముతప్ప తక్కినవానికి నేత్రములున్నవి. ఈపురుగులకాళ్లుసాధారణముగ దేహమునకంటె నెక్కువ నిడుపుగానుండి, సూక్ష్మమైన స్పర్శజ్ఞానమును గలిగి యుండును. జంతుశాస్త్రజ్ఞులు తేలును ఈజాతిలోఁ జేర్చుదురు.

భూమిపైని చిన్నచిన్న బిలములలో గూండ్లు కట్టుకొను సాలెపురుగుల చర్యలు మిగుల చిత్రముగ నుండును. ఇవి సామాన్యముగ నెప్పుడును ఊరకుండక పని చేయుచునేయుండును. ఈజాతి జంతువులు తక్కినవానికంటె కొంచె మెక్కువజ్ఞానమును గనఁబఱచును. దీనికి నాలుగుజంటజంటలుగా నెనిమిది కన్నులుండును. ఇవి యన్నియు గుండ్రనియుండవలెనుండు తలకు పైభాగమునను, ప్రక్కలనుండి, యన్ని దిక్కులకు నొకమాఱుగా చూచుటకు వీలగును. కన్నులజంటలలో తల మధ్య నుండుజంట నేత్రములు తక్కినవానికంటె పెద్దవిగ నుండును.

సాలెపురుగులకు ముఖ్యమైన స్వాభావిక సాధనము దానిదారమే. ఇది యెప్పటికప్పుడు అల్లుకొన నవసరము లేకుండఁగ, పురుగులశరీరములోనే యెప్పటికప్పుడు పుట్టుచు వృద్ధియగుచు, అవసరమైనపుడు తోకవైపు నుండి బయటకు సాగుచుండుట కీశ్వరుఁడు ఏర్పఱచి, నేతగాండ్రకుఁ గావలసిన యుపకరణముల యవసరమును శ్రమను లేకుండఁ జేసినాఁడు. ఈదారమీపురుగుల కనేకవిధములుగ నుపకరించును. ఈదారముతో గూటియొక్క క్రింది మీఁది భాగములు మెత్తగా నుండునట్లు చేయఁబడును ; గూటియొక్క మధ్యభాగమునకు నిస్సారమైన పురుగులు మొదలగునవి రాకుండునట్లు అల్లికయల్లఁబడును ; జీవముతోనున్న పురుగుల నాహారము నిమిత్తము బంధించుటకు నుచ్చులు కట్టఁబడియుండును ; గూటిని కదలకుండ నుంచుటకు త్రాళ్లవలె పెనివేయఁబడును; సమయము వచ్చినపుడు గూటినుండి పైకి ఎక్కుటకుఁగాని, క్రిందికిదిగుటకుగాని నిచ్చెన లల్లఁబడును; సాలెగ్రుడ్లను పక్షులు మొదలైనవానినుండి కాపాడుటకు నల్లిక యల్లఁబడును.

కొన్ని దేశములలోఁ గొన్ని సాలెపురుగులు పెద్దవిగానుండి ఎక్కువ దారములేక యుండును. అవి నేలబిలములలో గొట్టములవంటి గూడు కట్టుకొని తమకున్న కొంచెము దారము నత్యంత ప్రయోజనకరముగ నుపయోగించుకొనును. ఇంతేకాదు. ఈసాలెపురుగులు ఆఁకలిగొన్న యేజంతువైనను తమకు హానిచేయవచ్చునని, భూమిలో బిలము చేయుటకుఁ దాము పైకి త్రోసివేసిన మట్టిని గూటికి తలుపువలె నేర్పఱచి, దాని యడుగు భాగము చక్కఁగ పట్టువలె మెత్తపఱచి, దట్టముగా నల్లఁబడిన దారముతో నీమట్టితలుపును గూటికి నంటించును. ఈతలుపు, సులభముగా లోపలినుండి బయటకు మార్గము నిచ్చునట్లును, బయటినుండి లోపలికి సులభముగ త్రోయఁబడ కుండునట్లును ఏర్పఱుపఁబడియుండి, యితర జంతువులకు అనుమానము పుట్టించకుండునట్లు దాని యాథార్థ్య రూపముతో నుండును. ఈతలుపులోని చిన్నచిన్న చిల్లులనుంచి శత్రువులు తలుపును తట్టినపుడు, లోనుండు సాలెపురుగు ఆచిల్లులలో తనకాళ్లు నిముడ్చి, తలుపును లోనికిలాగును. పురుగులను పట్టుకొనుటకు బయటకు పోవునప్పుడును, లోనికిఁ బ్రవేశించునప్పుడును, ఈపురుగు తలుపును తెఱచుచు మూయుచు నుండును.

మఱియొకజాతి సాలెపురుగులు నీటిపైని గూండ్లుకట్టుకొని గాలిలో జీవించుచుండును. ఇవి ఆకారమునందు తక్కినవానికంటె భిన్నముగా నుండును; కొంచెము నలుపువర్ణము గలిగియుండును. ఈపురుగు నీటిపైని గట్టినగూటిని ఒక చెట్టునకో, రెల్లుమొక్కలకో బిగించికట్టి, అక్కడనే యాహారమునిమిత్తము కనిపెట్టియుండును.

మఱియొకజాతి సాలెపురుగులు తోఁటలలోనుండును. వీనిచర్యలు గూడ మిగుల చిత్రము. ఇవి కట్టుగూండ్లు దర్శనీయములు. వీనికి గూండ్లల్లుటయందుఁగల నేర్పరితనమును గూర్చి యద్భుతపడియే పురాతన గ్రీసు దేశపువారు, ఆరక్ని అనునామె తనకు నేత పనియందుఁగల నేర్పరితనమునకు గర్వించి మైనర్వా అను దేవతతోఁ బందెము వేసి యోడిపోయి యాత్మహత్య గావించుకొనినందున, ఆదేవత జాలిగొని, ఆరక్నిని సాలెపురుగుగా బుట్టించినదని యొక కథకల్పించినారు. ఈపురుగు మొదట రెండు చెట్టుకొమ్మలకు నొకదారము నంటించి, యంతట నొక్కొక దారమునే దానికై మూలల నమర్చి యడ్డముగా నున్న దారమునుండి నిలువుగా క్రిందిభాగమునకు అల్లుకొనిపోయి, తుదకు చక్రమువలెఁ జేయును. అట్టిగూడు నొకదానిని మనము జాగ్రతతోఁ బరీక్షించితిమేని ప్రపంచములో మిక్కిలిబుద్ధిశాలియైన నేతగానియొక్క నేర్పరితనము నీసాలెపురుగులోఁ గనుగొందుము. సాలెగూండ్లలోని నిడుపుదారములు అల్లఁబడిన వెంటనే గట్టిపడు నొకవిధమైనపట్టు అనియు, గుండ్రముగా నల్లఁబడు దారములు మృదువుగాను సాగునట్టి స్వభావము గలవిగాను ఉండునట్టు అనియును, శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఈదారములు సాలెగ్రుడ్లకొఱకు అల్లఁబడు నల్లనిడుపుదారము వంటివిగావు. ఈ మూఁడు విధములగు దారములును మూఁడు వేర్వేరు నాళములనుండి యుత్పత్తియగునఁట. సాలెపురుగుదారము పట్టుపురుగు దారమునకంటె 90 రెట్లు ఎక్కువ సన్నముగా నుండును. అందుమూలమున నాదారము పట్టుదారమువలె మన కుపకరించకున్నది. అయినను 1709-వ సంవత్సరము ప్రారంభమున లూయి అను ఫ్రాన్సుదేశపు చక్రవర్తికి అప్పటిరాజపరిపాలనాధ్యక్షుఁడు సాలెపురుగు దారములతో నేయఁబడిన పాదములకును చేతులకును తొడుగుకొను దుస్తులను గానుకఁగా నిచ్చెనఁట !

ఇండియా మొదలగు ఉష్ణదేశములలో మిక్కిలి పెద్దపెద్ద సాలెగూళ్ళు చూచుచుందుము. ఈగూళ్ళు ఒక్కొక్కప్పుడు చిన్నచిన్న నీటిప్రవాహముల యిరుప్రక్కలనుండు వృక్షములకుఁ గట్టఁబడి తోరణములవలె వ్రేలాడుచుండును.

సాలెగూండ్లలోని మధ్యదారము తక్కినవానికంటె నెక్కువబలముగానుండును. ఒక సమయమందు బలమైన కీటకమేదైయైన గూటిలో చిక్కుకొన్నను, గూడు తెగి నేల వ్రాలకుండుటకే గూటిమధ్య బలమగు దారముంచఁబడును. ఏదైననొక పురుగుగాని కీటకముగాని తన వలలో

ఁజిక్కుకొన్నపుడు, కీటకము చిన్నదయిన యెడల, సాలెపురుగు దానినిబట్టి చంపి రక్తమును పీల్చి కీటకకళేబరమును క్రిందికి త్రోసివేయును. కీటకము పెద్దదయిన పక్షమున సాలీఁడు వెంటనే గూటియొక్క పెద్ద దారము వెంబడిని కీటకము చుట్టును పలుమాఱు తిరిగి, దారములతో దానిని కట్టివేయును. ఒక్కొకప్పుడు కీటకము 1,2 దినముల వఱకు చావకుండినచో, మఱికొన్ని దినములవఱకుఁగూడ దానినట్లే చిక్కువఱచియుంచి, ఆహారము లేకుండుటచే దాని ప్రాణములు పోయిన పిమ్మట దాని రక్తమును పీల్చి కళేబరమును త్రోసివేయును.

ఒకజాతిసాలెపురుగులు గోడలమీఁదను, గోడమూలలను గూండ్లు కట్టుకొనును. ఈపురుగులన్నియు, ఆహారమును సంపాదించుటయందే మిక్కిలి యద్భుతమైన జ్ఞానమును గనఁబఱచును. మఱికొన్ని పురుగులు మిగుల చిన్నచిన్నవిగనుండి, యీఁగలు దోమలు మొదలగు వానిని దుమికి పట్టుకొనుచుండును. ఎంత చిన్న జంతువైనను సర్వేశ్వరుఁడు ప్రేమయను దివ్యగుణమును సాలెపురుగునకుఁగూడ నెట్లు ప్రసాదించినాఁడో చూడుఁడు! గోడ సాలెపురుగులలోఁ గొంచెము పెద్దవిగానుండు నవి, రెండు తెల్లని బలమగు డిప్పలనల్లి, అంచు మెత్తగనుండు పట్టు నమర్చి, అందులో గ్రుడ్లను, పిల్లలనుబెట్టి, సదా తమ కాళ్లమధ్య నిముడ్చికొని తిరుగుచుండును.

ఒక జర్మనీదేశపు గణితశాస్త్రజ్ఞుఁడు సాలెపురుగు గూండ్లను గుఱించి చెప్పుచు, క్షేత్రగణితములలో వచ్చు ప్రతిమలన్నియు నీగూండ్ల యందు మనము చూడవచ్చునని చెప్పియున్నాఁడు! నేలగూండ్లకు పైకి కనిపించు నొకద్వారమును, లోపలినుండి బయటకు పోవుట కుపకరించు పైకి కనిపించని మఱియొక ద్వారమును ఉండును. సాలెపురుగు తాను వేటాడిన పురుగుల కళేబరముల నన్నిటిని గూటిముందు భాగమున విడిచిన, తక్కిన కీటకములు వానినిఁజూచి భయపడి దూరముగాఁ బోవునని, లోపలిద్వారముగుండ లోనికిఁ ద్రోసివేయును. ఈద్వారముగుండ నిట్లు త్రోసివేయఁబడిన కళేబరములు కుప్పలు కుప్పలుగ నుండును.

---



## వృక్షాదులు—నిజరక్షణము.

ప్రపంచాభివృద్ధికి, ఆత్మరక్షణమును, సంతాన రక్షణమును, ముఖ్యములనియు, ఈరెండు గుణములును జీవజంతువు లన్నిటియందును గానవచ్చుచున్నవనియు ప్రకృతిశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఈ రెండు గుణములు జంతువులకు నైసర్గికముగఁ గలిగినవేగాని, అనుభవము వలనఁ గలుగవలసినవి గావు. ఈ రెండుకార్యములను బాగుగ నెఱవేర్పనేరని జంతువులు నానాఁట క్షీణించి నిర్మూలమగును.

జీవజంతువులలోనేగాక వృక్షాదులయందుఁగూడ నీధర్మములు గానవచ్చుచున్నవి. కాని, వృక్షములకును, జంతువులకును జాలతారతమ్యము గలదు. వృక్షములకు జంతువులకువలెనే జీవమున్నను, వానివలె నొక ప్రదేశమునుండి వేఱొక ప్రదేశమునకుఁ గదలిపోలేకుండుటచేత నవి శత్రువులనుండి యంతగాఁ దప్పించుకొననేరకున్నవి. శత్రుమృగము ముట్టడించిన జంతువు పారిపోవును, అఱచును, తన కొమ్ములు కాళ్ళు, దంతములు, మొదలగు సాధనముల వలన దానితోఁ బోరాడును. అందుచేతనది యొక్కొక్కప్పుడు శత్రుమృగము నోటినుండితప్పించుకొనును. ఇఁక చెట్లన్నవో, మొలచినచోటనే యుండి తనయాకులుగాని, కొమ్మలుగాని దినివేయుచున్న జంతువునేమియుఁ జేయఁజాలకున్నది. కావున జంతువులకువలె వృక్షాదుల కాత్మరక్షణోపాయము లంతగా లేవు. ఇంతియగాక, తనదూడను జంపివేయుటకు వచ్చినపులినయిన నెదుర్కొని గోవు పోరాడి ఒక్కొక్కప్పుడు దానినిఁ దఱిమివేయఁ గలుగుచున్నది. కాని తన గింజలనుండి మొలచిన మొక్కను మృగమేదైన మేసివేయుచున్నప్పుడు పెద్దచెట్టేమియుఁ జేయఁజాలదుగదా! తనజాతిచెట్లకెన్నిఁటికో ముందాధారము కాఁబోవు తన కాయలోని విత్తనము లేపక్షులైనఁ దినివేయుచున్నపుడు, చెట్టేమియుఁ జేయజాలదు గదా! కాఁబట్టి జంతువులందుఁ గానఁబడెడి సంతానరక్షణధర్మము గూడ వృక్షాదులం దంతగాఁ గానఁబడదు.

కాని, యీ రెండు ధర్మములును, జంతువులందువలె నంతయధికముగ లేకున్నను, వృక్షములందు బొత్తిగ లేక పోలేదు. జంతువుల వలె వృక్షాదులు లోకదానిమీఁది కొకటి యుద్ధమునకుఁ బోవనావశ్యకము లేదుగావున, వానికి శత్రులతోఁ బోరాడుట కవశ్యమైన సాధనసామగ్రి లేదు; కాని వానిముఖ్యశత్రువులగు జంతువులు తమ కపాయముఁ జేయనున్నప్పుడు, తప్పించుకొనుటకు వలసిన సాధనములు మాత్రము కొన్ని వానికి స్వాభావికముగనే గలవు. సంతానరక్షణము చేసికొనుటకుఁగూడ వానికిఁ గొన్ని సాధనములు లేకపోలేదు. వృక్షములు నశింపకుండ పండ్లలో విత్తనము లేర్పడియుండును. ఈ విత్తనములే వృక్షముల సంతతి కాధారమగుచున్నవి. ఈ విత్తనములు సామాన్యముగ దట్టమగు పీఁచులోఁగాని, టెంకలోఁగాని, యమర్పఁబడియుండును. విత్తనమున కాధారమగు ముఖ్యమగు పలుకు మిక్కిలి లోపలనుండి దృఢమగు పదార్థముతోఁ గప్పఁబడియుండును. కావున నిట్టి విత్తనములు నేల రాలినను, ఎక్కడికిఁ గొట్టుకొనిపోయినను, అవి వృథాగా నశింపక, భూమిలోఁబడి, మొలక లెత్తుచున్నవి. కావున సంతానరక్షణధర్మముఁగూడఁ గొంతవఱకు వృక్షాదులందుఁ గానవచ్చుచున్నది.

వృక్షాదుల యాత్మరక్షణోపాయములు మిగుల చిత్రములుగ నుండును. సామాన్యముగఁ జెట్లకు గట్టిబెర డుండును. వృక్షరక్షణమున కిది యొక ముఖ్యసాధనము. కొన్ని చెట్లును, మొక్కలును, విషరసమును దాల్చియున్నవి. కావున జంతువులు వీనినిఁ జేరకుండును. మొక్కను సమూలముగ నమలివేయుట జంతువులకు సాధ్యము గాకుండఁ గొన్ని మొలకలు చేఁదుగుణమును గలిగియున్నవి. కాని మొక్కను జంపివేయఁజూడక, దానిమీఁద గూళ్లు గట్టుకొని నివసించుచు, దాని యాకులుమాత్రమే నమలుచుండు కొన్ని చిన్న పురుగులకు మాత్రము, మొక్క హానిచేయదు. కొన్ని మొక్కలు దుర్గంధములు వెదఁజల్లుచు, పురుగులును జంతువులును తమదగ్గఱఁ జేరకుండఁ జేసికొనుచున్నవి!



ఇఁకఁ గొన్ని మొక్కలు నూఁగు దాల్చియున్నవి. బెండ, మొదలగునవి యీ జాతిలోనివే. వీని నూఁగును, పాలును, పురుగులకు మిక్కిలి బాధ గలిగించును.

కొన్ని పెద్ద చెట్లు, మొక్కలును, ముండ్లు మొదలగు పెద్ద యాయుధములను ధరించి యున్నవి. తుమ్మ, ఈత, ఖర్జూరమును, బలుసు, ముండ్లతోటకూర, మొదలగునవి యిట్టి జాతిలోనివే. తగినంత జాగరూకత లేకుండఁ దమ్మును ముట్టడించు జంతువుల కివి బాధగలిగించును. కాని, ముండ్లతోనున్న వీనియాకులనుగూడఁ గొన్ని జంతువులు నమలివేయుట మనము చూచుచునే యున్నాము.

నాగుజెముడు జాతిలోని కొన్ని మొక్కలు, మొదటనుండి చివరవఱకును ముండ్లు దాల్చియున్నవి. వీని కీముండ్లే లేకపోయిన యెడల, దర్శనీయమయిన యాకుపచ్చని రంగుగల వీని మొదళ్లను శీఘ్రకాలములోనే పశువులు తినివేయును. ఈమొలకలలోని విశేషమేమనఁగా, వీనియాకులకనేకములు ముండ్లుండును. ముండ్లతోనిండియున్న ఆకులమధ్య మొక్క మొదలుండి, వానిచేఁ గాపాడఁబడుచుండును.

కొన్ని చెట్లకుఁ గ్రిందివరుసనున్న యాకులకుమాత్రమే ముండ్లుండును. నేల నడచుచున్న పశువులనుండి చెట్లను గాపాడుటయే యీ యాకుల యుద్దేశము!

---

## వానకాలము.

శ్రావణభాద్రపద మాసములు వర్షఋతువని వ్యవహరింపఁబడుచున్నవి. వేసవికాలమున శోషిల్లియుండు వృక్షాదులను, బడలియుండు జంతుసంతానమును, వానకాలము తన చల్లని హస్తములతో సేదదేర్చును. ఉష్ణకాలమున నెండి బెల్లులు బెల్లులుగ విరిగిపోయిన భూమి యుపరితలము, వర్షములు గురియుటవలన మరలఁ బదును పడియుం

డును. చిన్న చిన్న మొలకలును, పైరులును, పెరుఁగుటకు వేసవికాలము యుక్తమయినదిగాదు. ఈ వర్షకాలమన్ననో, పెద్దచెట్లును, మొక్కలును, విజృంభించియుండుటకేగాక, క్రొత్తచెట్లును, మొక్కలును, బెరుఁగుట కనుపడియున్నది. భూమియందంతటను, పలువిధములగు చెట్లు మొక్కలు, పాదులు, మొదలగువాని విత్తనములు వ్యాపించియుండును. ఈ విత్తనము లంతటను నుండుట మనకు గోచరింపదు. కాని, తొలకరింపఁగనే, భూమి యంతటను బచ్చపడును. కొండలుండు ప్రదేశములు గూడఁ బచ్చపడును. ఇట్లు పచ్చపడుటకుఁ గారణము, పైని జెప్పఁబడిన విత్తనములు వాన నీటివలన నుబికి, భూమిలోనుండి మొక్కలై తల లెత్తుటయే.

వానకాలమునందు, మనుజులుల్లాసము కలిగియుందురు. వేసవికాలపు వేడిమికిఁ దాళఁజాలకయుండు చిన్నపిల్లలకు వాన యమృతమువలె నుండును. అత్యుష్ణముచేత శిశువుల కెండకాలము శరీరమంతటను గొన్ని సమయములందు గజ్జి, వేడికురుపులును లేచును. ఇట్టి జబ్బులు వానకాలము ప్రవేశింపఁగనే మటుమాయమై పోవును. శిశువులకు వేసవికాలము యమునివంటిది. కావుననే రెండు మూఁడు వేసవులు దాటినఁగాని యొకపిల్లవాని బ్రతుకు స్థిరమైనదిగాదని మన దేశీయులు చెప్పుచుందురు. అట్టి పిల్లలకు వానకాలము తిరిగి జీవములు పోయుచుండును. ప్రాయము వచ్చువారికిని వానకాలమెంతో సౌఖ్యదాయకముగ నుండును. పేదసాదలను భేదములేక యందఱును వేసవికాలమున నధికోష్ణతచేత బాధపడుచుందురు. అట్టివా రందఱును మృగశిరా ప్రవేశ మెప్పుడగునా, తొలకరి యెప్పుడు ప్రారంభమగునా యని యువ్విళులూరుచుందురు. రోగులకు సామాన్యముగ వానకాలము సిద్ధౌషధము వంటిది. ఔషధసేవ చేయుటకు వానకాలమే ముఖ్యమైనదని హిందూవైద్యుల మతము. మొత్తము మీఁద జనసామాన్యము వానకాలమునఁ గలకఁదేరి యుందురు.



మనుష్యులును జంతువులునేగాక, చెట్లు చేమలుగూడ వానకాలమున నేపుమీఱి యుండును. వానకాలము రావేగమే నేల యంతయును పచ్చికచేతను, మొలకలచేతను, గప్పఁబడి యుండును. భూదేవి చిఱునవ్వు నవ్వుచుండు నటులుండును. వ్యవసాయదారులు తమ పొలములలోని పని యారంభింతురు. ఊరు విడిచి కొంత దూరము నడచిపోయి చూచితిమేని ప్రకృతికాంతయొక్క సొంపులు మనకు గోచరమగును. చల్లని నీరు దాగిపుచు వరిమొక్కలూగుచుండును. మెరక పొలములందు వంగ, బెండమొదలగు మొక్కలు వేయఁబడి యుండును. ఈ కాలమున బీర, పొట్ల, మొదలగు పాదులు పెరిగి సమృద్ధిగ ఫలించును. చేలగట్లమీఁదను, ముఖ్యముగ నింటిపెరళ్ళలోను, పూలచెట్లు వేయఁబడును. పసిడిముద్దలను బోలు బంతిపూవులును, వన్నెవన్నెలు దాల్చి కన్నుల నాకర్షించు మునిగోరింట పూవులును, మంచివాసనలు వెదఁజల్లు శ్యామంతి కుసుమములును, ఆఁడుపిల్లల కెంతో ప్రియమయినవి. వర్షము లారంభింపఁగనే వారీ మొక్కలను నాటి వాని నెంతో గారాబముతోఁ బెంచుకొనుచుందురు.

చలిదేశములలోని వారు వేసవికొఱకెట్లు పరితపించుచుందురో మన దేశము మొదలగు నుష్ణప్రదేశములలోని వారు వానకాలమున కటులె యెదురు చూచుచుందురు. సమశీతోష్ణములు గలది యగుటచేత వానకాలమందు మనమారోగ్యమును సౌఖ్యమును గలిగియుందుము. మంచి వానలు గురిసినయెడల, భూమి చల్లఁబడుటయేగాక, భూమి యుపరితలము నంటిపెట్టుకొని యుండు దుర్గంధములును, విషపదార్థములును, నశించును. జీవకోటియంతయు నొక విధమగు తత్త్వమునే గలిగియున్నటులఁ దోఁచుచున్నది. అతి వృష్ట్య నావృష్టులవలన సస్యములు చెడిపోవును. వృక్షాదులు రోగభూయిష్ఠములగును; జంతువులకును మనుష్యులకును రుగ్ణతలు ప్రవేశించును; కాటకము సంభవించును; కావున లోకక్షేమమునకుఁ గ్రమమయిన వర్షములు ముఖ్యము.

---

## తల్లి పోలికలు.



ఏప్రాయమున శిశువునకు విద్యాభ్యాస మారంభించుట యుక్తమని యొక రొక జ్ఞాని నడుగఁగా, పుట్టుట కిరువది సంవత్సరములు ముందుగ మంచిసమయమని యతఁడు ప్రత్యుత్తరమిచ్చెను! దీనియందెంతమాత్రము నతిశయోక్తి లేదు. ఇంక నీకాలము సరిపోదనికూడఁ జెప్పవచ్చును. మనయందు నైసర్గికముగఁ గానవచ్చు సుగుణ దుర్గుణములకు మన తలిదండ్రులును, పూర్వీకులును ముఖ్యకారణభూతులు. పెద్దవారివలెనే పిల్లవారును నుందురు. కావుననె, హెన్రివార్డు బీచరు అను నతఁడు, ఈ సంగతిని గుఱించి ప్రసంగించుచు, "ప్రతివాఁడును, తన తాతముత్తాతలను గోరుకొను విషయమున మిగుల జాగరూకత గలిగియుండవలె"నని చమత్కారముగఁ జెప్పెను! మంచి సంతానము గలుగవలెనని కాంక్షించు ప్రతి పురుషుఁడును, సద్వంశమున జన్మించిన సుగుణవతిని బరిణయమగుటకుఁ బ్రయత్నింపవలెను. అదే విధమునఁ గులమును గుణమును గలవరునే వనిత వివాహము చేసికొనవలెను.

మన సుగుణములు, దేహమనోదార్ఢ్యములును, వంశ పారంపర్యముగ వచ్చుచున్నవి. తాత ముత్తవల గుణములు ముఖ్యముగ మనకుఁ బట్టుపడుచున్నవని కొందఱు శాస్త్రజ్ఞులు చెప్పెదురు. తలిదండ్రుల సుగుణ దుర్గుణములును జాలవఱకుఁ బిల్లలయందుఁ గానవచ్చుచున్నవి. తమ ఘనకార్యములచే శాశ్వత కీర్తిని సంపాదించిన మహామహుల తల్లులు సామాన్యముగ సుగుణాన్వితలుగ నుండిరని చరిత్రకారులు చెప్పుచున్నారు. దీనికి నిదర్శనము లన్ని దేశములలోను గానవచ్చుచున్నవి. సుగుణసంపద గలిగిన యిల్లాలి గర్భముననే ప్రజ్ఞావంతులును, లోకోపకారపారీణులును నుద్భవమగుచుందురు. గర్భము దాల్చియుండు కాలమునకు, తల్లి మంచితలంపులు గలిగియున్నచో, పిల్లలందుఁ గూడ మంచి తలంపు లంకురించును. దీనిని గుఱించిన కొన్ని యుదాహరణము లిందుఁ బేర్కొనెదము.



భక్తాగ్రేసరులలో నొకఁడగు ప్రహ్లాదునిగూర్చి వినియున్నాము. మహాపతివ్రతయగు లీలావతి గర్భిణిగ నుండఁగా, నారదోపదేశము, తల్లి శ్రవణద్వారమున గర్భస్థశిశువగు ప్రహ్లాదుని చెవినిబడెను. కావున నాతఁడు పరమభాగవత శిఖామణి యయ్యెను. పతివ్రతయగు సుభద్ర అభిమన్యుని గర్భమున ధరించియుండఁగా, భర్తయగు నర్జునుఁడు ఆమెకు నిజపరాక్రమమును వినిపించెను. గర్భమందలి శిశువది యాలకించెను. కావుననే అభిమన్యుఁడు శూరాగ్రేసరుఁడై, బాల్యముననే కౌరవసేనపై గవిసి, ద్రోణాచార్య నిర్మిత పద్మవ్యూహము భేదించి, పగతుర వంచనమునఁ జిక్కియు వీరస్వర్గముఁ జూఱగొనెను!

స్కాచ్చికవీశ్వరుఁడైన రాబర్టు బరన్సుయొక్క తల్లి, సంతోషస్వభావముగలది. ఇంటిపనులు చేసికొనునప్పు డీమె తనకు వచ్చిన ప్రాఁతపాటలు పాడుకొనుచుండునఁట! నూఱు సంవత్సరముల క్రిందట, ఐరోపా ఖండములో మహావీరుఁడని ప్రసిద్ధికెక్కి, అనేక దేశములను జయించి ఖ్యాతినొందిన నెపోలియను బోనపార్టి తల్లి, ఇతఁడు గర్భములో నున్నపుడు గుఱ్ఱము నెక్కి భర్తతో రణరంగములకుఁ బోవుచుండెడిది. యుద్ధముసంగతి యనిన నీమె కెంతో కుతూహలమఁట! జననికిఁ గల యీ యుత్సాహమె, గర్భములో నుండు పిల్లవానికిని సోకినదా యనునట్టుగ, చిన్ననాఁడె నెపోలియను యుద్ధములను గుఱించియు, జయములను గుఱించియు, సంభాషించుచుండుచు. ఒక గ్రంథకర్త యొక చిత్రమగుసంగతిని బేర్కొనుచున్నాఁడు. గర్భవతిగనుండు సమయమున సొమ్ము చాలక యొక స్త్రీ తన భర్తపెట్టెలోనుండి రహస్యముగఁ గొంత ధనమును దొంగిలించెను. అంత నీమె కడుపునఁ బుట్టిన పిల్లవాఁడు చౌర్య స్వభావము గలవాఁడై, దగ్గఱివారి సొమ్ము నపహరించు చుండునఁట! బంధువుల సొమ్మునకేగాని పరుల ధనమున కితఁ డాశింపఁడఁట! నీతిగల సంతతిని గాంక్షించు తల్లులకీసంగతి మంచి యుపదేశము చేయుచున్నదిగదా!

ఇట్లే, పుత్రఘాతుకయగు స్త్రీ కడుపునఁ బుట్టిన పిల్లవాఁడొకఁడు, దుర్మార్గుఁడై, తుదకు ఫ్రాంసు దేశపురాజును జంపివైచెను. గొప్ప చిత్రకారుఁడైన ఫ్లాక్సుమాను, చిన్ననాఁట నుండియును బ్రతిమలు వ్రాయుటయం దభిరుచి గలిగియుండెను. విద్యావతియగు నితని తల్లి, ఇతఁడు పుట్టుటకు ముందు కొంతకాలము వ్రాఁత ప్రతిమలను జూచి వినోదించుచు, గొప్ప చిత్రకారులు గీచిన మానిసిపటముల సంగతి మనసునఁ బెట్టుకొని యుండెను. కావుననె యీమెకుఁ జిత్రలేఖనమందు నిపుణతగల తనయుఁడు గలిగెను.

గర్భవతిగ నున్నపు డెప్పుడును పుస్తకములు చదువుటయందే వినోదించిన యొక స్త్రీ, తరువాత తనకుఁ గలిగిన కవలపిల్లలిద్దఱును రెండేండ్ల ప్రాయము గలవారైయైనను, ఆడుకొనుటకు బొమ్మలకంటె పుస్తకములె ప్రీతితోఁ బుచ్చుకొని, పుస్తకములు చేతనుంచుకొని త్రిప్పుచు గంటలకొలఁది సంతోషింతురని యొక గ్రంథకర్తకుఁ జెప్పెను!

ఈ క్రింద వ్రాయఁబడిన సంగతికూడ మిక్కిలి యాశ్చర్యకరమైనది. ఒకనాఁడొక స్త్రీనిజూచుటకామె చెలికత్తెలువచ్చి, ఆమెవైపునకుఁ దమ చేతివ్రేళ్ళను ద్రిప్పి, "నీకు సిగ్గులేదా!" యని పలికిరఁట. వారు వెడలిపోయిన పిమ్మట ఆమె గదిలోనికిఁబోయి, చెలికత్తె లనిన మాటలకు దుఃఖించెను. తరువాత నీమెకుఁ గలిగిన పిల్ల యాఱేండ్ల ప్రాయము గలిగియున్నపుడు, ఎవ్వరైనను దన్నుఁజూచి, వ్రేలు చూపినపుడు ఏడ్చుచుండునఁట! ఆపిల్ల కీయలవాటు తప్పించుట దుస్తరముగ నుండెనఁట!

మూఁడునెలల ప్రాయముగల యొకపిల్ల మిక్కిలి తెలివితేటలు గలిగియుండుటఁ జూచి, దీనికిఁ గారణమేమని దానితల్లిని చెలికత్తె లడుగఁగా, తల్లియిట్లుచెప్పెను: "నేను బిల్లకీగుణము మప్పితిని. నేను ఉపాధ్యాయినిగ నున్నదినములలో చెప్పినపాఠములు గ్రహింపనేరని తెలివితక్కువ పిల్లల ననేకులనుజూచి, నాకుఁ గలుగఁబోవు పిల్లమాత్రమట్లుండక, తెలివితేటలు కలిగియుండవలె నని తదేకధ్యానముతో నుంటిని. ఇట్టి మంచి కోరిక గలిగియుండుటవలన లాభము కలుగునని నా కితరులవలనఁ దెలిసినది. దీని కిపుడు నిదర్శనము కనఁబడుచున్నదిగదా!"



తల్లినుండి పిల్లకు మనోగుణములె గాక, శరీర సంబంధమగు పోలికలును వచ్చుచున్నవి. గర్భము దాల్చిన స్త్రీ యొకతె, తాను రొట్టెలమ్ముచున్నప్పుడు, రొట్టెలు కొనుటకు వచ్చిన పిల్లలలోఁ గొందఱికి జంటవ్రేళ్ళుండుట కనిపెట్టుచుండెను. మూఁడు నెలలయిన పిమ్మట నామె రొట్టెలమ్ముట మానివైచెను గాని, జంటవ్రేళ్ళ సంగతి యా స్త్రీ మనసున దృఢముగ నాటుకొనుటవలన, ఆమెకుఁ గలిగిన పిల్లకిట్టి జంటవ్రేళ్లు వచ్చెను! ఇదేరీతిని శస్త్రముచేయఁబడిన చేయిగలబంధు వొకఁ డింటనుండుటవలన, ఒక స్త్రీకిఁ జేయిలేని శిశువుగలిగెను!

గర్భము దాల్చియుండుతల్లులు భయపడుటవలన నిట్లు వారిశిశువులకు విపత్తులు సంభవించుచున్నవి. కాని, యిట్టి భయము గలిగినపుడు తల్లి, తన శిశువున కేహానియుఁ గలుగకుండవలెనని దృఢనిశ్చయము గలిగియున్నచో, కీడేమియు రానేరదని బేయరు వ్రాయుచున్నాఁడు.

ఒకప్పుడు గర్భవతులకుఁ గొన్ని వస్తువులమీఁద మనసుండును. అవి మంచి వస్తువులైనచో, వారి కియ్యవలయును. తల్లికే వస్తువుమీఁదనైన మిక్కిలికోరికయున్న యెడల నామెగర్భమునఁ బుట్టినశిశువునకును దానిమీఁదనే కోరికయుండి, విడువకుండ నేడ్చుచుండునని యొకరు వ్రాయుచున్నారు!

ఒక గర్భిణీ స్త్రీకి హేయమగు మాంసముమీఁద వలపు గలిగెను. ఆమెకు జనించిన పిల్లవాఁడు పాలు త్రాగకుండెను. ఇది చూచి మాంసపుముక్కను దెచ్చి యీయఁగా, పిల్లవాఁడు దానిని నాకి పిమ్మట పాలు త్రాగెను! ఈ పిల్లవాఁడు పెరిగిన పిమ్మట నట్టి మాంసమును దినుచుండెనఁట!

ఈపై సంగతులను బట్టి, పిల్లల నైసర్గిక స్థితికిఁ దల్లు లెట్లు కారణ మగుచున్నారో తెలియఁగలదు. తనకు జనించు పిల్లలు మంచి స్థితిలోను మంచివారుగను నుండవలయునని తల్లి గర్భవతిగనుండు తొమ్మిది నెలలును దృఢముగా కోరిక కలిగియుండెనేని, తప్పక, యామె కోరిక యీడేరగలదని యొక గ్రంథకర్త వాకొనుచున్నాఁడు. ఈవిధమునఁ దల్లి తన పుత్రులకును పుత్రికలకును, రూపము, గుణము, ఆరోగ్యము మొదలగునవి లభింపఁజేయఁగలదు. జననీ ధర్మముల నెఱవేర్పఁబూనువారు, సద్విద్య నేర్చి, సద్ధర్మముల నాచరించుచు సద్భావనము కలిగి యెల్ల విధములను శ్రేయము గల కోరికలను గలవారై యుండ వలయును.

---

## గాడిద.

అత్తపనుల కారడులు లేవు!” మనుష్యులు కడమ జంతువుల యెడఁ జూపు కాఠిన్యమునకును, వానికిచ్చు నీచనామములకును, మేర లేదు. మూర్ఖుని ‘గాడిద’తోను, మోటువానిని ‘పంది’తోను, తెలివి లేని వానిని ‘దున్నపోతు’తోను, ఇట్లే, ఆయా దుర్గుణములు గలవారిని వివిధములగు జంతువులతోను బోల్చుచున్నాము. కాని, ఆయా జంతువులు పైకిఁ జూపించుచున్న యేదో యొక గుణమును బట్టి, ఆ జంతువులన్ని సమయములయందు నా చెడుగుణమునే దాల్చియుండు ననుకొనుచున్నాము. నిష్పాక్షికబుద్ధితో యోజించి, ఆయాజంతువుల స్వభావాదులను బాగుగఁ బరిశీలించి, వానినిగుఱించి సత్యమును గనుఁగొనక యుండు మనుష్యుఁడు, జంతువులకుఁ దానిచ్చు నీచనామములకుఁ దానే యర్హుఁ డనిపించుకొనునుగదా !

మనుష్యుని పక్షపాతబుద్ధిచేతను, వాని క్రూరత్వము చేతను ఇట్లు తగని యవమానము నొందిన జంతువులలో గాడిద ముఖ్యమైనది.



లోకములో దాదాపుగ నన్ని దేశములవారును, గార్దభమును నీచగుణములుగల దానినిగా నెంచెదరు. కాని, సత్యమును గనిపెట్టువారు మాత్రము, ఈ జంతువునందుఁ గొన్ని చక్కని గుణము లున్నవని నుడువుచున్నారు. గార్దభమునకు శాంతియు నోర్పును గలవు. క్రైస్తవమతస్థాపకుఁడగు జీసను, గార్దభమునారోహించి సంచరించుటచేత, క్రైస్తవులు దీనిని గౌరవింపవలసియున్నది. ముండ్లపొదలను భక్షించుచుండుటచేత నీజంతువును, కష్టములను దుఃఖములను లెక్కసేయని వేదాంతితోఁ గొందఱు పోల్చుచున్నారు. క్రొత్తనీటఁ జొరకుండుటనుబట్టియు, తెలియని గుంటలలోని నీరు త్రాగ సాహసింపకుండుటను బట్టియును, ఈ జంతువు గడుసుదనమును, వేగిరించి నూతనపద్ధతుల నవలంబింపకుండుటయును నరులకు బోధించుచున్నదని కొందఱు తలంచెదరు.

గాడిద మిక్కిలి శుచిగల జంతువు. మనుజులచేఁ దనకంటె నెక్కువగ గౌరవింపఁబడుచున్న గుఱ్ఱమువలె నిది యెన్నఁడును బురదలోఁ గాని, నీటిలోఁగాని, పొరలాడక, పచ్చిక బయిళ్ళమీఁదఁ బొరలును. నీటిలోఁ గాలుపెట్టుటకు వెఱచును. బురదయనిన దీని కసహ్యము. బొచ్చుగల జంతువులలో నెల్ల నిది మిక్కిలి పరిశుభ్రముగలది. దీని దేహమునం దీగలు వాలకపోవుటయే దీనికి నిదర్శనము.

గార్దభము మిక్కిలి తెలివి, మెలఁకువ, శాంతమును గల జంతువు. దీని దృఢమగు తలయును, నిడుపాటి దట్టమగు బొమలచే నావరింపఁబడి లోతుగ మెరయుచుండు కన్నుఁగవయును, ఈజంతువు తెలివిగలది యని వేనోళ్ళ చాటుచుండును. యజమానునియందు గార్దభమున కెంతో విశ్వాసము. దూరమున నుండగనే పసిపట్టి వానిని గుర్తుపట్టును. దీనికి మంచి జ్ఞాపకశక్తికూడఁ గలదు. గాడిదపిల్లలు మిక్కిలి దర్శనీయములుగ నుండును. కాని యెదిగినకొలఁదిని వానియందము చెడును. దీనిని బట్టియే “గాడిదపిల్ల కోమలము” అనునది దేశములో సామెతయైనది. ఈ జంతువును జనులు సరిగాఁ బెంపకపోవుటచేతను, మిక్కిలి క్రూర

ముగాఁ జూచుటచేతను, దీని లావణ్య మడుగంటుచున్నదని యొకానొకరు వ్రాయుచున్నారు.

గార్దభమునకు మంచిచెవులు గలవు. తన కంఠస్వరము కర్ణకఠోరముగనున్నను, దీనికి సంగీతమునం దెక్కువ యభిరుచి గలదు! డాక్టరు ఫ్రాంక్లిను అను వారు దీనికి క్రింది యుదాహరణము నిచ్చియున్నారు. చార్ట్రిసు అను నొక ప్రదేశమునందలి గాడిద యొకటి, తఱచుగా సంగీతము వినవచ్చు గ్వైరువైలు అను నొక భవనము దగ్గఱకుఁ బోవుచుండెడిది. ఆగృహయజమానురాలు మంచి కంఠస్వరముగల కాంత. ఆమెపాట యారంభించుచున్నప్పు డెల్లను, ఆగాడిద ఆయింటి గవాక్షము దగ్గఱకు వచ్చి మిక్కిలి శ్రద్ధతో వినుచుండును. ఒక దిన మావనిత మిక్కిలి శ్రావ్యముగఁ బాడెను. ఆగాడిద యప్పుడు సంతోషమును బట్టఁజాలక, గృహములోఁ బ్రవేశించి, శక్తికొలఁది నరచెనఁట!

ఈ జంతువునకు మంచిజ్ఞాపకశక్తి కలదు. ౧౮౧౬ వ సంవత్సరమున జిబ్రాల్టరునుండి మాల్టాదీవికిఁ బయనమై పోవునొక యోడలో నొక గాడిద నెక్కించిరి. దారిలో నొకచోట నోడకుఁ గొంతనష్టము రాఁగా, గాడిద నక్కడ దింపివేసిరి. అప్పుడా గాడిద ప్రయాణముచేసి నడచి నదులుదాటి, తుదకుఁ దిరిగి జిబ్రాల్టరు పట్టణముఁ జేరెను. దారిచూపువా రెవ్వరునులేక, మిక్కిలి చిక్కుత్రోవను రెండువందల మైళ్ళ దూరము నడచి, శీఘ్రకాలముననే యిలు చేరఁగలిగెను.

కొన్ని దేశములలోని గాడిదలు మిక్కిలి దర్శనీయములు. పారసీక దేశములోని గాడిదలు జంతువులలో నెల్లసుందరతమమైనవని యెన్నఁబడుచున్నవి. తక్కిన దేశములలోవలె మోటుజనులచేఁ బెంపఁబడక, ఆ దేశమున నీజంతువులు గొప్పయింటివారిచేఁ గొనఁబడి, పోషింపఁబడుచున్నవి. పూర్వకాలమున నీఖండమునందు గార్దభములు గౌరవార్హములై యుండెను. ఇప్పటికిని ఆసియా మధ్యభాగమునందలి ప్రదేశములలోని గాడిదలు మిక్కిలి ధైర్యమును, చురుకుదనమును, నమ్రతను గలిగి యున్నవి.



"నోరులేని మనతోడి జంతువులు" అను గ్రంథము వ్రాసిన జాక్సను అను దొర యొక చిత్రమగు సంగతిని జెప్పియున్నాఁడు. ఒకానొక యార్కు పరగణాలోని వ్యవసాయదారుఁడు, తన పొలములోని జంతువులలో నెల్ల మిక్కిలి సాధువుగఁ గానిపించుగాడిద యొకటి మిక్కిలి జిత్తులమారి యనియును, టక్కరితనపు పనులుచేయుటలో మొదటిదనియును జెప్పెను. ఒక దినమున, సస్యముండు నొక పొలమునకంటియుండు నొక బీడులోఁ గొన్నిగుఱ్ఱములను ఒకగాడిదను నుంచి వ్యవసాయదారుఁ డింటికి వెడలిపోయెను. అతఁడు పొలములోలేని సమయమున, ఎట్లో యాజంతువులు తప్పించుకొని, చేనిలోఁ బ్రవేశించి కొంతభాగము తినినట్టు లతనికిఁ గానఁబడెను. ఈసంగతి కనిపెట్టుటకై యతఁడు మఱుసటి దినముననఁ గొందఱిని గావలిపెట్టఁగా, వారు సత్యమును గనుఁగొనిరి. అదియేదనఁగా, బీడునకును చేనునకును మధ్యగానుండు తలుపు గడియను, గాడిద తన పండ్లతోఁ దీసివైచి, తలుపుతీసెను! ఈపని, దానితోనుండు గుఱ్ఱములకు సాధ్యముకాదయ్యెను. తమకంటె గాడిదకుఁ గలయధిక ప్రజ్ఞను గ్రహించిన గుఱ్ఱములు, గాడిద తలుపుగడియను దీయువఱకును మెల్లగ నిలువఁబడి యుండెను.

గార్దభమున కొకప్పుడు చురుకుదనముతోఁ బరిహాసాస్పదమగు మంకుతనము గూడ నుండును. ఈ క్రింది వృత్తాంతము నొక గ్రంథకర్త చెప్పియున్నాఁడు. ఒకపనివానికొక "లంకషైరు" గుఱ్ఱముగలదు. అతఁడు పయనమై పోవునపుడెప్పుడును, ఒకానొక సారాయియంగడి దగ్గఱ గుఱ్ఱమును నిలిపి, లోనికిఁబోయి తాను సారాయిత్రాగి, కొంతసారాయిని తానెక్కిన గాడిదకుఁ బోయుచుండెడివాఁడఁట. ఇట్లు కొంతకాలము క్రమముగనే గడచెను. కాని మనుష్యుల యలవాటులకుఁ జలనము గలుగుచునే యుండును గదా. ఆమనుష్యుఁడు కొంతకాలమునకు మద్యపాన

మును వదలిపెట్టెను. తన రౌతుకు మనసునఁ గలిగిన మార్పును గాడిద సహించియే యుండెనుగాని, దానివలనఁ దనకుఁగూడ గొంత మార్పు వచ్చుటకు మాత్ర మోరువకుండెను. ఏలయనఁగా, మద్యపానమును విడనాడినవాఁడు గావున, రౌతు, ఇఁక సారాదుకాణము దగ్గఱకుఁ బోకుండెను. అందుమూలమున గాడిదకుఁగూడ సారాయి లేకుండెను! ఆదారిని బోవుచు సారాదుకాణము దగ్గఱకు వచ్చినప్పుడు వెనుకటివలెనే గాడిద యాఁగుచుండెను. నడువుమని యెన్నికొట్టినను గాడిద కాలుకదల్పకుండెను. కావున తనమూలమున చెడ్డ యలవాటుగలిగిన ప్రియమగు గాడిదకు రౌతు, తన నూతన నియమమునకు గొంత విరుద్ధమైనను కొంచెము సారాయి పోయించుచుండెను

---

## రబ్బరు చెట్లు.

రబ్బరు, సీసపు ఫుల్లలతో వ్రాయఁబడు నక్షరములను దుడిచి వేయుటకును, బంతులు చేయుటకును, మోటారు మొదలగు బండ్ల చక్రములకు పట్టాలు చేయుటకును, ఇంక నిట్టిపనుల కెన్నిటికో యుపకరించును. దీనిని పలురంగులతోను, పలువిధములగు నాకారములతోను, జూచుచుందుము. ముఖ్యముగా నిది గట్టపర్చా అనియు, కూచులీ అనియు రెండు విధములయినదిగా నుండును. అందు మొదటి విధమగు రబ్బరు వేడినీళ్ళలోఁగాని, వేడిగాలియందుఁగాని యుంచినచోఁ గరఁగును. రెండవతరగతి రబ్బరట్లు కరఁగక, వెనుకటి యాకారమును, మెత్తఁదనమును, విఱుగకుండ సాగెడు స్వభావమును గల్గియుండును.

రబ్బరును జేయుటకుఁ దగిన జిగురు నిచ్చు వృక్షములు, 600 వఱకు నున్నవనియు, అందులో 112 రకములచెట్లు మన హిందూదేశములోఁ గానవచ్చుచున్నవనియుఁ జెప్పుచున్నారు. ఈ వృక్షములనుండి తీయు పాలను ఎండఁబెట్టిగాని యుడుకఁబెట్టిగాని, రబ్బరు చేయుదురు. హిందూదేశములో రబ్బరు జిగురునిచ్చు చెట్లలో ముఖ్యమైనది 'ఇండియా



రబ్బరు' చెట్టు. ఇదిగాక పనస, మఱ్ఱి, రావి, మున్నగు వృక్షము లనేకము లున్నవిగాని, వాని పాలవలన మంచి "రబ్బరు" చేయ ననువుగాదు. పనసపాలు మిగుల జిగటగా నున్నను, ఎండుట కష్టసాధ్యము. రావి, మఱ్ఱి, మొదలగు చెట్లపాలలో నావనూనెను గలిపి యొకవిధమగు బంకను చేయుదురు. దానినిఁ జిన్నపుల్లలకు రాసి, ఆజిగురు పుల్లలతో నొకయల్లిక చేసి దానిక్రింద ఎఱనంటించి పక్షులఁ బట్టుదురు. ఎగురలేక చిక్కువడిన యా పక్షులను వేటకాండ్రు పట్టుకొందురు.

"ఇండియా రబ్బరు" చెట్టు మిగులఁ బెద్దదిగాఁ బెరిఁగి విశేషస్థలము నాక్రమించును. ఎకరమునకుఁ బది చెట్లకంటె నెక్కువగా వేయఁగూడదు. ఒక చెట్టునకును మఱి యొక చెట్టునకును 60, 70 అడుగుల దూర ముండవలెను. మన దేశములో హిమాలయపర్వత ప్రాంతములందును, అస్సాము, అరకాను పరగణాలయందును, చెమ్మగలిగిన చోట్లయందును, ఈవృక్షము మిక్కిలిగా పెరుఁగును, దొరతనము వారే చాల కాలమునుండి అస్సాములో నీవృక్షములను బెంచుచున్నారు. ఇప్పుడు 2730 యకరముల భూమి రబ్బరు మొక్కల తోటలు వేయఁబడియున్నవి. ఈమొక్కను అస్సామునుండి తీసికొని పోయి, మలబారు, బంగాళా, బొంబాయి రాజధానులలో నాటిరి. కాని యక్కడ నది యంతగా వృద్ధినొందుట లేదఁట. ఒకవేళ వృద్ధిపొందినను నాచోట్లు పర్వత ప్రాంతములు కాకుండుటచేత కాఁబోలును, అక్కడ చెట్లు అంతగా పాలనిచ్చుట లేదఁట. మొదట, చెట్ల యొక్క చిన్నచిన్న కొమ్మలనుగోసి నాటి, యవి వేరుపెట్టినపిమ్మటఁ దీసి వేఱొకచోటఁ బాతి, వృక్షముగాఁ బెంచుచుండెడివారు. కాని, యట్లు పెంపఁబడెడి చెట్లు, గింజలు పాతగా మొలకలెత్తి పెరిఁగినచెట్లంత ఏపుగాను బలముగాను త్వరితకాలములోఁ బెఱుఁగకుండుటచేత, చెట్ల విత్తనములతోనే యిప్పుడు తోఁటలు వేయుచున్నారు.

'ఇండియారబ్బరు' చెట్టు మొదట పెంచినప్పుడు 30, 40 అడుగుల ఎత్తు పెరిగినదఁట. రానురాను భూసారము తగ్గినకొలఁదిని, చెట్లు విశే

పము ఎత్తుగాఁబెరుఁగుటలేదు. చెట్ల మొదట మట్టిదిమ్మలు వేసిన, చెట్లకు బలముగానుండును. ఈ వృక్షము నాటిన 50 సంవత్సరములకుఁగాని పాలుతీయుటకుఁ బనికిరాదని పూర్వమనుకొనెడివారు. ఇప్పుడుమాత్రము నాటినయిరువదియేండ్లకేపాలుతీయుచున్నారు. ఒక్కొకచెట్టువలనసంవత్సరమున కెంతో లాభము వచ్చునఁట. ఇందువలననే యీచెట్లును, తేకు, గంధముచెట్లవలెనే దొరతనమువారేగాని జనులెవ్వరును బెంపఁగూడదను నిర్ధారణ మున్నట్లు తోఁచుచున్నది.

అమెరికా ఖండములోని బ్రెజీల్ దేశము పుట్టుక స్థానముగాఁగలయొక విధముగు రబ్బరు మొక్కలను మైసూరు సంస్థానమువారు తెప్పించి తమ దేశములో నావృక్షముల తోఁటలు పెంచుచున్నారు. ఈరబ్బరు గింజలు సుమారు నెల దినములకు మొలకలెత్తి, 4, 6 సంవత్సరముల లోపల సారవంతములగు స్థలములలోఁ బెద్ద వృక్షములుగాఁ బెఱిగి, 15, 16 సంవత్సరముల నాటికి బాలిచ్చుచున్నవి. ఈచెట్లనుండి సాధారణముగా వారమున కొకమాఱు పాలుదీయుదురు. ప్రాతఃకాలముననే పాలు బాగుగా నూరునఁట. పాలుతీయు కొఱకు ముందుగా నెండుబెరడును ఊడఁదీసి, కాట్లుపెట్టిన భాగమును ఉప్పు నీటితోఁగాని నిమ్మరసము తోఁగాని గడిగి, పిమ్మట కాట్లుపెట్టి, చెట్టుమొదట పాత్రలు బెట్టుదురు. అప్పుడు కాట్లనుండి పాలూరి, క్రింద నమర్పఁబడియుండు కుండలలోనికి గారును. అట్లు కారినపాలు తోడనే గడ్డకట్టకుండునట్లు కుండలలోఁ గొంతనీటిని బోయుదురు. పిమ్మట నీటితోఁగూడిన పాలను జిలికినచోఁ బ్రశస్తమగు "రబ్బరు" బయలుపడును. ఒక్కొకచెట్టు 7 పౌనులవఱకును "రబ్బరు" నిచ్చునఁట. "రబ్బరు" పౌను రు. 2-4-0 లు చొప్పున కిమ్మతు చేయును. ఈరబ్బరు వ్యవసాయమువలన నధికమగు నాదాయము వచ్చునని యనుభవజ్ఞులు దెలుపుచున్నారు.

---



## స్వప్నములు ౧ వ భాగము:—నిద్ర.

మనకు నిద్రావస్థయందు స్వప్నము లప్పుడప్పుడు వచ్చుచుండుట యందఱికిని దెలిసినవిషయమే. జాగ్రదవస్థయందుఁ గానఁబడు సంగతులు ఒక్కొకప్పుడును, స్వభావ విరుద్ధము లయినవి యొక్కొకప్పుడును మనకుఁగలలలోఁ గానఁబడుచుండును. స్వప్నముల స్వభావమునుగూర్చి యనేకు లనేకవిధములుగా భావింతురు. మనము నిద్రించునప్పుడు మన యాత్మ మన శరీరమును విడిచి తన యిచ్ఛవచ్చినట్లీ ప్రపంచేతర స్థలములందు దిరుగుచు చూచిన సంగతులే స్వప్నములని కొందఱు తలంతురు. దేవతలవంటి వారెవరో మన యాత్మకు దెలియఁజేయు ముందలి సంగతులె కలలని మఱికొందఱు తలంచుచుందురు. కాని యీకాలమున నెల్లెడలను వ్యాపించుచున్న శాస్త్రజ్ఞానము ఈ యూహలన్నియు సరి కావని స్పష్టపఱచుచు, జాగ్రదవస్థయందు మనకుఁగల్గు ననుభవములే, జ్ఞానము కొంచెము తీక్ష్ణము తగ్గియున్నప్పుడు కలలవలెఁ గనుపడుచుండునని చెప్పుచున్నది. అట్లయిన నందఱికిని ననుభవైక వేద్యములైన స్వప్నములు స్వభావాదులనుగూర్చి తెలిసికొనుట మనకు లాభకరము కాకపోదు.

స్వప్నములు నిద్రావస్థయందే గలుగునుగదా. కావున స్వప్నములను గూర్చి తెలిసికొనవలెనన్న నిద్రావస్థయనఁగా నేమో ముందుగఁ దెలియవలెను. మనకు చూచుటకు నయనేంద్రియము, వినుటకు కర్ణేంద్రియము, ఆఘ్రాణించుటకు ఘ్రాణేంద్రియము, రుచిచూచుటకు జిహ్వేంద్రియము, తాకుటకు స్పర్శేంద్రియమునని యైదింద్రియములుగలవు. గవాక్షములవంటి యీ యింద్రియముల మూలముననే బాహ్యప్రపంచకమునందలి సంగతు లన్నిటిని మనస్సు గ్రహించుచున్నది. ఈ పంచేంద్రియములును తమకు నియతములైన కార్యములను జేయుచుండునంతవరకును, మనసను నగ్ని జ్ఞానమను నెలుతురును బ్రసరింపఁజేయుచుం

డును. ఇట్టి జ్ఞానయుతమగు మానసికస్థితికే జాగ్రదవస్థయని చెప్పుదుము. ఇట్టి స్థితిలో నున్నపుడే మనము, మన శరీరమును, మన చుట్టునున్న పదార్థములను ఎఱుంగుట తటస్థించును. కాని యిట్టి యవస్థ మార్పు లేక యెప్పుడు నొక్కవిధముగా నుండదు. జ్ఞానసాధకములగు పంచేంద్రియములును జీవజంతువులవలెనే కొంతవడి పనిచేసిన పిమ్మట విశ్రాంతిని గోరును. అట్టి విశ్రాంతియే లేకున్న నవి బలహీనములును, మందములును అయి, యచిరకాలములోనే తమ తమ పనులను జేయనేరకయుండును. కావున నింద్రియములు పగలెల్ల పనిచేసి యలసి పిమ్మట రాత్రి సమయమున తమ పనులను మాని తెల్లవారునప్పటికిం గ్రొత్తశక్తినిగల్గి తిరుగ పనిచేయుటకు సిద్ధముగా నుండును. ఇంద్రియములన్నియు తమ పనులను జాలవరకు మాని, సేదదీర్చుకొనునప్పుడే నిద్రవచ్చినదని చెప్పుదుము. మనము నిద్రించునప్పుడు బాహ్యప్రపంచము యొక్క సమాచారముల నంతంగా నింద్రియములు మనోస్థానమునకుం దీసికొనిపోవుగనుక, అప్పుడు మనస్సుగూడం గొంతవరకు తీక్షణముతగ్గి యనంగా, పనిచేయక యుండును. మఱియు మనోస్థానమైన మెదడునుండి యింద్రియస్థానములకును, ఇంద్రియములనుండి మెదడునకును, ఆజ్ఞలను, సమాచారములను నడుపుచుండు తంత్రులవంటి జ్ఞానచలననాడులు సైతము స్ఫుటముగాం బనిచేయక మాంద్యముతో నుండును. ఇందువలననే మనము మేల్కొని యున్నపుడు మన శరీరముపైని చీమవంటి మిగుల తేలిక జంతువేదియైన బ్రాకినయెడల మన స్పర్శనాడులు మన కాసంగతిని వేగమే తెలుపును; మనము నిద్రించునప్పుడన్ననో, చీమకంటె ననేక రెట్లెక్కువ బరువుగల పదార్థము మన శరీరముపైని ఉంచంబడినను సాధారణముగ దానిని గుర్తెఱుంగంజాలము. ఇట్లే తక్కినయన్ని యింద్రియములకు సంబంధించిన నాయా జ్ఞాననాడులు కొంతకాలము మాంద్యమును బూని పనిచేయకుండును. ఇట్లే జ్ఞానస్థానమగు మెదడునుండి మనకరచరణాద్యవయవములకు నాజ్ఞలను గొనిపోయి వానిచేత పనులుచేయించు చలన



నాడులును నిద్రసమయమునందు కొంతవరకు పనిచేయ కూరకుండును. కావుననే జాగ్రదవస్థయందు తమకు నియతములైన పనులను నిరంతరము చేయుచుండు అవయవములిప్పుడు కదలక, నాయకుని యాజ్ఞలేమిచే యుద్ధముచేయక యూరకుండు సైన్యమువలె పడియుండును. ఇంద్రియములును, అవయవములును, మనస్సియును ఇట్లు పొందుచుండు మాంద్యమధికముగా నున్నచో మనము గాఢనిద్రలో నున్నామనియు సామాన్యముగా నున్నయెడల సామాన్య నిద్రలో నున్నామనియుం జెప్పుదురు.

౨-వ భాగము—స్వప్న కారణములు.

నిద్రావస్థలో స్వప్నము లెట్లు గల్గునో చూతము. మనశ్శాస్త్రజ్ఞులు కొందఱు పరిశ్రమజేసి, మనస్సు అప్పుడప్పుడు కొంచెము తీక్ష్ణము తగ్గియున్నను, ఎప్పుడును కేవల జడత్వము మాత్రము వహించక కొద్దిగనో, గొప్పగనో పనిచేయుచునే యుండునని చెప్పుచున్నారు. ఇదే సత్యము కానిచో, మన మప్పుడప్పుడు కను కలలను మనము మేల్కొన్న పిమ్మట కొంతవరకైన జ్ఞాపక ముంచుకొనుటయు, రాత్రి యింతప్రొద్దు పోయిన పిమ్మట నిద్రనుండి మేలుకొనవలెనని కోరి యట్లు చేయగల్గుటయు, ఒక్కొకప్పుడు, నిద్రావస్థలోనున్నను ఇతరులు చెప్పిన పనులను జేయుటయుం దటస్థించనే తటస్థించదు. మనస్సనంగా నిది యది యని చెప్పవలనుకాదు; దానిని దానిగుణశక్తి స్వభావాదులవలననే తెలియవలెను. దానిముఖ్యశక్తులు గ్రహణ, ఆలోచన, జ్ఞాపక, హేతువాదన శక్తులు. ఈ నాల్గును సామాన్యముగా నొకదాని కొకటి తోడ్పడుచు మొత్తముమీంద క్రమముగాం బనిచేయుచుండును. అవి యట్లు పనిచేసినపుడే మనము బాహ్యప్రపంచమును గుర్తెఱుంగుటయు, అవసరమైన యాలోచనలను జేయుటయు, వెనుకటి యనుభవమును స్మరణకుం దెచ్చుకొనుటయు, హేతువాదనలను సలుపుటయును సంభవించును. మనము నిద్రించునపుడు, ఈమానసిక శక్తులు మాంద్యములై ఐకమత్యముతో నుండక, వేర్వేరుగాం బనిచేయ నారంభించును. మరియు నింద్రి

యములన్నియు విశ్రమించుచుండును. కనుక, గ్రహణశక్తికి విషయము లెవ్వియు లేక, తక్కిన శక్తులకంటె నెక్కువగ నణఁగియుండును. ఆలోచనశక్తికి బాహ్యప్రాపంచిక విషయములంతగ నావశ్యముగానందున నిద్రావస్థలోఁగూడ నాశక్తి తక్కినవానికంటె నెక్కువ చురుకుదనమును గనపరచుచుండును. కాని మనము జాగ్రదవస్థలో నున్నప్పుడు పంచదార పుల్లగనుండునని మన మెప్పుడైన తలంచుట సంభవించినచో, తోడనే మన నాలుక, చక్కెర తీపిగానుండునని మనకుఁ జెప్పి, మన యోచనాశక్తియొక్క పొరబాటును దిద్దును. చక్కెరను మనము వెనుక ననుభవించినప్పటి జ్ఞాపకముగూడ మనయాలోచన సరియైనది గాదని చెప్పును. ఇట్లే, గ్రహణ, జ్ఞాపక, హేతువాదనా శక్తులసహాయమువలన జాగ్రదవస్థయందు మనస్సు సదా తిన్నని మార్గముననే నడచుచుండును. కాని నిద్రావస్థలో నాలోచనాశక్తి యొక్కటియు నిచ్ఛావిహారిణియై తన శక్తి ముగియువరకు నాలోచనలఁ జేయుచుండును. ఇందువలననే, ఒకదానికొకటి సంబంధము లేనట్టియు, స్వభావవిరుద్ధములైనట్టియు కలలు వచ్చుచుండును. మఱియు, తక్కిన శక్తులతోఁగూడ హేతువాదనాశక్తియు నిద్దురయందు హీనమైయుండుటచేత కల కల్లయైనను నిజమైనదిగఁ దోఁచుచుండును.

మనస్సు, అదివర కింద్రియముల మూలమున సంపాదించి, కూడఁబెట్టిన లోకానుభవపు సంగతులు, నిద్దురలో స్మరణకు వచ్చుట వలనను, కొంతవరకు చురుకుతనము తగ్గినను కేవలము జడత్వము వహించని జ్ఞాననాడులు బాహ్యప్రపంచమునుండి నిద్దురలోఁగూడ నప్పుడప్పుడు సమాచారములు దెచ్చుచుండుట వలనను కల లేర్పడునని యెఱుఁగవలయును.

కావుననే, కొద్ది దినములకిందట నెవరో మనతోఁ జెప్పిన సంగతు లీదినమున మనకు స్వప్నములోఁ గానవచ్చును. మనము నిద్రించుటకు బూర్వము ముఖ్యమైన యొక సంగతినిగూర్చి దీర్ఘముగ నాలోచించియుంటిమేని, యది స్వప్నావస్థలోఁ గూడ సంభవింపవచ్చును. మఱియు



మనము సుషుప్తిఁ జెందునప్పుడు, మన యింద్రియముల కేకారణముచేతనైనఁ గొంతకదలిక కలిగెనేని, దానివలన నా యాయింద్రియములు తాము చేయు పనులను జేయుచున్నటుల మనము కలగందుము. ఉదాహరణములు:—చీఁకటి గదిలోనికి కాంతిమంతమైన దీపమునాకస్మికముగఁ దెచ్చితిమేని, అందు నిదురించువారలకుఁ దప్పక దీపపు కాంతులతో వెలుగుచుండు దివ్యమందిరమో, మహోత్సవమో కలలో నగపడును. ఇట్లే, నిద్రించుచున్నవాని నాసికకడ పరిమళ పదార్థములనుంచినచో, తాను సకలపుష్పభరితములైన తోఁటలలో సంచరించుచున్నట్టును రుచ్యమగు పదార్థము నోటిదగ్గరకుఁ దెచ్చితిమా, తాను పిండివంటలతో విందారగించుచున్నట్టును, చెవులయొద్ద విశేషశబ్దమును జేసితిమా, తాను మేఘగర్జనములు వినుచున్నట్టును, శరీరముమీఁద బరువు మోపినందువలన నచటి రక్తపు కాలువలు కట్టఁబడి, ఎవరో తనను బలవంతముగ లాగుచున్నట్టును, ఆ మనుష్యుఁడు కల గనును.

౩-వభాగము:—శరీరస్థితియే యొకప్పుడు కలలకుఁ గారణము.

పై కారణములవలననేగాక, ఇంక గొన్నిటివలనఁగూడ స్వప్నములు గలుగుచున్నవి. సర్వకాల సర్వావస్థలయందును, మన దేహమునందలి అన్నకోశము, ఆంత్రములు, శ్వాసకోశములు, కాలఖండము, మూత్రపిండములు, ప్లీహము, వృక్కకములు, హృదయము మొదలగు నవయవములు తమ పనులు తాము చేయుచుండును. ఇట్టి యవయవములు చేయుపనుల కేదైన నాతంకముగాని, హానిగాని, గలిగిన యెడల మనకు విపరీతమగు కలలు వచ్చును. మనము నిద్రావస్థలో నున్నప్పుడు, రొమ్ముమీఁద వస్త్రమైనను, మఱియే బరువగు పదార్థమైనను బడుట సంభవించినచో, ఎవరో రొమ్ముమీఁద కూర్చుని మనల మాటాడనీయకున్నట్టును, లేక, దయ్యమువచ్చి మెడ నులిమి వేయుచున్నట్టును, మనకు స్వప్నము గలుగవచ్చును. గుండెలమీఁద బరువు పడినచో ఆకాశమునకు మన మెగురుచున్నట్టు కలగందుము. ముత్రముమీఁద,

భయంకరమగు స్వప్నములు శిరస్సునకు రక్తము తిన్నగా ప్రవహింపక పోవుటచేతను, సాధారణ స్వప్నములు నాడుల చలనాదులచేతను గలుగు నని చెప్పవచ్చును. మనస్వప్నములమూలమున నొక్కొకప్పుడు మన శరీరములోనున్న రుగ్మతను దెలిసికొనవచ్చును. రక్తము, నిప్పుమంట, మొదలగు పదార్థములు కలలో మనకుఁ గానఁబడెనేని, జీర్ణకోశమో, ఆంత్రములో, ఆహారమును జీర్ణము చేయలేనట్లో, లేక యేదో యవయవము పుండుపడినట్లో మనము గ్రహింపవచ్చును. వర్షము, నీరు, మొదలగునవి స్వప్నములోఁ గాన్పించినచో, అవి ఆమత్వచదోషము నకును, శరీరమందలి రక్తము నీరగుచుండుటకును సూచనయేయని గ్రహించవలయును.

### ౪-వ భాగము:—స్వప్నములను బోలినస్థితులు.

స్వప్నములను బోలినస్థితులు కొన్ని గలవు, అవి ముఖ్యముగా పిచ్చితనము, సంధి, యోగము మొదలగునవి. ఈ యవస్థలయందు స్వప్నములందువలెనే, గ్రహణజ్ఞాపక హేతువాదనాశక్తులు తీక్ష్ణము తగ్గియుండుటచేత, మనస్సు వంకరగా నడచుచుండును. ఆకారణమువలన నొకదానితో నొకదానికి సంబంధము లేనిమాటలును, కేవలము స్వభావ విరుద్ధములైన పల్కులును, చేష్టలును, ఒక్కొకప్పుడు నిజమైన పల్కులును, అట్టియవస్థలలోనుండు మనుజులందుగానవచ్చును. సంధిలో నున్న రోగులును, నిద్రావస్థలో నున్నవారును, పూర్వమెప్పుడో తాము విని చాలకాలము క్రిందటనే మరచిన సంగతుల నేకరువుపెట్టుచున్నారు. కొందఱు నిద్దురలోనే చాలదూరము నడచిపోయి ఒడలు తెలిసిన పిమ్మట, తాము చేసిన పనిని గుర్తెఱుఁగుచున్నారు. ప్రకృతి శాస్త్రజ్ఞులవలెనే మనోశాస్త్రజ్ఞులును నూతనాంశములు గనిపెట్టుచున్నారు.

—:0:—



# తల్లి కథలు చెప్పుట.

చిన్నప్పుడు మగపిల్లలు, బండ్లు, గుఱ్ఱములు, ఆయుధములు మొదలగువాని సంబంధమగు బొమ్మలతో నాడుకొనుచుందురు. ఆఁడు పిల్లలన్ననో, సామాన్యముగ చిన్నపిల్లలను బోలిన బొమ్మలను దగ్గఱ నుంచుకొని, వానినిఁ దమకొడుకులు కూఁతులునని వ్యవహరించుచు వానికి నీళ్లు పోసెదమనియు, అన్నము పెట్టెదమనియు పలుకుచు సందడిచేయుచుఁ బ్రొద్దు పుచ్చుచుందురు. చిన్ననాఁటి యీపనులు వారిముందటి యవస్థను సూచించుచున్నవి. నిద్దురలో నైనను బొమ్మను విడువకయుండు బాలికయే తనపిల్లల నపార ప్రేమతోఁ గాపాడుతల్లిగ మాఱుచున్నది! పిల్లలయందు దయ స్త్రీకి నైసర్గిక గుణము.

కాని స్వభావ జనితమయిన యీప్రేమ యొక్కటియే తల్లికిఁ జాలదు. కని పెంచుటతోనే జననీధర్మములు పూర్తిగ నెఱవేఱవు. తనపిల్లకు వేళపట్టున నాహారపానీయము లిచ్చుట, ఆపదనుంచి దానినిఁ దొలఁగించుట, దానికిఁదగినంత సౌఖ్యము నొడగూర్చుట ఇవి తల్లిచేయ వలసిన ముఖ్యమగుపనులు. ఇంతటితో నైన నామెవిధికృత్యములు సమాప్తియగుటలేదు. శిశువు దేహమును మంచి యారోగ్య స్థితిలోనుంచి, నానాఁటఁ బెఱిఁగి పెద్దది యగు నట్టుగఁ జేయుట తల్లికి ముఖ్యమగు కార్యము. అట్లే దానిమనస్సు గూడ పరిపూర్ణారోగ్యము గాంచి, అన్నివిధముల వికసించు నట్టుగఁ జేయు తల్లియే తల్లి. పిల్ల కడుపు నిండుటతోనే తల్లి సంతోషింపఁగూడదు. త్రావినపాలు పిల్లకెట్లు బలము గలిగించునో యట్లే నానాఁట దాని మనోవికాసముఁగూడ నేయే సాధనములవలన గలుగునో తెలిసికొని, యాయా ప్రయత్నములు చేయవలయును. ఈ రెండవకార్యముగూడ మొదటికార్యమంత యావశ్యకమని తల్లులు గుర్తెఱుఁగవలయును

“బాబునకు పెండ్లి యగునని సంతోషమేగాని, అమ్మకు సవతి వచ్చునను విచారము లేదు” అతి బాల్యవివాహములు ప్రబలి యుండుట

చేత, తనకు జనింపఁబోవు పిల్లయెడలఁ జెల్లింపవలసిన విధ్యుక్తములునిర్వర్తించుటకు వధువు తగినదిగ నున్నదా లేదా యనువిచక్షణ లేకయే, పెద్దలకుఁ గన్నులపండువుగ నుండుటకై అజ్ఞానతిమిరమునఁ గన్నులు దెఱవకున్న బాల్యదశయందే బాలికకువివాహము చేయఁబడుచున్నది! అందుమూలమున విద్యాగంధములేని పదమూఁడు పదునాల్గు సంవత్సరముల ప్రాయముననే బాల ప్రసవమై జననీధర్మముల నాచరింపవలసి వచ్చుచున్నది. శారీరకశాస్త్రధర్మముల బాగుగ నెఱుఁగని స్త్రీ వివాహమునకర్హురాలు గాదని స్పెన్సరు పండితుఁడు చెప్పియున్నాఁడు. అట్టిచో బాలమాతలు తమ విధికృత్యములు నెఱవేర్పఁగలుగు టెట్లు?

తగినంత జ్ఞానముగాని, యనుభవముగాని లేక పోవుటచేత, హిందూమాత, తన విధాయకకృత్యములు బాగుగ నిర్వర్తింపలేకయున్నది. ఆహా! బాగుగ నాలోచించినయెడల, ఒకశిశువును క్రమమైన మార్గమునఁ బెంచి, విద్యాబుద్ధులు గఱపి, వానిని, గౌరవస్థానమునకుఁ గొనివచ్చుట యెంత దుష్కరమైనపని! ఇట్టి ఘనకార్యమును, తగినంత వయస్సు, జ్ఞానము లేని వేలకొలఁది హిందూబాలలు నిర్వహించుటకై నిర్బంధితులగుచున్నారని వినినపుడు నిష్పాక్షిక బుద్ధితో యోచించిన వారి కెవ్వరికి మనస్తాపము జనింపదు? కావుననేగదా మన దేశము నాగరకతాది విషయములలో వెనుకఁబడియున్నది.

ఇంటిపను లెన్నిటినో చక్కఁబెట్టుకొనవలసి వచ్చుటచే శ్రమనొంది, తక్కిన చిన్నపిల్లలను సమాధానపఱచుటయందు బడలికనొంది విసిగి వేసారుచు, ఆఁకలియని యేడ్చుచున్న యైదేండ్ల బాలునకుఁ దల్లి యొకగిన్నెలో నన్నముపెట్టి వాని దగ్గఱఁ బడవేయుచున్నది. కడుపులో మండుచున్న యాఁకలిచేతఁ గొంతయన్నము నా బాలుఁడు భుజించినను, హృదయమున మండుచున్న తల్లిమీఁది కోపముచేతఁ జాలభాగము దిగవిడిచి, నిద్దురఁ బోవుచున్నాఁడు! ఆహా! ఇదియేగదా శిశుపోషణము! వాకిట నేదో చిత్రమగు వస్తువునుజూచి, లోని కెంతో



యుత్సాహముతోఁ దల్లియొద్దకుఁ బరుగెత్తుకొనివచ్చి, "అమ్మా! నేను జూచిన దేమిటే? అది చాల చిత్రముగ నున్నదే!" యని యడుగు పిల్లను, తెంపులేని పనితొందరచేఁ దల్లి విసిగికొనుచు, ఇట్టి ప్రశ్నలచేఁ దనను మఱింత గాసిపెట్టుచున్నదని, చితుకఁగొట్టు తల్లి, రాక్షసిగాక తల్లియా యని యొకానొక గ్రంథకర్త యాశ్చర్యము నొందుచున్నాఁడు.

మాతృధర్మములఁ గ్రమముగ నెఱవేర్చుట సులభముగాదు. నిజమైన సౌఖ్యలాభములు పుత్రునకు సమకూరవలెననికోరు తల్లి, తాను మఱల బాల్యదశ ననుభవించుదానివలె, వాని నెడబాయక వాని మనస్సు, ఎవ్విధమునఁ దిరుగునో గమనించి, వాని కనుగుణముగఁ దానును మెలంగి, వాని మనశ్శక్తుల కన్నిటికిని సమయోచితముగఁ బ్రోత్సాహమును గావింపవలయును. చిన్నపిల్లల మనస్సు మన మనస్సువంటిదిగాదు. అది కోమలమయినది; చంచలమయినది, చిత్రమయినది, కోపముగాని సంతోషముగాని నిమిషమునఁ గలుగును; అంతలో జల్లాఱును. చేత నేదో యొక బొమ్మనుంచి, ఒకచోట బాలుని కూర్చుండఁబెట్టి యిక్కడనే యుండు సుమీ యని తల్లి యెంత బోధించినను, ఒకనిమిషముననే, తల్లి బోధనల వాఁడు పెడచెవినిబెట్టి, యేదియో నొకపనిమీఁద బైటికి వెడలిపోవును. అంత చెప్పినమాట వినకున్నాఁడని తల్లి పిల్లవానిని గొట్టుట క్రౌర్యముగాని వేఱుగాదు.

నిజమయిన సంతానసౌఖ్యము ననుభవింపఁ గోరు తలిదండ్రులు, తమ పిల్లలతోఁ జెలిమి చేయుచు, వారి మనోగుణము లెటులున్నవో యెప్పటి కప్పుడు గ్రహించుచు, వాని కనుగుణముగ మెలఁగుచుండవలయును. బాలుని మనస్సు మిక్కిలి విచిత్రమయిన సంగతులు వినుటయందును, అట్టివానిని కల్పించుకొని సంతోషమును భయమును బొందుటయందును వినోదించును. కాని, కల్పనాశక్తియనది బాల్యమునం దంత బలమయినదిగనుండదు. ఇంకొకరు చెప్పెడివింత సంగతులను వర్ణనలను మాత్రము బాలుఁడు మిక్కిలియాతురతతో వినఁ

గుతూహలము గలిగియుండును. కాని, పెద్దకథలు వినుటకు వానికి జాలినంత యోపికయును, గ్రహణశక్తియును నుండవు. కాఁబట్టి వివేకవతి యగు తల్లి తనపుత్రుని మనోవస్థల ననుదినమును గ్రహించుచు, వానికి గుచిగొల్పు కథలను జెప్పుచుండవలయును. అందువలనఁ బిల్లవానికి నానాఁట భావనాశక్తి హెచ్చగును: చిన్ననాఁడిట్టి కథలు వినిన స్కాటు అను నొక విదేశీయుఁడు తరువాత గొప్ప నవలల నెన్నిటినో రచించి, ప్రఖ్యాతిగాంచెను.

మనలో ననేకులకు ముత్తవతల్లులు మొదలగు వయసుమీఱిన వారియెడ నెంతో ప్రేమ గుదిరియుండును. మనలను వెన్నెలలో నేయరుగుమీఁదనో గూర్చుండఁబెట్టుకొని, చిన్నప్పుడు మనకు వారు చెప్పిన చిన్నచిన్న కతలసంగతి మన మెన్నఁడైన మఱచిపోవుదుమా ? ఆసంగతు లొక్కసారి జ్ఞాపకమునకుఁ దెచ్చుకొనినయెడల, మన కెంత సంతోషము గలుగును!

పాపము, తల్లియె యిట్లు పిల్లలకుఁ గతలుచెప్పుట కామెకు సామాన్యముగ వ్యవధియుండదు. కాని విద్యావతియగు తల్లిమాత్రము పిల్లలకుఁ గథలు చెప్పుటయందు తప్పకవినోదించును. తల్లి మంచి కత చెప్పుచుండఁగాఁ జెవులార వినుచుండు పిల్లవానికి జననియందెంతో ప్రేమ గుదురునుగదా! వేయి పొడినీతులకంటె నీతిదాయకమగు నొక మంచి చిత్రకథయే పిల్లవాని కెక్కుడుగ నుపకరించును.

పైకెంత సులభముగఁ గానఁబడినను, కతలు చెప్పుట మిక్కిలి కష్టమైనకార్యము. వయస్సువచ్చిన వారికి వినోదమగునట్టి పెద్దకతలు కల్పించుటకంటె, బాలురకు రుచ్యము సుబోధమునగు పిట్టకతలు రచించుట కష్టతరము. పెద్దవారికిని బాలురకును రుచులయందుఁ జాలభేదము గలదు. మనకుఁ గల యనుభవమును, మనోభావములును పిల్లలకు లేవనుట గమనింపవలయును. చెప్పునట్టి కతలలోఁ దగినన్ని వింతవినోదములుండవలయును. వినునట్టి పిల్లల వయసునకుఁ దగినట్టుగ నుండవలయునే



గాని, కథ మిక్కిలి దీర్ఘముగ నుండఁగూడదు. చిత్రమయిన సంగతులు చెప్పవలయునను కోరికతో ముఖ్యమగు నీతిని మఱవఁగూడదు. ఒక్కొక్కప్పుడు రాక్షసులు, దయ్యములు, మొదలగుకల్పితవస్తువులను గుఱించి ముచ్చటింపవలయును. చీఁకటి రాత్రులందు, మినుకుమినుకుమని దీప మొకమూల వెలుగుచున్నప్పుడు, చెప్పఁబడు దయ్యములు భూతములను గుఱించిన కతలు పిల్లలను భయముతో గజగజ వణకునట్లు చేయును. కాని, మన మనవసరముగ పిల్లలను భయములో ముంచివేయక, అట్టి దయ్యములుగాని రక్కసులుగాని తరువాత మంచివాఁడగు నొక పరాక్రమవంతునిచే నిర్మూలింపఁబడినవని తెల్పుచుండవలయును.

క్రొత్తకథయొకటి కల్పించునేర్పు ఎల్లవారికుండదు. బాలురకొఱ కాంగ్లేయాదిభాషలలో వ్రాయఁబడిన చిత్ర చిత్రములగు కతలు చదివినవారు మాత్రము క్రొత్తకతలను గల్పించుటకు సమర్థులుగ నుందురు. కాని యిప్పుడు మన దేశమందు ప్రాయికముగ నున్న కతలే కొన్ని కొన్ని మార్పులతో ప్రస్తుతము మనము వాడవచ్చును. మిక్కిలి చిన్నప్పుడు “ రాజు, ఏఁడు చేఁపలు ” అను కథ చెప్పుచున్నారు. దీనిలో నీతి యంతగా లేదుగాని, దీనివలన కార్యకారణ సంబంధము కొంత బోధపడవచ్చును. పిల్లల తల్లులు, తమ పిల్లల వినోదార్థమై కొన్ని కథలను సంపాదింప వలయును. “ పొట్టి పిచ్చుక కత ” “ కుక్క కత ” “ నక్కబావ కత ” “ ఎలుఁగుబంటి కత ” అను పేళ్ళతో మన దేశములో ననేక కథలు ప్రాయికముగ నున్నవి. పెద్దవారమయిన మన చెవుల కవియంతగా రుచింపకున్నను, పిల్లలవి వినుటకుఁ జెవి కోసికొందురని మనము గ్రహింపవలయును.

పిల్లలకుఁ జెప్పినకతలు, మఱల మఱల వారు వినఁగోరుచునే యుందురు. మంకుతనము మొదలగు పసితనపు చేష్టలు గనపఱచు పిల్లవాని నిట్టి కతలలోనికి రానియ్యమని చెప్పినయెడల, వాఁడుతప్పక బుద్ధి తెచ్చుకొనును. అదేవిధముగ, ఏదైన నొక మంచిపనిచేసిన యెడల,

మంచి క్రొత్త కత చెప్పెదమనిన యెడల, బాలురును బాలికలును, విధేయత నగపరచెదరు. ఒక్కొకప్పుడు, మన మదివఱకుఁ జెప్పిన కతలను వారిచే మఱలఁ జెప్పించి, వారి జ్ఞాపకశక్తిని పరీక్షించు చుండవలెను. ఈవిధముగ భారత భాగవత రామాయణాది పురాణేతిహాసములలోని కథలు చెప్పుచు వచ్చిన యెడల పిల్లవాండ్ర బుద్ధి సునిశిత మగును.

---

## రాంబందు.

వేటపక్షులు పక్షిజాతిలో నెల్ల మిగుల బలమును ధైర్యసాహసములును గలిగియున్నవి. వీనిలోఁ గొన్ని పగటిపూటయును, కొన్ని రాత్రిపూటయును ఆహారమును దినును. వీని యాహారము జంతువుల మాంసమె. ఈ వేటపక్షులు మనుష్యునికి మిక్కిలి ప్రయోజనకారులైనను, సులభముగ మచ్చిక పడునవి కావు.

పగటిపూట భోజనము చేయు వేటపక్షులలో రాంబందులు సర్వసాధారణమైనవి. ఈపక్షులు కుళ్లిన మాంసమును దినునవియైనను, ఒక్కొకప్పుడు మంచి దేహసౌందర్యమును, ఠీవిని గాంచియుండును. దాదాపుగ రాంబందుల కన్నిటికిని మెడమీఁదను, తలమీఁదను వెండ్రుకలుండవు. ఈప్రదేశములనుండి మాంసపేశములు చిన్న చిన్నవి వ్రేలాడుచుండును.

రాంబందులు తమ యాహారమును వాసనవలన గ్రహించునో, చూపువలనఁ గనుఁగొనునో, జంతుశాస్త్రజ్ఞులు నిర్ధారణ చేయలేకున్నారు. ఇప్పటి శాస్త్రవేత్తలు కొందఱును, ప్రాచీనులును, వాసనవలననే మాంసముయొక్క జాడ నీపక్షి గ్రహించునని తలంచియున్నారు. కాని ప్రస్తుతకాలపు జంతుశాస్త్రజ్ఞులు కొందఱు, చెవులు, కన్నులు, నాసిక, వీని సాహాయ్యమువలన దీనికీశక్తి కలుగుచున్నదని నిర్ధారణ చేసియున్నారు. వాసనవలనఁ గొంతవఱకీ పక్షులు కుళ్ళిన మాంసమున్న ప్రదేశ



మును గనుఁగొనుచున్నవని యందఱికిని దెలిసియే యున్నది. గాసు అనునొక జంతుశాస్త్రజ్ఞుఁడొక చెఱువులో నీఁది, కొంతసేపు కదలక మెదలక నీటిమీఁదఁ దేలియుండెను. అప్పుడొక రాంబందు వానినిఁ జూచి వాఁడు మృతినొందెననుకొని, క్రిందికి దిగివచ్చి, ఱెక్కలతో వానినిఁ గొట్టెను. కాని, పక్షి రాకను గనిపెట్టుచున్న మనుష్యుని కన్నుల చలనమును గ్రహించి, అది వానిమీఁద వాలకుండెను.

ఒకానొకప్పుడు మనుష్యుఁడు గాయపఱచిన పందియొకటి యలసి, నేలమీఁద బడిపోయి, మరణావస్థలో నుండెను. పంది లేవలేకుండు సమయమున మూఁడు ప్రక్కలనుండి మూఁడు రాంబందులు ఎగిరి వచ్చి, దానిమీఁద వాలినవి. పంది యేడ్పు వినుటవలనను, స్రవించుచున్న దాని రక్తపు వాసనను బసిపట్టుటవలనను, దాని యాకారమును జూచుటవలనను, ఈ రాంబందు లక్కడకు రాఁగలిగినవని దీనివలన మనము చెప్పవలసి యుండును.

హిందూదేశము మొదలగు నుష్ణదేశములందు మాంసము వేగమే కుళ్ళిపోవును. అప్పుడు దీనినుండి వెడలు దుర్గంధము గాలి నంతను బాడు చేయకుండ రాంబందులు మాంసమును వేగమే తినివేయును. కావుననే పట్టణముల చుట్టును పలుమాఱు రాంబందులు గూర్చుండియుండును. శవముండు నింటిమీఁదికి వచ్చి యవి వాలును. ఇంతేకాదు ముందు చావు సంభవించునని గ్రహించు ప్రదేశములలో నెల్ల రాంబందులు వచ్చి యుండును. కావుననే, వేటసమయమునను, యుద్ధభూమియందును పెద్ద పశువుల మందలుండు చోట్లను ఈ పక్షులు గుమిగూడును.

దుర్గంధము ప్రసరించు మాంసమును భుజించుట చేతను, ఒక్కొక తఱి జీవమింకను పోకుండఁగనే యేజంతువునైనను బట్టుకొను స్వభావము గలిగియుండుట చేతను, రాంబందులను మిక్కిలి యసహ్యముతోఁ జూతుము. టక్కరితనమును సూచించు వీనిచూపులు భయంకరముగనుండును. వికృతాకారము గలిగిన యీపక్షులు జంతుకళేబరము చుట్టును

జేరి, కేకలిడుచు, దాని కండరములను మ్రింగుచున్నప్పుడు, రాక్షసులు పిశాచములును మనకు జ్ఞప్తికి వచ్చును.

కొన్నిచోట్ల "రాంబందులరా" జని పిలువఁబడు నొక పక్షి కనఁబడుచున్నది. ఇది రాంబందు జాతిలోనిదే. కాని సాధారణమగు రాంబందులకంటె నిది సుందరమైనది. దీనిమెడ ఎఱుపు, పసుపు, ఊదా రంగులతో మెఱయుచుండును. ఱెక్కలమీఁది యీఁకలు నల్లగ నుండును. దీనికి రాంబందుల రాజని పేరువచ్చుటకుఁ గారణము లేకపోలేదు. రాంబందులు కొన్ని యొకజంతువు కళేబరము చుట్టును గూడి, దానిని దినుచున్నప్పుడు, రాంబందుల రాజు జాతిలోని పక్షి యొకటి యచటికి వచ్చినయెడల, తక్కిన రాంబందులన్నియు నటునిటు వెడలిపోవును. అప్పుడు రాజుగారు భోజనమారగించి వెడలిపోవుదురు. అంతఁ దక్కిన రాంబందులు మాంసమును దినుట కారంభించును. ఈ రాజుపక్షియనిన రాంబందుల కింత గౌరవముండుటకుఁ గారణ మాపక్షికిఁగల గొప్ప బలమును, ధైర్యమునే.

అమెరికా దేశమునందలి యాండీసు పర్వత ప్రాంతములందు నివసించు రాంబందు మిక్కిలి పెద్దది. ఎల్లప్పుడును మంచుతోఁ గప్పఁబడి యుండు నున్నత పర్వతములదగ్గర నిశ్శబ్దమగు స్థలములందు నివసించుట కిది యలవాటుపడి యుండును. ఇది ఱెక్కలుగల రాక్షసుని బోలియుండును.

కాండరు అను పేరుగల పెద్ద రాంబందు మేకలు, గొఱ్ఱెలు, మొదలగు జంతువులను, ఒక్కొకప్పుడు మనుష్యులను ముట్టడించును. ఒక విధమగు వడిసెలతోను వలలతోను, దీనినిఁ బట్టుకొందురు. మిక్కిలి పెద్ద కుక్కలనైన నిది తరిమివేయును. దీని ఱెక్కల వైశాల్యము 16 అడుగులకంటె నెక్కువగ నుండును. ముక్కు మొదలు తోఁకవఱకు నిడివి 4 అడుగులు. దీనికాలు మనుష్యుని మనికట్టంత వెడల్పు గలిగి యుండును. మధ్యగోరు పొడుగు 7 అంగుళములు. ఎగిరిపోవుటకు



ముందుగ నిడి పరుగెత్తవలెను. లేకపోయినయెడల ఎత్తగు ప్రదేశము మీఁదనైన నుండవలెను. కావుననే యాహారమును భుజించిన పిమ్మట దీనిని సులభముగఁ బట్టుకొని చంపవచ్చును. ఇది ముక్కుతో నొక దెబ్బ గొట్టినయెడల, మనుష్యుఁడు చనిపోవును. కాని, మనుష్యుఁడు జాగ్రతతోఁ గనిపెట్టుచున్నయెడల, వానిని గొట్టుట కిది సాహసింపదు.

దక్షిణ అమెరికాలో కారంచా, గాలినేజో, అను రెండు రకముల రాంబందులు గలవని డార్విను చెప్పెను. చనిపోయిన యే జంతువునైనను దినునపుడు తప్ప తక్కిన సమయములందవి మైత్రితో నుండవు. మొదటిజాతి పక్షి యొక చెట్టుకొమ్మమీఁద వాలి యున్నప్పుడు, రెండవజాతిపక్షి దానిచుట్టును పైకిని క్రిందికిని నెగురుచు, దానిని బొడువఁ జూచును. మొదటిపక్షి మాత్రము తలయూచుచుండును. ఈ రెండును మిక్కిలి జిత్తులమారి పక్షులు. ఇవి, గుడ్లను దొంగిలించును. గాయపడిన జంతువులను జంపును. మనుష్యుఁడు బట్టబయిటఁ బండుకొని, నిద్దుర పోవునపుడు, చుట్టుప్రక్కల నుండు పర్వతములమీఁద నివి గూర్చుండి, వానిని దురుద్దేశముతోఁ జూచుచుండును.

---

## మాంసము దిను చెట్లు.

అడవులలోఁ దాము ప్రయాణము చేయుచున్నప్పుడు, కొన్ని చెట్లు తమలోఁ గొందఱి నాకస్మికముగఁ బట్టుకొని చంపి, భుజించి వేసినవని పూర్వకాలపు ప్రయాణికులు చెప్పుచు వచ్చిరి. కాని వీరిమాటలు సత్యము కావని యిప్పటి ప్రకృతిశాస్త్రజ్ఞులు గనిపెట్టి యున్నారు. మనుష్యులను వధించి భుజించు చెట్లు లేకున్నను, అక్కడక్కడ మాత్రము చిన్నజంతువులను, పురుగులను బట్టుకొని, వాని మాంసమును మ్రింగు చెట్లుండుట సత్యము. ఈ చెట్లయాకులు వలనుబోలియుండి పురుగు లాకర్షించుటకును, వచ్చిన వానిని మ్రింగివేయుటకును దగిన సాధ

నములను కలిగియున్నవి. ఈచెట్లలో మిక్కిలి చిత్రమైనవి కూజా మొక్కలు.

---

## కూజా మొక్కలు.

ఈ మొక్కలు ఇంగ్లండు మొదలయిన దేశములలో దొరకవు. బోర్నియో దీవి మొదలగు నుష్ణప్రదేశములలో నివి పెరుగును. ఈచెట్టుమీఁదఁ బలుచని యాకుపచ్చని యాకు లనేకము లుండును. ఈయాకుల చివరలు మిక్కిలి సన్నముగ నుండును. ఆకొనలనుండి, పురుగులను బట్టుకొను వలలగు కూజాలు వ్రేలాడుచుండును. ప్రతికూజాకును ఆకు సంబంధమగు మూత యొకటి యుండును. ఈ మూతమీఁద తళతళమను రంగులతో గీతలు గీచియుండును. ఇంతియేగాక, దీనిచుట్టును క్రిందినుండియు, తేనెను స్రవింపఁజేయు నాడు లనేకము లుండును. ఈ సువాసనలచేతను, రంగులచేతను ఆకర్షింపఁబడి పురుగు లీకూజామూతమీఁద వాలి, తేనె యుండుచోట్లకుఁబోయి అక్కడనుండి కూజాలోనికి వ్రేలాడుచు, కూజాయంచు చుట్టును నుండుముండ్లను బోలిన వెంట్రుకలలోఁ జిక్కుకొని, పైకిఁ దప్పించుకొని పోనేరకయుండును. ఈకూజా లోపలియంచులు జారుచుండునుగావున, పురుగు వెంటనే కూజా యడుగున నుండు ద్రావకపదార్థములోనికిఁ బడిపోయి, దానిలో మునిఁగిపోవును. ఈ మొక్కలోపలనుండి యప్పు డూరు నొకవిధముగు పుల్లని రసము సహాయమువలన నీపురుగు మాంసము జీర్ణమై, చెట్టునకు సత్తువ కలిగించును.

ఉష్ణదేశములలో నీకూజాచెట్లు కొన్ని మిక్కిలి పెద్దవిగఁ బెరుగును. మొక్కలు చిన్నవిగ నున్నప్పు డధికముగఁ గూజాలను దాల్చి యుండును. ఈకూజా లనేకాకారములతో, అరయంగుళము మొదలు అడుగువఱకు నిడివి గలిగియుండును. బోర్నియో పర్వతప్రాంతము లందలి చెట్లమీఁద నుండు కూజా లొక్కొక్కటి యడుగున్నర నిడివి గలిగియుండి, చిన్న జంతువునుగాని, పక్షినిగాని మ్రుంచివేయుటకుఁ దగి యుండునని హూక్కరు పండితుఁడు చెప్పియున్నాఁడు.



## ప్రక్కజీను మొక్క.

సారసీనియా యను నామాంతరముగల ప్రక్కజీనుమొక్క మాంసముఁ దినుచెట్లలో నొకటి. దీనికిని కూజా మొక్కకును దగ్గర సంబంధముగలదు. అమెరికాఖండమునందలి బురద నేలలలో దీని యెనిమిది యుపజాతులు గానవచ్చుచున్నవి. కూజామొక్కయొక్క 'కూజా' ఆకుచివర వ్రేలాడునని చెప్పితిమి. ఈప్రక్కజీనుమొక్క యా కంత యును కూజావలెఁగాని, కొమ్ముబూరావలెఁగాని జుట్టుకొని యుండును. ఈ యాకులు పురుగులకు బరమశత్రువులు. ఈగలబాధను దప్పించుకొనఁగోరు మనుష్యులు, ఈయాకులను దమ గదులలో వ్రేలాడఁగట్టినపుడు, వానిలో నీగలు ప్రవేశించి చనిపోవుచుండును.

బ్రిటిషుదీవులలో నీజాతిమొక్క యొక్కటిగలదు. ఇది కందకములలోఁ దేలుచుండును. దీనియాకులకు జిన్న బుడగలవంటి వలలు వ్రేలాడును. ఈబుడగచివరను, లోపలివైపునకే దారిఁ జూపు తలుపొకటి యుండును. ఈమార్గమునఁ బురుగులు దీనిలోఁ బడి పోవుచుండును. కాని పురుగుల నిట్లాకర్షించుట కీమొక్కలో నేమి సాధన మున్నదో తెలియదు ; కూజా మొక్కయందువలె, ఈమొక్కలో జీర్ణసాధనమగు రస మూరునట్లును దోఁచదు.

## ఎండమంచు.

ఈపేరుగలమొక్క ఇంగ్లండులో నున్నది. ఈచిన్నమొక్కకు సన్నని కాడ లుండును. ఈకాడలకు వ్రేలాడుచు, భూమిమీఁదఁబడి చిన్న గులాబిపూవు రేకులవలెఁ జుట్టును ఆకు లుండును. ఈయాకుమధ్యనుండి నాలుగైదు అంగుళముల యెత్తున నొక కాడవచ్చును. దానిమీఁదఁ బూవుండును. ఆకు చలనమువలననే పురుగులు పట్టుకొనఁబడుచున్నవి. ప్రతి పర్ణముమీఁదను జిన్న మోటికె లుండును ; ఈమోటికెల చివర నుండు రంధ్రములగుండ నొకరస మూరుచుండును. ఈరంధ్రము లెండలో మంచు బిందువులవలె మెరయుచుండును గావున, మొక్కకీపేరు

వచ్చినది. ఏదైనపురుగు రంధ్రముమీఁద వ్రాలినచో, ఆచోటునుండి ఒకవిధమైన స్పర్శజ్ఞాన మాకు మోటికల కంతటికిని వ్యాపించి, అవి యన్నియు పురుగు శరీరముమీఁదికి ముణుచుకొనును. అందువలన నూపిరి తిరుగక పురుగు చనిపోవును. ఇంతలో నాకులోఁ బుల్లని ద్రవ మూరి మాంసమును జీర్ణింపఁజేయును. కొన్ని గంటలయినతరువాత, ఆకు వెనుకట్టి వలెనే కొంచెము కొంచెముగ విజృంభించును.

### ఈఁగ వల.

అమెరికాలో బురద ప్రదేశములలో నీపేరుగలమొక్క యొకటి గలదు. ఎండమంచు మొక్కవలెనే దీనికిని మధ్యనుండి చుట్టును వ్యాపించునట్టి యాకులుండును. గుండ్రముగనుండు దీనియాకు రెండు పాయలుగ నున్నను, రెండుపాయలును మధ్య గలసియే యుండును. ఆకు చుట్టును సూదులవంటి చిన్న కాడలుండును. ప్రతి పాయయును లోనికిఁ గొంచె మొరగియుండును. మధ్యను వెండ్రుకలను బోలిన మూఁడు మోటికలుండును. లోనికిఁ బ్రవేశించిన పురుగు ఇటునటుఁ దిరుగుచు, ఈ మోటికలను దాఁకును. ఇట్లు చేసినతోడనే, ఆకు రెండుపాయల కొనలును ముణుచుకొని దగ్గరఁ బడును. పురు గిట్లు లోపలఁ జిక్కువడును. పాయలకు వెలుపలిభాగమున నున్న వెండ్రుకలంత నొకదానితో నొకటి గలసిపోయి, పురుగు పారిపోకుండునట్లు చేయును. ఈవిధమునఁ బురుగు చనిపోయి, జీర్ణమగుచున్నది. ఈమొక్కలో నున్న విశేష మేమనగా, ఒకమాఱు పురుగును బట్టుకొని తినిన యాకులు సామాన్యముగ తిరిగి విజృంభింపవు. కొన్ని యాకులుమాత్రము నాలుగైదు సారులు మాంస భక్షణము చేయుచున్నవి.

---



## పిల్లల యాటలు.

బాల్యమందు నాటలయం దాసక్తియుండుట స్వాభావికము. పిల్లలకు వయస్సు వచ్చినవారికంటె నెక్కువగ నుత్సాహమును సంతోషమును గలుగుచుండును. ప్రపంచములో నేవస్తువును జూచినను, పిల్లవానికానందము జనించును. పక్షుల కలకల రవమును, జంతువుల యాటలును, మనుష్యుల మాటలును, వస్తువుల యాకారములును, వేయేల, కన్నులకు గోచరమగు పదార్థములెల్లను పిల్లల హృదయమునం దానంద రసమునుప్పొంగించును. బాలహృదయము లేఁత తమలపాకు వంటిది. కొంచెము వేడిమి తగిలినచో, లేఁతయాకు వాడిపోవును; కొంచెము చల్లఁబడినయెడల, తిరుగ వికాసము నొందును. అదేరీతిని, స్వల్పకారణముల వలననే శిశువులకు సుఖదుఃఖములు గలుగుచున్నవి. వయస్సు హెచ్చిన కొలఁదిని, హృదయ మీకోమలత్వమును గోలుపోవును. ముదిరిన యాకు శీతోష్ణముల నంతగా లెక్క చేయనట్టుగనే, మనమును పెద్దవారలమైన కొలఁదిని స్థితిగతులయందలి సామాన్యమగు మార్పుల కంతగా సుఖించుటయును, దుఃఖించుటయును లేదు.

బాహ్యప్రపంచమునందలి వస్తువులను, వానియందలి మార్పులను జూచునప్పుడేగాక, తక్కిన సమయములందుఁగూడ, పిల్లలు సంతోషింతురు. లోన జనించిన యుత్సాహము వలన గంతులు వేయుచు నవ్వుచు నుండు పిల్లలనేకులు మనకుఁ గానఁబడుచున్నారు. బాల్యావస్థలో నుండు పలువురు, అనేక సమయములందిట్లు చేయుదురు. శారీరశాస్త్రజ్ఞులు దీనికిఁ గారణము స్వభావజనితమగు శక్తియే యని నుడివెదరు. ఈ శక్తి ప్రతిమానవుని దేహమునందును గానవచ్చును. గాఢనిద్రనుండి వేకువనే లేచినప్పుడు మన కెంతో హాయిగ నుండుటయేగాక, శరీరములోనుండి శక్తి వెలుపలకుఁ బ్రసరించుచున్నట్లు గోచర మగును. ఎటువంటి బల హీనులయినను, ప్రాతఃకాలమునందు సామాన్యముగ నెక్కువ బలము

గలిగియుందురు. కావుననే, ప్రాతఃకాలము, శరీరసాధనమునకును మనోపరిశ్రమమునకును దగియున్నది. దినమునందు ప్రాతఃకాలమెట్టిదో జీవితమునందు బాల్యావస్థయు నట్టిది. బాల్యమునందు, శరీరముయొక్కయు, మనస్సుయొక్కయు శక్తులన్నియుఁ దరంగములవలె నుబుకుచుండును. కావుననే శిశువులు మాటలాడుటకును, ప్రాఁకుటకును, ఆటలాడుటకును విసుగులేక యుందురు. కావున బిల్ల లాటలాడుట యొక సంతోషముచేతనేగాదు, శరీరమునుండి పెద్ద కెరటమువలె నుప్పొంగుచున్న శక్తిప్రభావమువలననే.

సాధారణముగఁ బిల్లల కాహారపానీయములకంటె నాటలే ప్రియతరమయినవి. కొందఱు పిల్లలు, ఆటల సందడిని, భోజనము మాట బొత్తిగ మఱచియేపోదురు. అట్టివారు, చదువు, సంధ్యలు గూడ, ఆటలయుత్సాహమున మఱచిపోయెదరనిన నేమి చోద్యము ? అటువంటి సమయములందు సాధారణముగఁ దలిదండ్రులు వారినిఁ గఠినముగ శిక్షించుచుందురు. పిల్లల మేలుగోరియె వారిట్లు చేయుచున్నను వారికార్యము మాత్రము లాభకారిగాదు. ఆఆటల యందాసక్తి, ఆకలి దప్పికలవలెనే స్వభావజనితమగు వాంఛ ఆకలితో నున్న పిల్ల కాహార మిచ్చుటయును, దాహము గలిగియున్న దానికిఁ బానీయ మిచ్చుటయు నెంత యవశ్యమో, ఆటలాడఁగోరు బాలికనుగాని, బాలునిగాని, ఆట లాడనిచ్చుటగూడ నంతయవశ్యము. ఆకలిగొనియున్న శిశువున కాహార మిచ్చుటకు మాఱుగా, దానినిఁ జిదుకఁగొట్టుట యెంత నిరర్థకమును క్రూరత్వమునో, ఆటలయం దాసక్తిగల పిల్ల నా యాటలనుండి బలవంతముగ మరలించుట గూడ నంత నిరర్థకమును క్రూరత్వమును !

వివేకులగు తలిదండ్రులు, తమ పిల్లలాటలాడుకొనఁ జూచుచున్నప్పుడు వారిని నిరుత్సాహపఱుపక, సాధ్యమయినంతవఱకు వారిని హెచ్చరించెదరు. ఇంగ్లండు మొదలగు దేశములందు పిల్లలతోఁ గలసి యప్పుడప్పుడు తలిదండ్రు లాటలాడుచుందురు. దీనివలనఁ బిల్లలకుఁ



జెప్ప నలవిగాని సంతోషమును, జననీ జనకులం దపారప్రేమయును గలుగుచుండును. మన దేశమం దన్ననో యుక్తవయస్సు వచ్చిన స్త్రీ యాటలాడుట తప్పు. ఇఁకఁ బిల్లల తల్లుల సంగతి వేఱె చెప్పనక్కఱయే లేదు. ఎల్లప్పుడును వ్యవహారపు చిక్కులలోను, పని తొందరలలోను, మునిఁగి యుండు తండ్రి పుత్రులతోఁ గలసియాడుట కలలోనివార్త! ఇంతే కాదు ; ఆడుచున్న పిల్లవాఁడు తండ్రికంటఁ బడుటకు మిగుల భీతిల్లును. ఆటలందుఁ దగిలిన బాలుర కన్నులకుఁ బెద్దవారు బెబ్బులులవలెఁ గానఁ బడెదరు ! ఇది మిగుల విచారకరమైన సంగతి. సర్వకాల సర్వావస్థల యందును తన పుత్రులు పుస్తకము చేతఁబూనియె యుండవలయునని తండ్రి కోరుట మిక్కిలి న్యాయవిరుద్ధమైన సంగతి. ఏ పొద్దును విరామము లేక యాటలయందు దగిలియుండు బాలురు దండనార్హులే. కాని, తీరికసమయమునం దెప్పుడో యొకటి రెండు గడియలసేపు బాలుఁడు స్నేహితులతోఁ గలసి యాడుకొనుటయందు తప్పేమియున్నది? అట్లాడుట కలవాటుపడిన బాఁలుడే, విద్యాస్వీకారమునందు నూతనోత్సాహమును, నేర్పరితనమును జూపఁగలుగును. ఎల్లప్పుడును బుస్తకము ముందువైచికొని కూర్చుండు బాలకుని చదువు, వానివలెనే "కునికిపాట్లు" పడుచునే యుండును. ఆటలవలనను, తదితర సాధకములవలనను, ప్రతిదినమును దేహపరిశ్రమము జేయు బాలుడే, పరిపూర్ణ దేహారోగ్యము గలిగి యుండును. అటువంటి వాని బుద్ధి తీక్ష్ణతను గాంచియుండును.

కావున పిల్లల మేలుగోరు తలిదండ్రులు వారియాటలను నిరుత్సాహపఱుపక, తీరికఁ జేసికొని తాముగూడ వారితోఁ గలసి యాట లాడవలయును. పిల్లల మనోవికాసమునకు విద్య యావశ్యక మయినచొప్పుననే, వారి దేహాభివృద్ధి కాటలు మొదలగు సాధకము లావశ్యకములు.

---

## చీమలు.

చీమలు మిక్కిలి చిత్రమైన జంతువులు. చాల కాలమునుండి జనులు చీమల చేష్టలు కనిపెట్టుచున్నారు. వీనిలో ననేక జాతులు గలవు.

ముఖ్యముగ నవి యుష్ణదేశములందును, సమశీతోష్ణ ప్రదేశములందును నివసించును.

వాని యాకృతిని బట్టి చూచిన యెడల, చీమలు మిగుల బలముగల జంతువులని చెప్పవచ్చును. ఇవి మిగుల చురుకుదనము గలిగి తమ కంటెఁ బదిపండ్రెండు మడుఁగులెక్కువ బరువును మోయఁగలుగుచున్నవి. ఇవి పెద్దగుంపులుగ నివసించుచున్నవి. చీమలు మగవి, యాఁడువి, నపుంసకులు నని మూఁడుముఖ్యతరగతులుగ నున్నవి. చిన్ననాఁడే యాఁడువి కొన్ని మార్పులనొంది నపుంసకజాతి చీమలగుచున్నవి. నపుంసక జాతిలో రెండు తరగతులు గలవు. అవి, పనివాండ్రు, భటులు నని. చీమల గుంపులోఁ జాలభాగము పనివాండ్ర జాతిచీమలే. భటులు పెద్దకళేబరములను, బలముగల తలలను గలిగియున్నవి. చీమలగుంపు యొక్క సామాన్యపు పనియంతయు పనివాండ్ర తరగతి చీమలేచేయును. యుద్ధము ముఖ్యముగ భటులు చేయును. చీమగుమిలో నెపుడును మగ యాఁడుజాతుల చీమలు మిక్కిలి కొంచెముగనే యుండును. వానికి మెరయుచుండు ఱెక్కలుండును; నపుంసకులకు ఱెక్కలుండవు. ఆఁడువానికంటె మగవియును, మగవానికంటె పనివాండ్రజాతియును జిన్నవి. కొన్నిజాతులందలి యాఁడు నపుంసక తరగతుల చీమలు కొండెములు గలిగియున్నవి; ఇంకఁగొన్నిటికిఁ గొండెములు లేవుగాని, యొకవిధమగు విషమును గ్రక్కుచున్నవి.

చీమలగ్రుడ్లు కన్నులకుఁ గానిపించనంత చిన్నవిగ నున్నవి. తల్లి పెట్టినగ్రుడ్లను, పనివాండ్రతరగతిలోని చీమలు కొన్ని గుంపులుగఁ జేర్చి, జాగ్రతతోఁ గాపాడును. కొన్ని దినములలో, గ్రుడ్లనుండి పురుగులను బోలిన చిన్న చీమలు వచ్చును. అంత వీనిని బనివాండ్రుమిగుల శ్రద్ధతోఁబెంచి శుభ్రముగ నుంచును. కొంత కాలమున కీచిన్నచీమలు తిండి మానివైచి, సన్నని తెల్లనిపొరలతో దేహముగప్పుకొని, చనిపోయి నట్లుగనుండును. ఈమూఁడవ యవస్థయందును, రెండవయవస్థయందును



నుండుచీమలు తెల్లగనుండును. చీమలపుట్టను బ్రద్దలు కొట్టినపుడు, ఈతెల్లనివానినే పనివాండ్ర తరగతిలోని చీమలు నోటఁ గరచుకొని, వేవేగమె భద్రమైన తావులకుఁ గొనిపోవును.

చీమలగుమియందలి చీమల కన్నిటికిని బనివాండ్రే యాహారము తెచ్చియిచ్చుచుండును. కొన్నిచీమలు ముఖ్యముగ మాంసమె యాహారముగలవిగను, కొన్నిశాకభక్షణ చేయునవిగను నున్నవి. బ్రిటీషు దేశములోని చీమలు చలికాలమున మొరడు పారియుండి, యాహారమేమియును బుచ్చుకొనవు. ఉష్ణదేశములలోని చీమలు ధాన్యాదులను నిలువ చేసికొనును. తమ కలుగులలోనికిఁ దేమ రాకుండునటుల నివి చిన్నపుల్ల ముక్కలు, గడ్డిపోచలు, చిన్నగులకఱాళ్ళు మొదలగు వానితో సందులు గప్పివైచును.

చీమలకు బెల్లమసిన నెంతో ప్రీతి. తీక్ష్ణమగు పసివలన వీని కది యుండుచోట్లు తెలియుచున్నవి. మొక్కలకాడలమీఁదఁ బ్రాకుచుండు ఆఫైడులను చిన్నయాకు పచ్చని పురుగులిచ్చు తీయని రసమునివి పాలవలెఁ ద్రావును. కొన్నిజాతుల చీమలు ఆఫైడుల నావులవలెఁ బెంచును. ఆఫైడులుండు మొక్కల నీచీమలెక్కి, వానిని దువ్వి అవి యిచ్చు పాలను ద్రావుచున్నవి. కొన్ని చీమలీ యాఫైడులకుఁ దమ పుట్టలదగ్గఱనే నివాసము లేర్పఱచును. మన మావులకు గడ్డి పోగుచేయునట్లుగ, పచ్చనిజాతి చీమ లాఫైడులు దినుమొలకలను సమకూర్చుచుండును.

చీమల నివాసస్థలములు చిత్రముగ నిర్మాణముఁ జేయఁబడియుండును. చీమలవలెనే మనుష్యులును దమ పరిమాణమునకుఁ దగినట్లుగ గృహనిర్మాణము చేసికొనినచో వారి యిండ్లు కొండంతలేసి యగును! చీమలపుట్టల్లలోఁ జిన్నగదు లనేకములు గలవు. పరిమాణమునందు భిన్నభిన్నములుగనుండు నీగదులు వేఱు వేఱు అంతస్థులలో, గొన్ని భూమిలో లోతుగను, కొన్నిపైనయును, నమర్పఁబడి, ఒకదానినుండి మఱియొకదానికి ద్వారములు గలిగియుండును. కొన్ని చీమలు ప్రాతచెట్ల తొఱ్ఱల

లోను, కొన్ని త్రాళ్ళమధ్యను, కొన్ని చెట్లయాకు లొకదానికొకటి యంటించియును, నివాసము లేర్పరచుకొనును.

తమ నివాసముల మూలమునఁ జీమలొకదానితో నొకటి యుత్తర ప్రత్యుత్తరములు జరుపునట్లు తోఁచుచున్నది. సామాన్యముగఁ జీమలు ధైర్యశాలులుగను, జగడగొండ్లుగను నున్నవి. చీమలలో నొకదానితో వేఱొకటికిని, ఒకగుంపుతో వేఱొకదానికిని, యుద్ధములు జరుగును. మిగుల పట్టుదలతో నివి పోరాడుననుట కొక నిదర్శనము గలదు. అవి ముక్కలుగఁ జీల్పఁబడినను, కొండెముల పట్టువదలవు! కొన్ని చీమలొక విధమగు విషమును దమ శత్రువులమీఁదఁ జిమ్ముచున్నవి. ఈవిషము మనము రణరంగమున నుపయోగించు తుపాకిమందువలెనే శత్రునాశన మొనరింపఁజాలియుండును. గొప్ప యుద్ధానంతరమున, సంహరింపఁబడి నట్టియు, ముక్కముక్కలుగఁ జేయఁబడినట్టియు వేలకొలఁది చీమలు నేలఁగూలి యుండును. ఇంక నెన్నో మదుఁగులు ఖైదీలుగఁగొనిపోఁబడును.

ఎఱ్ఱనిజాతి చీమలు కొన్ని, కొన్ని నల్లనిజాతి చీమల గ్రుడ్లను చిన్నచీమలను ముట్టడించుటకు దండయాత్రలు చేసి, వానిని బట్టుకొని తమ నివాసములకుఁ గొనిపోయి, వానిని దమకు బానిసలుగఁ జేసికొనును. ఈబానిస చీమలు తమ యజమానుల కాహారము సమకూర్చుట మొదలగు పనులు చేయుచుండును.

చీమలు మనుష్యులకు సహకారులుగనున్నవి. వ్యాధిని గలుగఁ జేయు కుళ్లిపోవు పదార్థము నివి తొలఁగించి నరులకివి మహోపకారులుగ నగుచున్నవి.

## మొక్కల జీవము.

---

మనవలె చెట్లకును జీవముగలదు. మనవలె నవియు నాహారము దిని, పానీయముద్రావి, గాలిపీల్చి, ప్రాణములుగాపాడుకొనుచుఁ బెరుగు



చుండును. కాని మనకంటెఁ గొంచెము భిన్నముగ నీపనుల నవి నిర్వర్తించుచుండును. కావున జీవజంతువులనఁదగు పూవులు, మొక్కలు నెట్లు పెఱిగి పెద్దవగుచున్నవో కొంత పరిశీలింతము.

మనప్రాణము నిలుచుట కూపిరివిడుచుట ముఖ్యము. చెట్లును మనవలెనే యూపిరి విడుచును. జంతువులు శ్వాసకోశములోనికి గాలిని బీల్చినపుడు, ఆగాలిలోని ప్రాణవాయువు బీల్చి శ్వాసకోశములనుండి రక్తముతీసికొని, శరీరమున కంతటికి బ్రాణశక్తిని బ్రసరింపఁజేయును. మనము శ్వాసకోశముల నుండియేగాక, చర్మమునుండియు నూపిరి విడుచుచుండుము. ఈయూపిరి విడుచుటలో మనకును జెట్లకును జాల పోలిక గలదు. ప్రతిభాగమునుండియుఁ జెట్లు శ్వాసమువిడుచును. సూక్ష్మదర్శకయంత్రముతోఁ జెట్లయాకులను జూచిన యెడల ఆయాకుల యడుగుభాగమునఁ జిన్నచిన్న రంధ్రములు గానవచ్చును. ఈబెజ్జములలోనుండి చెట్ల యాకు లూపిరివిడుచును!

మనము తినునట్టి ముదుగగు నన్నమును చెట్లు దినవు. చెట్ల వేళ్ళు భూమిలోనికిదిగి, చుట్టుపట్ల వ్యాపించి, అక్కడవానికి లభించు తేమను బీల్చి, ఖనిజములనువాయువును గ్రోలుచున్నవి. కాని మొక్కకుఁ గావలసిన యాహారమును వేళ్ళే సంపాదింప నక్కఱలేదు. తమ మీఁదికి వీచుగాలినుండి యాకులాహారపదార్థమును గైకొని చెట్టును బోషించుచుండును. మన శరీరమందలి రక్తమువలెనే భూమినుండి వేళ్ళు పీల్చిన రసము, కాడలు, ఆకులు పూవులద్వారా మొక్క యన్నివైపులను బ్రసరింపఁగా, ఏభాగమునకు గావఁసిన సారము నాభాగము తీసికొనును. ఇట్లు మొక్కయంతయు సత్తువగలిగి పెఱుగును.

ప్రాణమున కింకొక గుఱుతు చలనము. కాని వృక్షాదులెక్కడకేని కదలిపోవుచున్నవా యని మనము శంకింప వచ్చును. కొన్ని మొలకలు వెలుతురు వైపునకుఁ దిరుగుచుండుట మనము చూచుచున్నాము. వృక్షముల చలన మనేక విధముల మనకుఁ గానఁబడును. అనేకపుష్ప

జాతులు రాత్రిపూటయందును, శీతకాలమందును ముకుళించి, సూర్య కిరణ ప్రసారమున వికసించును. "నిద్రగంటిమొక్క, మొదలగు కొన్ని జాతుల మొలకలు, ఎవ్వరైనఁ దమ మీఁదఁ జేయివైవఁగనే యాకులను ముణుఁచుకొనును. పాదులతీగలు తమ కాధార మేదైనఁ గనఁబడునా యని వెదకుచున్నట్లుగ చిత్రముగఁ బ్రాకిపోవుచుండును. ఇంకఁ జిత్రము లగు కొన్నిజాతి మొలకలుగలవు. వీని యాకులు తమమీఁద వ్రాలిన పురుగులను బట్టుకొని, ముకుళించి, ఆపురుగుల సారమును దాముద్రాగి వైచిన పిమ్మట మాత్రమె వికాసము నొందుచున్నవి! ఇంకనిట్టి చిత్ర ములగు పనులెన్నో చెట్లజాతులయందుఁగాన వచ్చుచున్నవి. వీనినన్ని టినిబట్టి, యివికూడ జంతుజాతిలోనివే యని మనము తలంపవలసి యున్నది.

———— :0: ————

## పెద్దవారియట్లె పిన్నవారు.



నదీప్రవాహము మిట్టలెక్కి ప్రవహింపనేరని విధమున తలిదం డ్రులయందుఁ గానరాని సుస్వభావము పిల్లలకుఁ గలుగుట దుర్లభము. కాని యీసత్యమును గుర్తెఱుఁగని లోకులు ప్రాయికముగఁ దమ పిల్లలు తమకంటె నెంతో సుగుణాతిశయము గలిగి యుందురని తలంచుచుందురు. వారు మీఁదుమిక్కిలి పిల్లల విద్యాభివృద్ధి విషయ మై శ్రమపడకయే, గొప్పలాభములు తమపిల్లల కదృష్టవశమునఁ గలుగునని యెదురుచూచుచుందురు. ఇట్టివారి కోరికలును, దలంపు లును వ్యర్థములేయగును గదా! ఇఁకఁ గొందఱు మాత్రము, తమ పుత్రులయొక్కయు పుత్రికలయొక్కయు ప్రవర్తన, విద్య మొదలగు వానిని గుఱించి యెంతో శ్రద్ధపుచ్చుకొనుచుండియు, తుదకు విఫల మనోరథు లగుచున్నారు.

ఈరెండుతరగతుల మనుజుల కోరికలకును భంగము గలుగు టకుఁ దగిన కారణములు లేకపోలేదు. మనము కోరినంత మాత్రము



నను, ప్రయత్నము చేసినంత మాత్రముననను, మన కీలోకములో మేలు గలుగదు. ఎటువంటి దుర్మార్గుఁడైనను, తనసంగతి యెట్లు న్నను, తన కుమారుఁడు మాత్రము మంచివాఁడు కావలెనని స్వాభావికముగనే కోరుచుండును. ఒకవేళ, అట్టివాఁడు, తనపుత్రునికి నీతి పట్టుపడుటకై, ఎన్ని ప్రయత్నములు చేసినను, ఎన్ని కోరికలు గలిగి యున్నను, దొంగవాని కుమారుఁడు దొరకుఁ గల సుగుణములు గలిగి యుండునా? ఇట్లు జరుగకుండుటకు రెండు ప్రబలమగు కారణ ములున్నవి.

వీనిలో మొదటిది:—మనుజులకు స్వాభావికముగనే తలిదండ్రుల యొక్కయు, తాతముత్తవలు మొదలగు పూర్వికుల యొక్కయు సుగు ణదుర్గుణములు పుట్టుకవలననే వచ్చును. మనకు మనపూర్వికుల దేహ పటుత్వము, శారీరక వైపరీత్యములు మొదలగునవి వారి వంశమున జన నము నొందుటవలననే ప్రాప్తించుచున్నవి. శారీరక లక్షణముల వలననే మనోలక్షణములును, మనకుఁ బుట్టుకవలననే సంప్రాప్తమగుచున్నవి. అట్టిచో నీచ దుర్గుణములు గల తల్లి కడుపున బుట్టినవాఁడును, దుష్ప్ర వర్తనగల వారివంశమున జనించినవాఁడును, చెడ్డవాఁడయ్యెనేని పరితపిం చు టెంత వెఱ్ఱిపని!

రెండవకారణము:— చిన్ననాటనుండియు మన యనుభవము నకు వచ్చిన సంగతులే మనల నాకర్షించుచుండును. కన్నులారమనము గాంచుచుండు మన తల్లిదండ్రుల యొక్కయు, బంధువులయొక్కయు, కార్యములును పద్ధతులును మన భవిష్యత్ప్రవర్తనకు ముఖ్యప్రమా ణములగును. మనల నెంతో ప్రేమతోఁ బెంచు తలిదండ్రుల చేష్టలే మనకు నిదానములై, వారి గుణావగుణములు ఉగ్గుపాలతోఁ బెట్టినట్టుగ మనకుఁ బట్టుపడును. ఒక పిల్లవానితల్లి కల్లలాడుటకు వెఱవకుండునట్టి దనియును, తండ్రి యన్యాయమున కొడిగట్టువాఁడనియు ననుకొందము, జననీజనకుల యధర్మప్రవర్తనమును జిన్ననాఁటి నుండియుఁ గనిపెట్టు

చుండిన పిల్లవానికి, కొంతవయస్సు వచ్చినపిమ్మట, తలిదండ్రులు నీతివిద్యలను జెప్పించి రనుకొందము. మధ్యగా వినుచున్న నీతి వచనములకంటె, మొదటినుండియు నలవాటైన కుటిలవర్తనమే పిల్లవాని హృదయము నెక్కువగ నాకర్షించును. ఇతరుల వట్టి మాటలకంటె వారి ప్రవర్తనమే మనుష్యుల స్వభావము నెక్కువగఁ బురికొల్పఁ గలదు. బాలురకుఁగాని, బాలికలకుఁగాని బోధచేయువారి ప్రవర్తన యందు, వారు బోధించెడి నీతిధర్మములు గొంతవఱకుఁ గానఁబడినఁ గాని, నీతియంతగాఁ బట్టువడదు. చెవులకంటెఁ గన్ను లధికతీక్ష్ణములైనవి. అప్పుడప్పుడు వినవచ్చుచుండెడి శతాధిక హితవచనములకంటె, నొక్కపర్యాయ మితరుల నడతయందుఁ గానఁబడెడి గుణము గాఢముగా, మనస్సున నాటుకొనును.

కావున, పిల్లలు సత్ప్రవర్తనము గలవారు కావలెనన్నచో, మనమె ముందుగ మంచిత్రోవను నడువవలయును. మన ప్రవర్తనను జక్కపఱచుకొనక, మన పిల్లలకుమాత్రము నీతిబోధఁ జేయఁజూచుట నిష్ప్రయోజనము. మన బోధనలకు మననడత దృష్టాంతముగ నున్నప్పుడే మనపిల్లలు మంచివారగుట సంభవించును.

---

## చెదపురుగులు.

ఇంటి సామానును ముఖ్యముగా పెట్టెలు, వస్త్రములు మొదలగు వానిని జాగ్రతతోఁ గాపాడక, యింట నెక్కడనో విడచివేసి యూరకుండు గృహయజమానురాలి యజాగ్రతను వెంటనే బయలుపెట్టునది చెదపురుగు. ఇది తెల్లచీమవలె నుండుటచేత దీనిని కొన్ని దేశములలో తెల్లచీమయనియే పిలుతురు. ప్రపంచములోని యుష్ణదేశములలో నెల్ల నీపురుగు లపరిమితముగా నుండును. ఉష్ణదేశములలోను, ఇసుక తెరగా నుండు గరువు ప్రదేశములలోను విస్తారముగా నివి యుండును. ఇవి ముఖ్యముగా తిను ఆహారము కఱ్ఱ, కొయ్యముక్కలు, కాగితములు, వస్త్రములు మొదలగునవి యేవియైన నొకటి రెండు రోజులు గదల్పక యున్నతావుననే యున్నపక్షమున వాని నీ చెదపురుగులు పట్టుకొని తినివేసి యనుపయోగములుగాఁ జేయును. ఒక్కొక్కప్పుడు మన కెంతో ప్రీతికరములగు వస్తువులీ పురుగులవలన పూర్ణముగా నష్టమైపోవును. చూచుటకు గట్టిగా నున్నటుల గనిపించు దూలములు మొదలగునవి లోని భాగము చెదవలన నణచి గుల్లయై యుండును.



ఈ పురుగులలో చిన్నవిగను, తెల్లగను నుండు వానిని గొన్నిటిని, గోధుమవర్ణము గలిగి కొంచెము పెద్దవిగ నుండువానిని గొన్నిటిని మనము సాధారణముగఁ జూచుచుందుము. ఈ రెండవ జాతి పురుగులను "కత్తెరచెద" యని కొందఱు చెప్పుదురు. కారణమేమనఁగా నవి నేలమీఁద కొయ్యవస్తువేదిగాని కొన్ని నిమిషములు మాత్రము నిలువఁగాఁబడియుండిన, దానినిఁ బట్టుకొని కొన్ని నిమిషములలోనే తినివేయును. ఈ చెదపురుగులు ఒక్కొకప్పుడు కత్తెరతోఁ గత్తిరించినట్లును, కత్తితోఁ గోసినట్లును, వస్తువులను సమముగాఁ దినివేయును. కొంచెము చెమ్మగిల్లియున్న వస్తువులకు వేగముగా చెదపట్టును. లోహములు, పలువిధములగు మన్ను తప్ప, ఈపురుగు తినని పదార్థమే లేదు. భూమిలో పాతిపెట్టఁబడు కొయ్యలు, స్తంభములు మున్నగువానికి నీపురుగులవలని భయమంతగా లేకుండుటకై భూమిలో నుండు భాగమునకు "తారు" రాసెదరు. తినుటకు వేరు ఆహారము భూమిలోఁ గనిపించనపుడు ఈపురుగులు తాము మట్టితోఁ గట్టుకొనిన కప్పుక్రిందనుండి జీవవృక్షముల బెరడును కూడ తినును. చెదపురుగులు సాధారణముగా భూమిలోనుండును. మానుష సంచార మంతగా లేనిచోట్ల, భూమిలో గూండ్లు త్రవ్వుకొని, యట్లు త్రవ్వగా వచ్చిన మట్టిని ఎత్తుగా పుట్టలు పోయును. ఈపుట్టలు కొన్నిచోట్ల 12 అడుగులవఱకు పొడవును బలమును గలవియై మనుష్యుఁడు దానిపై నెక్కినను అణఁగకుండును. కొన్నిపుట్టలు లేడి

కొమ్మల వలెను, చెట్లవలెను ఆకారము గలిగి యుండును. పుట్టలు మిగుల పెద్దవిగనున్నపుడు వానిలోనికి సర్పములు చేరును. పుట్టలలో నడుగుభాగముననే పురుగులుండును; పైభాగము గూటి కప్పువలె నుండి శత్రువులవలని భయమును, గాలి, వర్షము, ఎండ మొదలగువాని వలని భయమును చాలవఱకు నివారించును. పుట్ట మధ్యభాగము పురుగులలో 'రాణిపురుగు'నకు ప్రత్యేక మొక గూడు కట్టఁబడును. ఇందులో 'రాణిపురుగు' గూడు గుమ్మము పట్టకుండునంతవఱకు పెరిగి, నిమిషమునకు 50, 60 గుడ్లచొప్పున రెండుసంవత్సరములు రేయుంబగళ్ళు గుడ్లుపెట్టును. ఈ గుడ్లు లక్షలకొలఁదియై పెరిగి పురుగులగుచుండును. పురుగులసంఖ్య పెరిగిన కొలఁది గూండ్లుకూడ పెద్దపెద్దవిగ జేయఁబడును. ఇట్లు చేయుటలోఁ బురుగులు చూపుచుండు చురుకుదనమును నేర్పరితనమును మిక్కిలి యద్భుతమైనవి. ఈ పురుగులలోఁ గొన్ని యుద్ధము చేయు పురుగులుండును. వానికి తక్కిన పురుగులకంటె పెద్దతలలుండును. వాడియైన పొడుగుపాటి కోరలుండును. ఆవశ్యమగునపుడు, ఇవి తమ బలాతిశయమును, ధైర్యమును గనఁబఱచును. రాణిపురుగుయొక్క గూడునకు అన్ని ప్రక్కలను యుద్ధముచేయు పురుగుల గూండ్లుండును. ఇవిగాక పుట్టలలో నింక మఱెన్నియో గూండ్లుండును. అందులోఁ గొన్నిటియందు ఆహారము నిలువచేయఁబడును ; కొన్నిటిలో గుడ్లు పెరుగుచుండును.

తమ గూటినిగాని, పుట్టనుగాని శత్రువు లేవియైన ముట్టడి వేయఁబోయినపక్షమున, గూటిపని చేయు పురుగులు లోనికిఁ బారిపోవును. యుద్ధముచేయు పురుగు లొకటి రెండు ముందుగ వెలుపలికివచ్చి, శత్రువుల స్థితిగతులను బలాబలములను దెలిసికొని, తక్కినవారికి తెలియజేయును. వెంటనే యుద్ధముచేయు పురుగులన్నియు వరుసలుగట్టి శత్రువుల నెదుర్కొనును. ఇట్టి చిన్నయుద్ధములు చూచుటకు మిగుల చిత్రముగనుండును. ఒక్కొకప్పుడు పుట్టపైనుండి దొరలి కొన్ని పురుగులు



మిగుల చురుకుదనముతోఁ బైకి నెగఁబ్రాకుచు, కన్నులు లేనివౌటచే తమ శరీరమునకు నేది తాకిన దానిని గఱచుచుండును. యుద్ధము బలమైనపుడు ఒక విధమగు శబ్దముకూడ వినఁబడును. ఈ పురుగులకు ధైర్యసాహసములు మెండు ; తమ దేహమునకు తాకినదానిని గట్టిగా నోటఁబట్టి కఱచుచు దేహము ముక్కముక్కలుగా తెగిపోవువఱకు లాగినను పట్టు విడువకుండును.

చెదపురుగుల శత్రువులలో మిగుల భయంకరమగు శత్రువు ఎలుగుగొడ్డు. అది పుట్టకడకుఁబోయి, గోతులు త్రవ్వి, పుట్టబిలముపైని నోరుపెట్టి వేలకొలఁది పురుగులను పీల్చి తినును. కోడి, గోరువంక, పాము మొదలగు నవికూడ చెదపురుగులను భక్షించును. ఇంతియె కాదు. కొందఱు మనుష్యులుగూడ వీనిని భక్షించెదరు. మన దేశమునందలి యానాదులు మొదలగువారును మఱి కొన్ని దేశములవారును, ఈ పురుగులు మిగుల రుచ్యమగు నాహారమని భావింతురు. చెదపుట్టలను త్రవ్వి, బైటకువచ్చిన పురుగుల నొకపాత్రలోనికి బట్టి వాని నినుప పెనములలో వేయించి జనులు భక్షింతురు. ఇవి రుచివిషయమున శర్కర చేర్పఁబడిన మీగడవలెనుండి మిగుల బలమునిచ్చునఁట !

---

## కుటుంబములో నైకమత్యము.

---

లోకములో మనుష్యులకుఁ గల కష్టములలో నెల్ల కుటుంబ కలహములు మిగుల దుర్భరములైనవి. ఇంటిలో నుండువారందఱు నైకమత్యము గలిగి యున్నచో, నిల్లు భూలోక స్వర్గమువలెఁ గానిపించుననియు, అట్లుగాక, పరస్పర వైషమ్యములును గలహములును నుండిన యెడల, జీవితము మృత్యుసమానమైనదిగఁ దోఁచుననియును, అందఱికిని దెలిసిన విషయమే. ఈ సంగతి తెలిసి యుండినను, మనుజు లొకరితో నొకరు పోరుచునే యున్నారు. ఇట్టి పోరాటములకుఁ గారణములు లేక

పోలేదు. మన దేశమున సాధారణముగా నతిబాల్య వివాహములు జరుగుచుండుటచేత, భిన్నాభిప్రాయములును, ఒండొరులకు విరుద్ధమైనట్టి రుచులును గలిగిన స్త్రీపురుషులకు వివాహబంధమేర్పడు చున్నది. పురుషుఁడును స్త్రీయును, ఒకరి గుణము లొకరామోదించి, ఒకరి నొకరు ప్రేమించుట వలననే, వివాహ బంధము గలుగవలయును. అట్లుగాక, ఒకరి గుణములును స్వభావమును రెండవవారికిఁ దెలియని బాల్యావస్థయందే, వివాహము జరుగుచుండుట వలన, కుటుంబ కలహముల కవకాశము గలుగుచున్నది.

దేశక్షేమము గోరువారందఱును ఇట్టియనర్థముల కెల్ల జన్మస్థానమగు నతి బాల్యవివాహములను రూపుమాపుటకుఁ బ్రయత్నములు చేయుచునే యున్నారు. కాని యతి బాల్య వివాహములు చేయుటయను ఆచారము నానాట పోవలసినదియే కాని, ఒక్కసారిగా పోవునది కాదు. ఆయాచారము దిద్దుబాటైనచో, ముందుకాలము నందలి స్త్రీపురుషుల స్థితి బాగుపడ వచ్చునుగాని, ప్రస్తుతకాలపువారి కంతగా లాభకారిగానుండ నేరదుగదా. కావున నిప్పటి వారికి కుటుంబము నందలి కలహములు మొదలగునవి యణఁగిపోవుటకును, ఐకమత్య మేర్పడుటకును, గావలసిన పనులు మనము చేయవలయును; అట్టి సంగతులు మనము యోజించవలయును.

కుటుంబము బజారువంటిది కాదు. మనకేదైన నొక వస్తువు కావలసిన యెడల, బజారునకుఁబోయి, ఆవస్తువు వెలను గుఱించి బాహాటముగా వర్తకునితో బేరముచేసి, మోమోటమేమియు లేక వానితో మాటాడుదుము. మనకు ప్రధానమైనది వస్తువేకాని, అమ్మువాని మనసుగాదు. సాధ్యమైనంత తక్కువవెల కీవస్తువు వచ్చునేమో యనియే మనము ప్రయత్నించు చుందుముగాని, మనము పలుకుమాటలకు వానిమనసు నొచ్చునేమో కదా యని మనము యోజింపము. ఇఁక కుటుంబములో మాత్రము మనమిట్లు మెలఁగఁగూడదు. కుటుంబములో



నుండువారి సంబంధము చిరకాలముండునది కావునను, ఒకరి మీఁద నొకరికి తగినంత ప్రేమానురాగము లుండినగాని జీవయాత్ర సలుపుట దుర్ఘటముగా నుండును గావునను, ఏకకుటుంబములో నుండువారు, తమతమ, తాత్కాలిక సౌఖ్యముల కొఱకుగాని, కష్టములవలన గాని, ఒండొరులను దూలనాడఁగూడదు. తమ వారిని దూషించినచో లోపమేమియు లేదనియెంచి, కొందఱట్లు చేయుచున్నారు. ఇది మంచిదిగాదు. తమ బంధువులను, మిత్రులను మఱింత ప్రేమించి గౌరవించవలయునేగాని, దూషింపనగునా ?

అసహ్యమనఁగా తారుమారైన ప్రేమయే సుమీ యని యొక గొప్ప యింగ్లీషు గ్రంథకర్త నుడివియున్నాఁడు. అనఁగా, సాధారణముగా మనకొక మనుష్యునిమీఁద అసహ్యముగా నుండుటకుఁ గారణము పరికించి చూచిన యెడల, వాని శ్రేయస్సును మనము నిజముగాఁ గోరుచున్నామనియును మనము చెప్పిన చొప్పునఁగాని, అనుకొనినరీతిగాఁగాని, వాఁడు ప్రవర్తింప కుండుటవలననే వానిమీఁద మనకసహ్యము పుట్టినదనియును తేలుచున్నది. అన్ని శత్రుత్వములకు నంతరార్థ మిదియైనను కాకున్నను, ఏక కుటుంబములో నొకరిమీఁద నింకొకరి కుండు కలహములకు మాత్ర మర్థమిదియేయని చెప్పవచ్చును. దీని కుదాహరణముగా రామయ్యగారి కుటుంబమును గుఱించి యాలోచించెదము. పట్టపరీక్షయందు తేరి, గొప్ప యుద్యోగము నందుండిన రామయ్య సదాభార్య నిట్లేల చీవాట్లు పెట్టుచుండవలెను ? అంత విద్యావంతుఁడగు నాతడిట్లుచేయుట కేదోయొక కారణ ముండవలయును. జాగ్రతగా విచారించితిరేని, మీకుఁ గారణము కనపడక మానదు. రామయ్యభార్య సీతమ్మ ఎంతసౌందర్యవతి యయ్యును, మూఢ వనితా శిరోమణి! చదువుకొనుమని రామయ్య పుస్తకములిచ్చి, విద్య గఱపుటకు తాను సిద్ధముగానున్నానని చెప్పఁగా, సీతమ్మ యాపుస్తకముల నొకమూల దోసివైచి, ముసలమ్మల వలన సత్యకాలపు వృత్తాం

తములను వినుచున్నది. సదుద్దేశముగల భర్తమాటయే యామె వినినయెడల, ఇప్పుడహర్నిశమును ఆమె చెవులు చిల్లులు పోవునట్లు వినవచ్చుచుండెడి భర్త చీవాట్లన్నియు నన్ని దీవనలుగఁ బరిణమించును గదా!

ఐకమత్యము లేనియిండ్లలో నిటువంటి వైషమ్యములు గన్పట్టుచుండును. సాధారణముగా నిట్టిపోరాటములలో నెవరో యొకరే గాక, ఉభయులును నిందార్హులుగా నుందురు. రామయ్య చీవాట్లును, సీతమ్మ మూర్ఖతయును గూడ నింద్యమగు సంగతులే. "అమ్మకు నోరువాడి, అయ్యకు చేయివాడి" అనుసామెత చొప్పున, పరస్పర ప్రేమలేని యెడల, కలహమనేక రీతులఁ గనఁబడుచుండును. మనసు గలియక పోరాడుచుండు భార్యాభర్తలు, సంసారాశ్రమమున దామిఁక నిర్వర్తింపవలసిన ఘన కార్యములు చేయుట ఎట్లు? సుఖమననుభవించుట ఎట్లు?

---

## గుఱ్ఱము.

మనుష్యుఁడు మచ్చికచేసి, విద్యనేర్పు జంతువులలో గుఱ్ఱము మొదటిదని చెప్పవచ్చును. ఈజంతువుయొక్క విశాలమగు తలయును, నిడుపాటి ముఖమును, లోతును విశాలమును నగు కన్నులును, పొట్టి దౌడలును, సూటిగనుండు చెవులును దీని తెలివిని సూచించుచున్నవి. చురుకుదనమునందును, వేగమునందును మచ్చికపడు కడమ జంతువుల నిది మీఱియున్నది. సంతోషము, కోరిక, కోపము, భయము, దుఃఖము మొదలగు భావములు దెల్పునట్టి వివిధరీతుల నిది సకిలించునని శాస్త్రవేత్తలు నుడువుచున్నారు.

అడవి గుఱ్ఱములు గుంపులుగుంపులుగాఁ గూడి మేయుచుండును. ఒక్కొక గుంపుమీఁద నాధిపత్యము దాల్చి యొకగుఱ్ఱము, తక్కినవా



నికి దారిఁజూపుచు, విపత్తువచ్చినప్పుడు తాను ముందుండి శత్రువులెవరో కనిపెట్టుచుండును. సింహము, పులి మొదలగు ఘాతుకమృగ మేదియైనఁ గానఁబడిన యెడల, పాఱిపోవుట మంచిపద్ధతిగాదు కావున, గుఱ్ఱములగుంపు, దట్టముగ నొక చోటఁజేరి, మధ్య తమపిల్లలనుంచి, వానివైపునకుఁ దలలుంచి, తమ వెనుకభాగమును బైటకుంచి చుట్టును నిలువఁబడును. ఏగుఱ్ఱము మీఁదనైన శత్రువు పడెనా, ఆగుఱ్ఱము తన వెనుక కాళ్ళతో దానినిఁ దన్నివైచును. కాఁబట్టి యిట్టి గుఱ్ఱపు గుంపులను జూచి పులులును, సింహములును దరికి రావు.

స్వాభావికముగనే యిట్లు గుఱ్ఱములు తమకొక యధిపతి నేర్పఱచుకొని, అది మెలఁగినరీతిని మెలఁగుచు, దాని యాధిపత్యమునకు లోఁబడి, యుద్ధముఁ జేయుచుండును. కావున, మనుష్యుడు పెంచినప్పుడును ఈ జంతువులు, త్వరగా మచ్చికపడి, అతఁడు, విధించిన చొప్పున నడచుకొనుచు, రణరంగముఁ జొచ్చుటకు మిక్కిలి కుతూహలము గలిగి యుండును. ఇవియేకాక, గుఱ్ఱములు, తమకు నేర్పఁబడిన విధులను బాగుగ గ్రహించి, వాని చొప్పున నెప్పుడును నడచుకొనుచుండును. గుఱ్ఱపుసవారి చేయుట నెఱుఁగని రౌతునకు, అనుభవముగల గుఱ్ఱమే యావిద్య నేర్పును! యుద్ధభూమిలో, తనరౌతు గుండుదెబ్బతగిలి పడిపోయిన పిమ్మట, గుఱ్ఱము వెనుకకుఁ బారిపోక, సేనాధిపతి పోవుమార్గమున ముందునకే నడచిపోవును.

ఒకదాని నొకటి మించవలెనను కోరిక యీ జంతువులయందు బాగుగనున్నది. పందెపు గుఱ్ఱములు, తమ రౌతులుగొట్టు చబుకు దెబ్బలకేకాక, తమ కోరికచేతనే ముఖ్యముగ వేగముగఁ బరుగెత్తుచున్నవి. తమ కంటె ముందు పరుగెత్తుకొని పోవు గుఱ్ఱములను తమ పండ్లతో వెనుకకు లాగిన గుఱ్ఱములు గూడఁ గలవు.

గుఱ్ఱములకు మంచి జ్ఞాపకశక్తిగలదు. ఒకసారి చూచిన దారినిఁ గుఱ్ఱ మనేక సంవత్సరములు గడచినను మఱచిపోకుండును, దారి తప్పిన

రౌతులు, కళ్లెమును వదలుగాఁ బట్టుకొని గుఱ్ఱమునె దారి తీయనిచ్చిన యెడల, గుఱ్ఱము సరియైన దారిని తీసికొనిపోయి, గమ్యస్థానముఁ జేర్చును.

గుఱ్ఱ మెంతో విశ్వాసముగల జంతువు. ఇది తన రౌతునందే గాక, తనతోడి గుఱ్ఱమునందుఁగూడను ప్రేమగలిగి యుండును. జెస్సి యను నొక్కఁడు రెండు హనోవరు గుఱ్ఱములను గురించి చెప్పుచు, వానిలోఁ నొకటి యుద్ధమునఁ బడిపోఁగా, రెండవది, ఆహారము తినుటమాని నదనియును, భటులెన్ని ప్రయత్నములు చేసి, క్రొత్త సంబంధములు గల్పింపఁజూచినను, ఆగుఱ్ఱము మృతినొందిన తన సహచరుని మఱచిపోకుండి, నిరాహారమై, కొన్నిదినములకు మరణము నొందెననియును నుడివెను.

గుఱ్ఱము, చచ్చిపోయిన స్నేహితులను గురించి తలపోయుటయే కాక, బ్రదికియుండువారి యెడలఁగూడ ననురాగము గలిగియుండును. "జంతువుల వివేచనాశక్తి" యను గ్రంథమును వ్రాసిన వాట్సను ఈక్రిందిసంగతిని ఉదాహరించెను. ఒక పెద్దమనుష్యుఁడు తన యింటఁ గొందఱు స్నేహితులతో భోజనముఁ జేయుచుండెను. ఆగదికిని, వెనుక ప్రక్క నుండు నొక మైదానమునకును మధ్య నొక యద్దపు తలుపుగలదు. ఈతలుపు నెవరో తీసికొని, గదిలోనికిఁ బ్రవేశించిరి. వారెవరోయని యందఱు నటుచూచుసరికి, వారి కన్నుల కొకగుఱ్ఱము గానఁబడెను! ఆ గుఱ్ఱ మెప్పుడుగాని యట్లు గదిలోనికి వచ్చియుండలేదు. తన యజమానునిచుట్టు నెందఱుమనుష్యులో కూర్చుండియున్నను, ఆగుఱ్ఱము జంకక, దగ్గఱకువచ్చి, ఒకవిధముగ సకిలించెను. ఇది వచ్చుటకుఁ గారణ మేమా యని యోజించి, యజమానుఁడు గుఱ్ఱము వెంటనే పోయెను. అంత వాని కన్నులకు, ఆగుఱ్ఱముపిల్ల బురదలోను, ముండ్లలోను జిక్కువడియుండుట గానఁబడెను! దానిని తప్పించుటకు యజమానుని రమ్మని పిలుచుటకే, ఆగుఱ్ఱ మీయుపాయముఁ జేసెను



'లీ' యను స్త్రీయింకొకసంగతి జెప్పెను. ఒకగుఱ్ఱము, మంచుతో గప్పఁబడిన కొన్ని బల్లలమీఁదుగాఁ బోవలసివచ్చి, తన కాళ్ళు జారకుండు నట్లుగా, దగ్గఱనుండు కొంచెమినుసుకను తన కాళ్ళతోఁ దెచ్చి, ఆబల్లల మీఁదఁ జల్లి, మఱి వానిమీఁద నడచెను!

"నోరులేని మనసహచరులు" అనుగ్రంథమును వ్రాసిన జాక్సను గుఱ్ఱముయొక్క వివేచనాశక్తినిగుఱించి యీ క్రింది యుదాహరణమును జేర్చెను.

కాలి యినుపనాళము బాగుగ వేయకపోవుటచేత ఒక గుఱ్ఱమునకు నడచునప్పుడెంతో బాధకలిగెను. బాధ నివారణముఁ జేసికొనఁబూని, యా గుఱ్ఱము, నాళములువేయు పనివాని దుకాణము దగ్గరకుఁబోయి, వానికిఁ దన కాలెత్తిచూపెను! మిక్కిలి యాశ్చర్యము నొందిన యా పనివాఁడు, దాని కాలికి సరిగా నాళము వేయకుండుట చూచి, అది సవరించెను. అప్పు డాగుఱ్ఱము తృప్తితో నింటికేగెను.

ఇంకొక గుఱ్ఱ మొక బీటిలో మేయుచు, తలుపుగొళ్ళెమును దీయుట చేతఁగాక, తన పండ్లతో తలుపునె యెత్తివైచి, తప్పించుకొనెను. దాహముగొనిన మఱియొక గుఱ్ఱము, నూతిదగ్గఱకుఁబోయి, పనివాండ్రవలెనే యంత్రము నాడించి, నీటిని చేదుకొని, త్రాగెనని బ్రవుహాము ప్రభువు చెప్పెను!

---

## కొమ్ములుగల స్త్రీ పురుషులు.

పురాణేతిహాసములలో ఋష్యశృంగుఁడను శృంగములుగల ఋషి యొకఁ డున్నటుల చదువుటయేగాని వర్తమానమున నట్టి స్త్రీ పురుషు లెవ్వరు నున్నటుల మనము తలంచియుండము. అయినను సృష్టివైచిత్ర్యములకుఁ గొదువలేదు. సృష్టి విమర్శనముఁ జేయువానికి, సామాన్య

జనుల కసాధ్యములును, అస్వాభావికములుగఁ గనుపించునవి సామాన్యములుగఁ గనుపించును.

మేలాంగ్రీ అను మిలిటరీ వైద్యోద్యోగి, తనకు ఆఫ్రికాఖండమున ముగ్గురు నాసిక కిరుప్రక్కల కొమ్ములుగల మనుష్యులు కనిపించినటుల చెప్పెను. వారు 32, 18, 20 సంవత్సరముల వయస్సు గలవారఁట. వీరిలో మూఁడవవానికిని, దొరగారికిని జరిగిన సంభాషణలో, తనకొమ్ములు వానియంతట నవియే పుట్టినట్టును, వయస్సు ముదిరిన కొలఁది కొమ్ములుగూడ నెదుగుచున్నట్లును, అవి తన నేత్రఘ్రాణేంద్రియముల కేమియు బాధ కలుగఁజేయ నట్లును, అతఁడు చెప్పెనఁట.

జార్జిగోల్డు, వాల్టరు పిల్లియను తత్త్వశాస్త్రజ్ఞులుకూడ నీవిషయమును గుఱించి వ్రాయుచు కొమ్ములుగల మనుష్యులు విశేషముగా నున్నారనియు, పురుషులకంటె స్త్రీలే వారిలో నెక్కువగ నున్నారనియుఁ జెప్పిరి.

కొమ్ములకుఁదోడు తోఁకకూడనుండిన నొకబాలుఁడొకఁడు అమెరికా ఖండములో మిన్నెసోటా యను పట్టణమున గొన్నియేండ్ల క్రిందట జన్మించినట్లు తెలియవచ్చుచున్నది వానికి తలపైనుండి 18 అంగుళముల పొడువుగల శృంగములును, దేహమునిండ నిడుపాటి రోమములును, చేతులఁబోలు పంజాలును, కలవఁట. మఱియు నతఁడు కుక్కలననుకరించుచు చతుష్పాత్తులవలె పాదచరణముల నాల్గిటితోను నడచుచు పిల్లలు సాధారణముగఁ దిను నాహారమును దినుచుండునఁట!

పదునాల్గవ శతాబ్దపు వాఁడు ఫాబ్రికసు అను ఇటాలియా దేశపు చికిత్సకుఁడు, తన యనుభవములో తలపైనుండి శృంగములు పెరిగి, పశువులవలె తిన్న యాహారమును నెమరువేయు మనుష్యులను జూచినట్లు వ్రాయుచున్నాడు. 'డాక్టరు' చాటార్డుగారు బాలిమోరు అను పట్టణమున ఖడ్గమృగమువలె ముక్కుపైని కొమ్ముగల ఒక ముదుసలి స్త్రీని జూచినారఁట. శాక్ట్సనను మఱియొక డాక్టరుగారు చెవులలోనుండి పెరి



గిన కొమ్ములను అనేకములుగా తాము కోసినటుల చెప్పుచున్నారు. కనురెప్పలపై నుండియు, మెడపైనుండియు కొమ్ములు పెరిగిన మనుష్యులుగూడ నున్నారని మఱికొందఱు చెప్పుచున్నారు. ఇట్టి విపరీతమగు మనుష్యులనుజూచి పిచ్చి నమ్మకముగలవారు ఇది భగవంతుని దండనయనియో జనక్షయమునకు సూచనయనియో లేక మఱియే కీడునకో చిహ్నమనియో భావింతురు!

---

## తేనెటీఁగల తెలివి.

చిన్నజంతువులలోఁ జీమలునుఁ తేనెటీగలును మిక్కిలి తెలివిగలవని జంతుశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఈ క్రింద నుదాహరింపఁబడిన సంగతులనుబట్టి తేనెటీగలు మిగుల వివేచనాశక్తియును, బుద్ధి, యుక్తులునుగల జంతువులని మన మూహింపఁగలము.

తేనెపట్టు (తేనె తెర) లోకములో మిగుల చిత్రమగు పదార్థములలో నొకటి. దానిలోనుండు నీఁగలు వానివాని విధాయకకృత్యములను సదా నెరవేర్చుచుండును. మనుష్యులకువలెనే తేనెటీఁగలకును ప్రభువులు గలరు. కాని తేనెటీఁగల రాణి యెప్పుడును గుడ్లు పెట్టుచుండును. అది నివసించుగది కడమవానికంటె మిక్కిలి విశాలమైనదిగ నుండును.

ఏదైన నొక చిన్నజంతువు, దారి తెలియక, తేనెపట్టులోనికిఁ జొచ్చినయెడల, ద్వారపాలకులుగనుండు తేనెటీగలు దానిని తమ ముళ్ళతోఁ బొడిచి, ఒక నిమిషములోనే తమ యింటినుండి బైటికి దానిశవమునీడ్చివైచును. ఈ సంగతి లోపలి యీఁగలకునుఁ దెలియకుండును; అందుచేత నవి తమ పనిని దాము చేయుచునేయుండును. కాని యొక బలిష్ఠమగు జంతువేదైన తేనెపట్టులోఁ బ్రవేశింపఁబూనినచో, పట్టులోనుండు నీఁగలన్నియు భయపడి కదలును. ప్రతి యీఁగయును తన ముల్లుతో శత్రువును బొడుచును. ఇట్లిన్ని యీఁగలచేఁ బొడువఁబడి

వాని విషము శరీరమున సోకిన శత్రువు వేదనచేఁ గొట్టుకొని మృతి నొందును. ఐనను దాని శవమునెట్లు చిన్నజంతువు లీడ్చి పారవేయఁ గలవు ? ఆ యీఁగల కాళ్ళన్నియునుగూడ, చనిపోయిన శత్రువు శరీరమును గదలించుటకైనను శక్తి లేకుండును ! కాని యా శవము నచట నుండనిచ్చినచోఁ, అది కుళ్ళి దుర్గంధముతోఁ దేనెపట్టును నింపి, ఈఁగల కేమైన నంటుడు వ్యాధులను గలుగఁజేయవచ్చును.

కావున నప్పుడాయీఁగలన్నియుసభచేసి, తమకష్టమును గుఱించి యాలోచనచేయును. పూర్వము కొన్ని దేశముల మనుజులు, చనిపోయిన తమపూర్వికులను తైలమునందుంచి, వారి దేహములు కుళ్ళిపోకుండ నెట్లు గాపాడుచుండిరో యట్లే తమశత్రువు కళేబరమును జేయఁబూని యీతేనెటీఁగలు అన్ని దెసలకును బరుగులిడి మొగ్గల నంటియుండు నొక విధమగు జిగురును దెచ్చి, దానితో శత్రువు దేహముపైని దట్టముగఁ బూయును. అందుచేత, చనిపోయిన పురుగుశవమునుండి యేయుపద్రవముగాని యా తేనెటీఁగలకు రాదు !

ఒక్కొకప్పుడు, శరీరమునకు దృఢమైన కప్పుగల పెద్ద నత్తవంటి శత్రువేదైన తేనెపట్టులోనికిఁ జొచ్చినయెడల, ఈఁగలన్నియు దాని చుట్టునుజేరి పొడుచుట కారంభించును. కాని, యాజంతువు తన గుల్లలోనికిఁబోయి, నేలకు గట్టిగనంటిపెట్టుకొనును. కావున నిఁక దాని నీఁగలు కుట్టఁజాలవు! అప్పు డీఁగ లొక యుపాయము చేయును. వెనుకటివలెనే పూవులపాలను దెచ్చి, తమ శత్రువు దాగుకొనిన గుల్లక్రింద దానిని బూసి, గుల్ల నేలనుండి యిఁక రాకుండునటుల గట్టిగ దాని నంటఁగట్టును ! ఇఁక శత్రువిచటఁ జచ్చిపోవలసినదే !

తక్కిన జంతువులం దెచటను గానరాని యొకవిడ్డూరమగు పద్ధతి తేనెటీఁగలయందుఁ గానవచ్చుచున్నది. తేనెటీఁగలలో మగవి సోమరిపోతులుగ నుండును. ఆఁడవియే తేనెను బోగుచేయుచుండును. తమ రాజ్ఞి చనిపోయినపుడు, ఆఁడుఈఁగలన్నియుఁ బట్టునం దొకచోట నొక



పెద్ద గదికట్టి, తమలో నొక యీఁగను రాణిగఁ గోరుకొని, దాని నా గదిలోఁ బ్రవేశపెట్టి మిక్కిలిరుచియును బరిమళమునుగల తేనె నధికముగ దానికొసఁగును ! అప్పుడా రాణి యంగసౌష్ఠవముగలదియై, శిశువులను గనును. నాఁటినుండియు నా యీఁగయే రాణి యీఁగయై తన కృత్యముల నెరవేర్చుచుండును !

ఈ చిన్న జంతువులు చేయునట్టి కార్యములను గనిపెట్టినవారు తేనెటీఁగలకు తక్కినజంతువులకు గల సామాన్యమగు స్వాభావిక జ్ఞానమే గాక, మనుష్యులకుండు గొప్ప బుద్ధియుక్తులు కూడ కొంతగలవని చెప్పుచున్నారు.

---

## కోఁతులు పరిచారకులుగ నుండుట.

కోఁతులయందు మనుష్యులకుఁగల పోలికలు చూచుట యాశ్చర్యకరముగ నున్నది. వానరముల నుండియే నరులుద్భవించిరని, తాను వ్రాసినయొక యుద్గ్రంథమున హక్స్లీ పండితుఁడు వాదించెను. డార్విను కూడ మనుష్యుఁడు హీనజంతువులనుండియే పుట్టెనని వ్రాసెను. వీరు వ్రాసిన సంగతుల సత్యాసత్యము లెట్లున్నను, కోఁతులకు మంచి తెలివి గలదనియు, కొంతపరిశ్రమము చేసినయెడల, మనుష్యుఁడు వానరములచే, బనులుచేయించుకొనఁగలఁడనియు స్ఫురించక మానదు.

ఈవానరజాతికిఁ గల చురుకుతనమును ననుకరణశక్తిని సద్వినియోగముచేయించి, వానిచేత మనుష్యులిప్పుడిప్పుడు బ్రాఁతపని, ఉపచారములు, తేయాకు కట్టలుకట్టుట మొదలుగాఁగల పనులు చేయించుకొనుచున్నారు. ఒకానొకప్పుడు చింపాంజీ జాతిలోని యొక యాఁడుకోఁతి లోయాంగ్రోపట్టణమున నౌకరుగనుండెను. ఇది యిల్లుతుడుచుట, పక్కలు వేయుట, ఉర్లగడ్డల తొక్కలొలుచుట మొదలగు వంటయింటి పనులుచేయుట కుపకరించెను.

ఇట్టిపనులనే బ్రిటీషు పొగయోడలోని నావికునియొద్ద నున్న యొకకోఁతి చేయుచున్నది. ఇది నావికుఁడు చేయఁగల తెరచాపలు చుట్టుట మొదలగుపనులు చేయఁగలదు. ఈపనులుగాక, ఈకోఁతి వంటల వానికి సహాయపడుచు, కోడిగ్రుడ్లు ఉడకఁ బెట్టుటయందు నేర్పరిగ నున్నది. చీనా దేశపు కోఁతులు తేయాకుచెట్లు కట్టలుకట్టుట యందా దేశపు జనులకు సాయముచేయు చున్నవి. ఇట్టి నౌకరులు చౌకగనే దొరకుచున్నారు. ఏలయనఁగా నీకోఁతులకప్పుడప్పుడు మంచి యాహారము పెట్టుచువచ్చిన యెడల నివి చాల సంతోషించు చున్నవి. ఆఫ్రికను సంస్థానమందలి బంగారుగనులలోని పనులకై వెడలిపోవుచున్న వారిలో నొకగని పనివాఁడు, బంగారు కడుగుటకుఁ దనకు సహాయము చేయుటకై ౫ చీనా దేశపు కోఁతులను దనవెంటబెట్టుకొనిపోయెను. ఆ దేశమునందలి యధికమగు చలికిఁ గోఁతు లలవాటుపడిన వగుటచేత నవి పని వానికెంతో లాభకారులుగ నుండెను. కొన్ని సంవత్సరముల క్రిందట, కేప్ కాలనీలో నినుపదారి వేయునప్పుడు తాళ్ళు మొదలగు పరికరములు మోయుటకు నౌకరులకు సాయముచేయుటకై బ్రిటీషు ఎంజనీయరులు కోఁతులను నియమించిరి. ఈకోఁతులకు మొదట కొన్ని దినములుపని నేర్పఁగా, పిమ్మటనవియెంతో చక్కఁగఁ బనులుచేసినవఁట !

సయాము దేశమునఁ గోఁతు లనేకవిధములగు పనుల కుపచరించుచున్నవి. కొన్ని వాలిడికోఁతులు షరాబుచేయు పనులు చేయుచున్నవి ! ఒకటి రెండు సంవత్సరములక్రిందట నాదేశమునఁ గొందఱు దుష్టులుచేరి తక్కువ లోహములతోఁ జేసిన నాణెములను ముద్రించి, అవి మంచి నాణెములతోఁ గలిపి వేయుచున్నందున, నాణెములమంచి చెడ్డలు గుర్తెఱుఁగుట వర్తకులకుఁ గష్టసాధ్యమయ్యెను. ఇట్లుండఁగా నాదేశమందొక ప్రదేశమున నొక వర్తకునియొద్ద పెంపుడుకోఁతి యొకటి యుండెను. షరాబుపెట్టె మీఁదనుండి యొకనాఁడాకోఁతి యొకనాణెమును దీసి దానినిఁ దనపండ్లమధ్యనుండి కొంచెము సేపు కొరికి, అసంతుష్టిని



తెలియపరచుముఖచిహ్నమునుకనబఱచుచు, నాణెమును గ్రిందబడవైచెను. అప్పుడతఁడింకొక నాణెమునీయఁగా కోఁతి జాగ్రత్తతో దానిని శోధించి, దానిని వాని పెట్టెమీఁద నుంచెను. చెడ్డనాణెమును మంచి దానినుండి వేఱుపఱచఁగల శక్తి యీకోఁతికిఁ గలిగియుండుటఁ జూచి, తక్కిన కోఁతులకుఁగూడ నీశక్తియున్నదేమో చూతమని, జంతుశాల నుండి యింక రెండు వాలిడికోఁతులను దెచ్చి, వానిని బరీక్షింపఁగా నవికూడ నిట్లుచేయఁ గలిగెను. అప్పటినుండియు సయాము దేశమునందలి సాహుకార్లలో ననేకులు తమయొద్ద షరాబుపని చేయుటకుఁ గోఁతులనే నియమించుచున్నారు; ఇప్పుడీపని చేయుచున్న కోఁతులు చెడ్డనాణెములు వేఱుపఱచుటయందు మనుష్యులనుమించి యున్నవఁట. ఈమధ్యనా దేశమున నొకవర్తక సంఘమువారి పెంపుడుకోఁతి చనిపోఁగా దానికళేబరమును మంచి యొక పెట్టెలోనుంచి శ్మశాన వాటికలోనికిఁ గొనిపోయిరి. అచ్చట షరాబు పనిచేయు నితరకోఁతులు చనిపోయిన కోఁతివెంట నే నడచి పోయినవఁట.

పారీసు నగరము చేరువనున్న బేటిగ్నొల్లను ప్రదేశమున నొక కోఁతి వార్తాపత్రికల నమ్ముచువచ్చెను. ఇంకొకకోఁతి, న్యూయార్కు నగరమునందలి బ్రాడ్వేవీధిలోని యొక పూటకూళ్ళయింటి కిటికీలు తుడుచుచు, చెప్పులకురంగు వేయుచు నుండెడిది.

కోఁతులిట్లు మనుష్యులుచేయు ననేకపనులు చేయుచుండినట్లింక నెన్నో నిదర్శనములు గలవు. సామాన్యముగఁ గోఁతులయందుఁ గానఁబడు దుష్టతనమును లెక్కచేయక, వానికిఁ బనులునేర్పినచో, ప్రస్తుతమందు దేశమంతటను గానవచ్చెడి నౌకరులబాధ మనకుఁ గొంతతొలఁగి పోవును. కాని దుష్టబుద్ధిగల పెంపుడుకోఁతిని వదలి వేయవలసి వచ్చినప్పుడు మాత్రము కొంతకష్టముగ నుండును. మనము దానిదుశ్చేష్టల కోర్పుమైన నుండవలెను. లేదా విషమిచ్చి దానినిఁ గడతేర్చి వేయవలెను. ఆఫ్రికా కోఁతులు మిక్కిలి తెలివితేటలు శక్తినిగలిగి యున్నందున

వానికిష్టము వచ్చినయెడల, మనుష్యులకంటె నెక్కువగఁ బాటుపడఁ గలవు. చెట్లెక్కుట, దుముకుట, పారిపోవుట మొదలగు పనులందివి యారితేరిన వగుటచేత, ఈకోఁతులు మనుష్యులకొదిగి పాటుపడినచో, వారికివియెంతో సహకారులుగ నుండును. అప్పుడు ప్రతి దేశమునందును, మనుష్యులకుఁ బరిచర్యచేయు కోఁతులగుంపులు శ్రద్ధతోఁ బెంపఁబడుచుండును.

---

## జంతువుల యాటలు.

ఆటపాటలయందు వినోదించునది మనుష్యులే గాక, జంతువులలోఁగూడ కొన్ని గలవని యనేకులకుఁ దెలిసియున్నది. కొన్నిసమయములందు పిల్లులు, కుక్కలు చెరలాట లాడుచుండుటయును, మేకపిల్లలు దుముకులాడుచుండుటయును, కొన్నికొన్ని పక్షు లూరకయే నెగురుచుండుటయును, మనము చూచుచున్నాము.

ఇంగ్లాండు దేశపు దక్షిణదిగ్భాగమున రమ్యమగు విండురషు నది నిశ్శబ్దమగు తావులలోఁ బ్రవహించును. గాంటుమిల్లు అను ప్రదేశమున నొక యుద్యానవనములోనుండి యీ నదీజలము మెల్లమెల్లఁగఁ బోవును. వసంతకాలమున సాయంసమయములం దీనదిలోని జలము పాఱుదలలేక నిశ్శబ్దముగ నున్నపుడు, లోతులేని నీళ్ళనుండి చిఱుచేపఁలు నీటిపైభాగమున కాటనిమిత్తమై వచ్చును. జలము పైభాగమునకువచ్చి, చేఁపలు, తమతోఁకలమీఁద నిలువుగ నిలుచుండి, వెనుకకు నీటిలోనికిఁ బడిపోవుచుండును ఈ చిన్నయాటయే మత్స్యముల కతి సంతోషమును గలుగఁ జేయుచుండును.

చేఁపలే యిట్లాటలయందు వినోదించుచున్నప్పుడు, పైతరగతులలోనివగు పశుపక్ష్యాదులు కొన్నియాటలు కల్పనచేసికొని సంతోషించుచుండుట యొక యాశ్చర్యమా! చిన్నపిల్లలు, చేతులతో



బొమ్మలు, బంతులు మొదలగు వస్తువుల నుంచుకొని యానందించునట్లే, కొన్ని జంతువులు, ఏవియో కొన్ని వస్తువులతో నాడుచుండును. ఇంకఁ గొన్ని జంతువులు గుమిగూడి, ఒకటితో నొకటి పంతము వేసికొని, యాడుచుండును. సామాన్యముగా నొకజాతి జంతువులు కొన్ని గూడి, పరుగెత్తియో, దుముకుచునో, మునుఁగుచునో, చెట్లెక్కుచునో, తమ తమ బలనైపుణ్యముల నొకటి కొకటి చూపుచు, అందువలన జనించిన సంతోషమును గ్రోలుచుండును. ఈపనులనుబట్టి యిట్టిజంతువులు, సంతోషము ననుభవించు విషయమునఁ గొంతవఱకు మనుష్యులను బోలుచున్నవని చెప్ప వచ్చును. కడమజంతువులకంటె నెక్కువగ నివి మనోవిజృంభణమును గలిగియున్నవి.

జలాశయముల యొద్దున నివసించు పక్షులు, ఆటలాడుచుండును. హంస లిట్లాడుచుండునని యొకానొక ప్రాచీనకాలపుకవీశ్వరుఁడు నుడివెను. ఆఫ్రికాలోనినానెట్జి నదియొద్దున ననుదినమును సాయంకాలమునఁ గొంగలు గుమిగూడి, గుండ్రముగఁ దిరిగి యాటలాడుకొనుచుండునని యొకానొకరు వ్రాసియున్నారు. ఇంగ్లండు దేశములోఁ గూడఁ గల్లులను తక్కిన కొన్నిజాతుల పక్షులుగూడ నిట్లు గుండ్రని బారుల యాటయాడ నేర్చియున్నవి. పెనుగాలి యణఁగిపోయి, చక్కని సూర్యరశ్మి సోకినప్పుడు, పక్షు లిట్టి యాటలాడఁ బూనును. ఆ దేశమునందలి బొంత కాకులు, గుండ్రముగ గుంపులు గుంపులుగఁ గూడి, చాలదూరము వఱకు నెగసిపోయి, దిగుచు, మరల నెగసిపోవుచుండును. మాలకాకులచట కొన్ని యిట్లు గగనమున నెగసిపోవుచు; మధ్య ఱెక్క లాడింపక, తలక్రిందుగ నేలఁబడుచుఁ దమ వినోదము నందఱికిని దెల్పుచాడ్పున, నఱచుచుండును. మిక్కిలి వేడిగ నున్నప్పుడు, బాతులును పొట్టిబాతులును, ఆటలాడవలయునని యభిలాష గలిగి, తమ ఱెక్కలతో జలమును గొట్టుచు, ఇటునటుఁ దిరుగుచు, ఒకటి వెంట నొకటి నీటిలో మునుగుచు, లేచుచుండును. అలసట వచ్చువఱకు నవి యిట్లు చేయును.

సామాన్యముగ బాతులు నీటమునుఁగవు. కాని, యాటలాడవలయునని బుద్ధి గలిగిన తోడనే యవి శీఘ్రమే నీట మునిఁగిపోవును. క్రొవ్విన బాతు పూర్తిగ నిట్లు నీటమునుఁగుట దానికి మిగుల ప్రయాసకరమే.

కాని గుంపులు గుంపులుగ నాటలాడుట స్తన్యపానమువలన జీవించు జంతువులలో నంతప్రాయికముగ లేదు. ఒకజాతి చుంచులు తరుచుగ గుండ్రముగ దిరుగుచుండును. కాడరు మందిరము దగ్గఱనున్న యడవులలోని యొకజాతి లేళ్ళు గుండ్రముగఁ దిరుగుచు వినోదించుచుండును. కాని గిట్టలుగల జంతువులలో నాటలయం దెక్కువ యాసక్తి గలవి మేఁకపిల్లలని చెప్పవచ్చును. వీని కద్భుతమైన చురుకుదనమే కాక, ఆటలవిషయమై కల్పనాశక్తి గూడఁ గలదు. మేఁకపిల్లలు, తమ యిచ్ఛ వచ్చినట్టి యున్నత ప్రదేశమునకు దుముకుచుఁ బోఁగలవు. ఇట్టిపిల్లలు, ఆటలయం దాసక్తిచేత దుముకుచుఁబోయి, ప్రమాదకరమగు నేనూతి యొడ్డుననో, రంపపు కోతకై త్రవ్విన గోతిమీఁద వేయఁబడిన యేదూలము మీఁదనో, నిలువఁబడియున్నప్పుడు, తల్లి మేఁకలు మిగుల యలజడిపడి, కూఁతపెట్టుచుండును.

గుఱ్ఱము లిట్టియాటలు కల్పించుట కంతగ నేర్పు లేకయున్నను, ఏవయస్సులో నున్నను, ఆటలయందాసక్తి గనఁబఱచుచున్నవి. 22 సంవత్సరముల వయస్సుగల యాడుగుఱ్ఱమొకటి లండను నగరములోఁ గలదు. మొదటినుండియు దీనిచే బండి లాగించుచు వచ్చిరి. ఒకప్పుడు దీనిని దూరమున నున్న కుగ్రామములోనికిఁ గొనిపోయి, అచ్చటనున్న యొక గుఱ్ఱపు పిల్లతో బచ్చికమేయుటకై వదలిపెట్టిరి. ఈక్రొత్త ప్రదేశమును నూతనముగఁ గలసిన స్నేహమును, ఆయశ్వముల నానందముచే మైమఱచునట్లు చేసెను. దినమంతయు నవి పరుగు లిడుచునే యుండెను. ముసలి గుఱ్ఱమే యీ యాటలం దెక్కువ పట్టుదల గలిగియుండెను. ఒకటితో నొకటి పోట్లాడుచున్నట్లవి పైకి నటించుచు, ఒకదాని



నొకటి తరుముచు పలువిధముల గంతులు వైచినవి. అప్పుడు గుఱ్ఱపువాఁడు వచ్చి, బరువు బండి మోయునప్పటికంటె నీవినోదముల వలన ముసలి గుఱ్ఱ మధికముగ నలసిపోయినదని, గుఱ్ఱములను విడదీసెను. పశువులు మాత్ర మిట్లు ఆటలాడవు.

ఉడత్రజాతిలోని జంతువులు, మిక్కిలి చురుకుదనము గలిగి మంచి యాటలాడ నేర్చును. ఈ జాతిలోని యొకజంతువు బోనులో నుంచఁబడినపుడు గుండ్రముగఁ దిరుగుచుండును; బండితోఁ గూడఁ బరుగెత్తుకొని, మధ్యమధ్య దొమ్మరవానివలె "మొగ్గలు" వేయుచుండును. ఉడత లప్పుడప్పుడు, అడవిలోనికివచ్చి, నాట్యముచేసి, తమ తోఁకలు తాము పట్టుకొనఁ బూనినట్లుగ గుండ్రముగఁ బ్రదక్షిణము దిరిగి, వెడలిపోవుచుండును. చిన్నపక్షుల నాకర్షించుటకే యివి యిట్లు చేయునని కొందఱి మతము.

ఈజాతిజంతువులలో నీటికుక్కలు ఆటలందు మిక్కుటమైన యపేక్ష గలిగియుండును. ఎక్కువ చురుకుదనముగల యీజంతువులు, నీటను, బైటను గూడ నాటలాడును. అమెరికా దేశములో నివి యొక చిత్రమైన యాటయాడుచుండును. నీరు ఘనీభవించుటచేత మంచుగడ్డగ మారి ఏటవాలుగను మెత్తగను నుండిన యొక ప్రదేశమున కివి వచ్చి, పైకెక్కి, అక్కడనుండి క్రిందికి దిగజారిపడిపోయి వేరొక ప్రక్కదారిని తిరిగి పైకెక్కి మరల మరల నిట్లే క్రిందికి జారిపడుచుండును. ఒకప్పుడు, క్రిందఁబడునట్టిచోట్ల నీరుండు ప్రదేశమును వెదకి, మఱి యీ జంతువులాట మొదలుపెట్టును. మనుష్యులకువలెనే నీటికుక్కలకును, ఈ యాటయం దెంతో మక్కువగలదు.

జంతువుల యాటలన్నిటిలోను, పిల్లిజాతి జంతువుల యాటలే మిక్కిలి యూహాపోహాలను సూచించునవిగ నుండును. కడమ జంతువులను బట్టుకొనుటయందును, వధించుటయందును, ఈ మార్జాల జాతి జంతువులు ప్రవీణత దాల్చియున్నవి. కావుననే, శాకభక్షణచేయుజంతువులకన్న నివి యాటలయందు తెలివితేట లెక్కువుగఁ జూపించు

చున్నవి. ఈ జాతి జంతువులు, తాము పట్టుకొను జంతువుల భయము ఆకలి, కోరికలు మొదలగు స్వభావ సిద్ధమయిన గుణముల నెఱింగి యుండును. పొలములో మేయుచుండు కుందేళ్ళను బొంచి చూచు నక్క, సామాన్యముగ నవి యేదారిని బారిపోవునో తెలిసియే యుండును. అదే తీరున, పక్షుల కొఱకుఁగాని, ఎలుకలకొఱకుఁ గాని వేచి యుండు పిల్లి, మంచి యాలోచనాశక్తి గలిగియుండును. పిల్లులును, పిల్లి పిల్లలును, కపటములగు నాటలందు వినోదించును. అవి, యేదో యొక బంతినిగాని, మఱి యేవస్తు విశేషమునైనఁ గాని బట్టుకొని, అది యేదో జంతువిశేషమని పరిహాసమునకు భావించుకొని, దానిని ముందుకుఁ ద్రోయుచు, దానిని వెంటాడించి, పోరి కరచి, చంపునట్లభినయించును! ఒకానొకప్పుడు, పిల్లితోఁ గుక్క కూడ నాటలాడుటకు వచ్చినయెడల, దానితో నవి పందెము వేసి పరుగెత్తి, పోరాడుట నభినయించును. ఇంతియె గాక, అప్పుడప్పుడు, శత్రువున కెఱుకలేకయే, దానిమీఁద నఠాత్తుగఁ బడుచుండును. మిత్రత్వముచేఁ గల్పింపఁబడిన యిట్టి ద్వంద్వ యుద్ధములలో, సామాన్యముగ నఠాత్తుగ మీఁదఁబడునది పిల్లియు, తరుమఁ బడునది కుక్కయునే! పాపము, దాని సహచరి యగు కుక్క కాటలయం దంతగా నూహాపోహలు లేవు.

---

## ఉత్తరగోగ్రహణము.

ఆధ్యాత్మిక విషయములను లోకవ్యవహారములను ఉపమానముల మూలమున సమానసౌలభ్యముతో విస్పష్టముగ బోధింపఁగల గ్రంథములలో భారతము ముఖ్యము. అందలి యుత్తర గోగ్రహణకథ యందఱికిని దెలిసియే యున్నది.

ఈ యుత్తరగోగ్రహణ కథనుండి మనము గ్రహింపఁగల సత్యములును సంగతులును గొన్ని కలవు. శూరాగ్రేసరుఁ డయ్యును,



అర్జునుఁ డపుడు మిక్కిలి హీనదశయం దుండెను. తన బాహుపరాక్రమము శత్రువులకుఁ దెల్ల మగునట్లుగ రణరంగమున యుద్ధముచేయవలసినవాఁడు, కాలవైపరీత్యమును బట్టి పేడియై, యంతఃపురకాంతల కాటపాటలు నేర్పవలసివచ్చెను! మత్స్యపురిని గష్టసమయమున రక్షింపవలయు నని పూనిన యతనికి సాయము చేయుటకైన నెవరును లేరైరి. మీఁదు మిక్కిలి భీరు వగు నొకనికిఁ దానే సారథియగుట సంభవించెను. తుదకు యుద్ధరంగమునఁ దాను సహజరూపముతో నైనను బోరునట్టి భాగ్య మతనికి లేదయ్యెను. అట్లు చేసినచో సమయభంగ మగు నని యతని భయము. కాని, నిజమగు శూరత్వము గలవాఁ డెపుడును స్థితిగతుల ననుసరించి మెలఁగవలసినను, వానికి దాస్యము మాత్రము చేయనొల్లఁడు. తా నొకరికి సారథ్యము చేయవలసి వచ్చినను, తన కింకొకరు సారథి యైనను, అతని కొకటియె. విజయమును జేకూర్పఁగలది పౌరుషమే కాని, బాహ్య వేషమును నాడంబరమును గావు. గడ్డము మీసములు దుస్తులు పౌరుషమున కమోఘమైన చిహ్నములు గావు. తుదకు కీర్తిగౌరవములును ప్రధానములు గావు. ఎట్టి స్థితిగతులందును విధికార్యనిర్వహణమె యుత్తమునికిఁ గర్తవ్యము.

అజ్ఞాతవాససమయ మర్జునునికి మిక్కిలి నీచ మగు దశయైనను అదియె యతని యుత్కృష్టస్థితికి దాఁపున నుండి దానికిఁ గారణభూత మయ్యెను. అంతకుఁ బూర్వమునఁ గాని, పిమ్మటఁ గాని యతఁ డొకఁడే యింతమందితోఁ బోరి యొక్కుమ్మడిగ వారలఁ బరాజితులఁ గావించి సంపూర్ణ విజయము గాంచియుండ లేదు. మహాభారత యుద్ధకాలమునం దైనను, బలపరాక్రమ సంపన్నులగు సోదరులును బంధుమిత్రాదులును లెక్కకు మిక్కిలిగ నతనికిఁ జేయూఁతయై నిలిచిరి. ఇక్కడ నన్ననో, తన పక్షమున నుండునది భీరువగు నొక యువకుఁడు. భారతయుద్ధ సమయమున నతని చుట్టును నక్షౌహిణుల కొలఁది సైనికులు తనవారు సమసిపోయిరి. ఇక్కడ నన్ననో, తన వారిలో నొకఁడును మడియ లేదు.

అచ్చటఁ బదునెనిమిది దినములు శత్రువులు దన్నెదిరించిరి. ఇచటనో కొలఁది కాలములోనె పగవారు పటాపంచ లయిరి. మహాప్రసిద్ధులగు కురువీరుల తలపాగలు తన శిష్యురాలి బొమ్మపొత్తికలకై యతఁడు కోయించెను. విరటుని గోగణము నంతటిని బురమునకు మరల్పించెను. సంపూర్ణవిజయ మన నిట్లుండవలెను గదా! మనుజుని సమర్థతాసమర్థత లిటులె జంటగఁ గానఁబడును.

అర్జునుఁడు తనబాహుబలము నీ గోగ్రహణ సమయమునం దత్యధికముగఁ జూపవలసివచ్చెను. సుప్రసిద్ధవీరుఁడు యుద్ధమునకు వచ్చుచున్నాఁడని తెలియఁగనే శత్రుకోటి భయవిహ్వలులై వానిని డీకొనుటకు ధైర్యము చాలక యుందురు. అందువలన రణరంగమున శూరునికి జయము కొంతవఱకు సులభసాధ్యము. సామాన్యముగ నర్జునుఁడు యుద్ధమునకుఁ బూనినపు డెల్ల పగవారు వాని పేరు వినియు వాని ముఖవీక్షణము చేసియు వెఱాయితు లగుచుండిరి. కాని యుత్తర గోగ్రహణకాలమందు మాత్రము విజయునికి జయమిట్లు సులభసాధ్యము కాలేదు. అజ్ఞాతవాస నియమము నుల్లంఘింపవలసి వచ్చునను సందియముచేత నతఁ డిపుడు మాఱువేసముతోనే యుద్ధమునకుఁ దొడంగెను. కౌరవపక్షమున నుండు కురుభీష్మాది వృద్ధవీరులుకొందఱు మాత్రమితఁ డర్జునుఁడని మొదటినుండియు గ్రహింపఁ గలిగినను, తక్కిన సైనికు లందఱు నతఁడు క్రొత్తవాఁడని భ్రమించి కొంతసేపటివఱకు వానిని గుర్తెఱుఁగక మిక్కిలి చలముతో వానితోఁ బోరాడిరి. కాని, శత్రువులు తీక్ష్ణముగాఁ బోరు నప్పుడె నిజమగు వీరుని శౌర్య మధికమగుచుండును. వాని యుత్సాహము పెంపగుచుండును. కావుననే నాఁడు తన యుద్ధనైపుణ్యమును పరిపూర్ణముగ నతఁడు శత్రువులకుఁ జవి చూప నవకాశము గలిగెను.

శా. సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చు నో



జంగాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్!

అని కౌరవ సేనానాయకులు వీని నాశ్చర్యముతో వీక్షింప సాగిరి. తన శక్తు లెఱిఁగి వెఱచువారిమీఁదనే గాక, యెఱుఁగక నిలువఁబడి పోరాడు పగతురమీఁదఁ గూడ, శూరుఁడు తన పౌరుషమును జూపును. నిజమగు శూరత్వము, త్రుప్పుపడిన కత్తివలె నొకచోటఁ బడియుండక, నఱకిన కొలఁదిని పదునువడు నాయుధమువలె, సదా తీక్ష్ణతఁ దాల్చియుండును. నిక్కమగు పౌరుషము, తన వంశావళీ బిరుదావళులను లెక్కింపఁజూడదు. ప్రాతవడిన కీర్తినే నమ్ముకొనియుండదు. క్రొత్త సమయముల నారయుచును, క్రొత్తయవకాశములను నూతన పరిస్థితులను గల్పించుకొనుచును, ఆచరణము మూలమున తన గౌరవమును బ్రకటీకృతము చేయుచుండును!

ఉత్తరగోగ్రహణసమయమునం దర్జునుఁడు గాంచిన విజయమునకుఁ గారణ మతని బాహుబల మొకటియె గాక, అతని వినయసంపద యునని చెప్పవచ్చును. ఇంతకాలమునకుఁ దిరిగి శత్రుదర్శనము లభించినది గదా యని యతఁ డెంత మాత్రము విఱ్ఱవీఁగక, శత్రుపక్షములో నున్నను తన గురువగు ద్రోణుని దాను గౌరవించుట విధియని గుర్తెఱిఁగి యాయన వైపునకు నమస్కారబాణములు వైచి యాయన దీవన వడసెను. నీతి సంపద యతనియం దిట్లు విశద మగుటచేతనే విరోధివర్గములోనివాఁడగు భీష్ముఁడును అర్జునుని మీఁద వత్సలత గలిగి, యతఁడా సమయమునఁ బ్రయోగించిన సమ్మోహనాస్త్రమునకుఁ బ్రతిబాణ మెఱిఁగియు నెఱుఁగనివానివలె దానును దల వాల్చియుండెను. ఈ సంగతి యర్జునునికిఁ దెలిసియుండుటచేత కౌరవవీరుల తలచుట్లు కోయు నుత్తరునితో, భీష్ముని జోలికి మాత్రము పోవలదని చెప్పెను. ఇంతయేల? ఒక విధముగ నర్జునునిసమ్మోహనాస్త్రము భీష్మునిమీఁదవలె నెవరిమీఁదను బనిచేయ లేదనియె చెప్పవచ్చును. అర్జునుఁడు శత్రు వను సంగతియె

మఱపించి మీఁదు మిక్కిలి యతని పక్షమునకే భీష్ము నొరగింపఁజేసినది యర్జునునిచేఁ బ్రయోగింపఁబడిన నయవర్తన మను సమ్మోహనాస్త్రమే.

గోగ్రహణసమయమునం దర్జునునికి జయము చేకూర్పఁ గలిగినది చాలవఱ కతని దైవభక్తియని చెప్పవచ్చును. కృష్ణార్జునుల స్నేహము వర్ణనాతీతము. కృష్ణుని సైన్యముల నపేక్షింపక నిరాయుధుఁడగు నతని నొక్కనినే భారతయుద్ధ సమయమునందుఁ దనకు సారథికమ్మని యర్జునుఁడు కోరుట దీనికి నిదర్శనము. కాని, యర్జునుఁడు కృష్ణుని మిత్రుఁడనియె కాక, దైవమనికూడ భావించెను. కృష్ణనిర్యాణమును దన యన్నకుఁ జెప్పుచు,

క. మన సారథి, మన సచివుఁడు,
మన వియ్యము, మన సఖుండు, మనబాంధవుఁడున్,
మన గురుఁడు, మనకు దేవర,
మనలను దిగనాడి చనియె మనుజాధీశా!

అని యర్జునుఁడు కృష్ణునిఁ గూర్చి పలికెను.

అర్జునుఁడు కృష్ణుని సారథిగఁ జేకొని, భారత రణభూమిని నిలువఁబడి యుద్ధమున జయము గాంచుటయందలి యంతరార్థము, నరుఁడు నారాయణుని చేయూఁతచే సంసారమునఁ గృతకృత్యుఁడగుచున్నాఁడని చెప్పెదరు. ఏది యెటులున్నను, అర్జునుఁడు కృష్ణుని దైవముగ భావించి యతని సాహాయ్యముచేతనే మహాభారత యుద్ధమున సంపూర్ణవిజయము నందఁగలిగితి నని తలంచెను. కాని, నారాయణుని యీ సాహాయ్యము, భారతయుద్ధమునందువలెఁ దన కన్నులయెదుట కృష్ణునిఁ జూచునప్పుడె గాక, తదితర సమయములందును వానికిఁ గానవచ్చుచునే యుండెను. "గోగ్రహణమునాఁడు గురుకులాంభోనిధిఁ గడచితి నెవ్వని కరుణఁజేసి," యని యర్జునుఁడు నాఁటి తన విజయమునకుఁ గృష్ణుఁడె కారణభూతుఁడని యొప్పుకొనెను. కనుమూసి నను విచ్చినను దేవుని యాకారము దర్శించు భక్తుఁడె భక్తుఁడు!



స్వశక్తివలననే దిగ్విజయము గాంచితి నని విఱ్ఱవీఁగక, నిజమగు భక్తుఁడెప్పుడును, తన జయమును తన ప్రజ్ఞకే గాక దేవుని మహిమకే యారోపించుచు, తన జీవిత మతని సేవకె వినియోగించుచు కృతకృత్యుఁడగును.

ఉత్తర గోగ్రహణ కథ మనకు బోధింపఁగల సంగతు లిట్లు పెక్కులు గలవు. సంసార యాత్ర యొక్కొక తఱి మన కన్నుల కుత్తర గోగ్రహణమువలె కష్టసాధ్యముగఁ గానఁబడును. విధికార్యము మన శక్తికి మీఱినట్లును, స్థితిగతులు మనకు విరుద్ధముగ నున్నట్టును, కావలసిన సాధనసామగ్రి మన చేతులకుఁ జిక్కకున్నట్లును, దోఁచును! అట్టి కార్యము నిర్వహింపఁజూచుట సాహసకృత్యమనియు, త్రొక్కమార్గము గర్హ్యమనియు, జనులు తలంపవచ్చును. కాని విధికార్య నిర్వహణ మెప్పటికిని కర్తవ్యమె. ఘన కార్యములు నిర్వర్తింపవలసిన సమయము మనకు ముందు చెప్పి వచ్చునది గాదు. మన కష్టపుడు సాహాయ్యము చేయు బంధుమిత్రాదులు గానరారని వెతనొందుట వ్యర్థము. మన యాత్మపరీక్షకొఱకే దైవ మీ సమయముల నాసన్నము చేసెనని మనము గుర్తెఱిఁగి యావచ్ఛక్తిని వినియోగించినచో విఘ్నపరంపరలు మటుమాయ మగును. లోకము నాశ్చర్యమున ముంపఁజాలిన జయము మనకు లభించును. మఱియు, ఎటువంటి ప్రజ్ఞగాని పూర్వార్జితయశస్సునే యాధారము చేసికొనక, నూతన మార్గములందును స్థితిగతులందును ప్రవేశమై పెంపొందుచుండ వలయును. నిశ్చయమగు జయమును నిశ్చలమగు కీర్తిని జేకూర్పఁగలశక్తి నయశక్తియె. మనుజులను వశీకృతము చేసికొనఁగలది, బాహుబలము కాదు; తుదకు ప్రజ్ఞాబలమును గాదు; సుగుణబలమె. కాని, యీ సద్గుణముల కాయువుపట్టు ఈశ్వరవిశ్వాసము. ఎవఁడు భగవంతుని పరమపితవలెనే గాక, మిత్రునిఁగను, తోడునీడగను జేకొని ప్రేమించి తాను జేయు కార్యము లన్నియు, వానికర్పించి యన్ని కార్యములందును వానిని దర్శించునో

యతఁడే నిజమగు భక్తుఁడు. అట్టివాఁడే నరనామమును సార్థకముగఁ దాల్చినవాఁ డగును.

:o:

## జంతుకోటి ప్రాణరక్షణోపాయములు.

### ౧వ భాగము.

సృష్టిలోనుండు జంతువుల కన్నిటికిని శత్రుజాతి జంతువు లనేకములుగలవు. తమకంటె బలహీనములగు జంతువులమీఁద దాడివెడలుటకుఁ జాలియున్నవే, బలాధికములగు వానివాతనుండి తప్పించుకొనవలసియున్నది. దండయాత్రలు సలుపుటయందును, శత్రువులను జయించుటయందును నివి చూపించు చతురత, పగవారినుండి తప్పించుకొనుటయందును గనఁబఱచుచున్నవి.

జంతువులు తమ శత్రువులనుండి తప్పించుకొనుట కనేకోపాయములు పన్నుచున్నవి. శత్రువులను జయించునపుడు వానిని దరుముకొనిపోవుటెట్లు స్వాభావికమైన పద్ధతియో, వానినుండి తప్పించుకొనునపుడు తాము పారిపోవుటయును నంతస్వాభావికమును సులభమును నైనపద్ధతి. కాఁబట్టి జంతువులు ప్రాణమును రక్షించుకొను విషయమునఁ గనఁబఱచు నుపాయములలో నొకటగు పారిపోవుటనుగుఱించి యిచటఁ గొంత ముచ్చటించెదను.

లేళ్లు, కుందేళ్లు మొదలగుజంతువులు కొన్ని వడిగాఁ బరుగెత్తి శత్రువునుండి తప్పించుకొనఁగలవు. కాని యన్నిజంతువులకు నిది సాధ్యముగాదు. వేగముగఁ బరుగెత్తుటకంటె ననేకజంతువులకు నేర్పుతోఁ బారిపోవుట ఎక్కువ శ్రేయస్కరముగ నున్నది. ఇట్టి సమయములం దాయాజంతువులు గనఁబఱచు తెలివితేటలనుబట్టియే వానివాని యాధిక్యమేర్పడుచున్నది.

జీవకోటి యంతటిలో వాలిడికోఁతి యీవిషయమున నెక్కువ నిపుణతఁ జూపించుచున్నది. మనకు మిక్కిలి దగ్గఱచుట్టమని ప్రకృతిశా



స్త్రజ్ఞులు వ్యవహరించెడి యీతోఁకలేనికోఁతి ధైర్యమునందు మనుష్యునకు రెండవదని చెప్పవచ్చును. బాహుబలమునందుఁ బ్రసిద్ధికెక్కిన సింహము పులి మొదలగు వేఁటమృగములకైనను మనుష్యునికిని గోఁతికినిగల ధైర్యము లేదు. ఈధైర్యమును, సంఘీభావమునే మనుష్యునికిఁ గల యధికారమునకుఁ గారణములయినవి. ఇఁక వానరమన్ననో, జ్ఞానాధికతఁ గాంచినఁ దనదాయాది యగు నరునిమూలమునఁ బ్రఖ్యాతిలేక నానాటఁ క్షీణించుచున్నను, తక్కినజంతువులలో మాత్రము పేరునొందియే యున్నది. మనుష్యులంతగ లేనిప్రదేశములలో మర్కటమింకను సార్వభౌమత్వమును వహించియే యున్నది. మృగములలోనెల్ల సింహము మిగుల పరాక్రమము గలదని చెప్పుదురు. కాని యంత బలముగలదియు, స్వాభావికముగ సాధన సామగ్రిగలదియుఁ గావున నది యింకొకజంతువును జూచి భయపడనక్కఱలేదు. కాని, బోనులోనుంచిన సింగము సూవటివాని దెబ్బలకొదిగియుండును. మిక్కిలి యధమమగుకోఁతి మాత్రమిట్టియవజ్ఞను సహింపనేరదు. సింహమెప్పుడును, బలమునందుఁ దనకును శత్రువునకునుగల తారతమ్యము విచారింపక, కదలుటకుఁ దనకుశక్తియున్నంతసేపును హోరాహోరిగాఁ బోరును: వాలిడికోఁతి యట్లుగాదు. తనశక్తికిమించిన విపత్తు సంభవించినపుడు, కోఁతియూరకగింజుకొనక తప్పించుకొనుటకుఁ దన ధైర్యమును, బుద్ధిని జక్కఁగ వినియోగించును. అంతియె కాని, ఉపద్రవమాసన్నమైనతోడనే ధైర్యము చెడి, ఉన్నశక్తినైన వినియోగింపనేరక గజగజవణఁకుచు, తక్కినమృగములవలె నిది పారిపోదు. పారిపోవుచున్న వాలిడికోఁతులు, తమకును దరుముకొని వచ్చుచున్నవారికిని మధ్యనున్న చెట్లుచేమలు మొదలగు వస్తువుల సాహాయ్యము గైకొనును. అనవసరముగు వేగముతో నవియెన్నఁడును బాఱిపోవు. పిల్ల నెప్పుడును తల్లి విడిచిపోదు. ఒకవేళ పిల్లయొకటి వెనుకఁబడి పట్టుబడుటకు సిద్ధముగ నున్నయెడల, మగకోఁతులు పెద్దవి ప్రాణములు తెగించి వెనుకకుఁ దిరుగును. కోఁతులత్యంత ధైర్యముతోఁ బోరాడి మెలఁగి నట్లనేక నిదర్శనములుగలవు.

భరతపక్షులు మిక్కిలి యల్పమైనవి. వీని శత్రువు హాబీయను నొక పక్షి. ఈ హాబీపక్షి కనఁబడఁగనే, భరత పక్షులు గానములు మాని, మిక్కిలి భయముతో ఱెక్కలు ముడుచుకొని, నేల మీఁదఁ బడి దాఁగుకొనును. కాని యిదివఱకే, శ్రావ్యమగు పాటపాడుచుఁ గొన్ని భరతపక్షులు మిక్కిలి పైకెగిరి యున్నయెడల, అవి క్రిందికివచ్చు పక్షమున శత్రువగు పక్షి మ్రింగివేయునుగాన, అవి దానికిదొరక కుండునట్లుగ మఱింత యెత్తుగ నెగురును. వానిని బట్టుకొనుటకై హాబీపక్షి కొంతసేపటివఱకును ఎగిరి, భూమి కంతదూరమున నెగురుట కలవాటు పడనందున, విసిగి, మరలిపోవును.

అమెరికా సాంఘికస్థానములందలి కఱ్ఱదొలుచు బంగరు ఱెక్కల పులుఁగు, తనశత్రువగు ఫాల్కను పక్షినుండి తప్పించుకొనుటకై, తనకు సమయమునకు గానఁబడిన యేరంధ్రములలోనికైనను జొచ్చును. అట్టిది గానరాకున్నయెడల, ఒకచెట్టుమొదటినిదనఱెక్కలతోఁ బట్టుకొని తాను బాగుగఁ జెట్టెక్కఁగలదుగాన, వేవేగమె, చెట్టుచుట్టును ప్రదక్షిణములు చేసి, ఎక్కిపోవును. ఫాల్కనుపక్షి యంతవేగముగ దాని చుట్టును బోఁజాలక, మరలిపోవును.

వేఁటాడుటయందు నేర్పరియైననక్క, తనప్రాణమును రక్షించుకొనవలసివచ్చినప్పుడు గూడఁ దనబుద్ధి కుశలతనుజూపించుచున్నది. వేఁటగాఁడు పన్నువలలు, బోనులు మొదలయిన వెంతోజగరూకతతో బరీక్షించును. పసివలనను, ఆలోచనచేతను వీనినది బాగుగఁ దెలిసికొనును. నక్కయుండు కలుగువెలుపలనే వలపన్నియుంచినయెడల, అది పైకిరానేరాదు. మిక్కిలి యాఁకలిచేత గాసిపడుచున్నను, పైకిరాక ఓపికతో భూమిలోనుండి తానుబోవుటకు వేఱుమార్గములు త్రవ్వును. చేయునదియేమియులేకపోయి, ఆకలిచేఁజావ సిద్ధముగనున్నపుడు మాత్రమే, ఎట్లైనను జావు నిశ్చయమని తెగించి, యది పైకివచ్చును. ఇంకొకజంతువా వలలోఁ బడినపిమ్మట, ఇఁక వలనుండి భయములేదని యపుడు నక్క బయటికి వచ్చును!



ఒక్కొకప్పుడు, తమకాలితోఁ గాని తోఁకతోఁ గాని యెరను మెల్లఁగఁ దీసికొనుచున్నపుడు తాము వలలోఁ జిక్కుకొనుటను గ్రహించిన నక్కలు, తమ దంతములతో వలలోఁజిక్కిన తమ కాలుగాని తోఁకగాని కొఱికివైచి తప్పించుకొనుటయును గలదు! వలలోఁ దగిలిన, తన ముందు కాలిని గొరికివైచి, మూఁడు నాలుగేండ్లు బాగుగ జీవించి తిరిగి వేఱొక వలలోఁ జిక్కిన నక్క నొక వేఁటగాడు కనుగొనెను.

ఆస్ట్రేలియాలో కాంగారు జంతువులను వేఁటాడెదరు. కుక్కలు వీనిని సులభముగఁ బట్టుకొనఁగలవు. కాని యొక్కొకప్పుడు, ఈజంతువులు మంచిసాహసమును ఆలోచనయును గనఁబఱచును. వేటగాండ్రకుక్కలచేఁ దఱుమఁబడు కాంగారూ, చేరువ నొకనదియున్నయెడలదానిలోఁ బ్రవేశించును. అది మిగుల పొడుగగు జంతువుగావున, కుక్కల కందని లోతునకుఁ బోయి నిలచును! అచటఁ దనవెనుకకాళ్ళమీఁదను దోఁకమీఁదను నది గొంతులోతు నీళ్ళలోనిలువఁబడి, కుక్కలకై చూచును. అంత దగ్గఱకువచ్చిన మొదటికుక్కను దనముందలి కాళ్ళతోఁబట్టుకొని, సాధ్యమయినంతసేపు కుక్కముట్టెను నీటిలో ముంచియుంచును! రెండవ కుక్క మొదటిదానిని తప్పించుటకు రానియెడల, మొదటిది యూపిరి తిరుగక చావవలసినదే! రెండవకుక్క వచ్చి తప్పించినను, మొదటికుక్క వెంటనే యొడ్డుచేరి, నీటముంచునట్టి యీవిరోధితో నిఁక డీకొన నొల్లకుండును. ధైర్యముగల మగకాంగారూ, ఇట్లు 20, 30 కుక్కలతో యుద్ధముచేసి, కొన్నిటినిముంచివైచి కొన్నిటినిభయపెట్టి పారద్రోల గలుగును. అపుడు వేఁటగాఁడు వచ్చి, తుపాకిరవతో నీజంతువునుజంపివైచును.

౩-వ భాగము.

శత్రువులచే ముట్టడింపఁబడినప్పుడు, పారిపోవుట కవకాశము లేదని యెఱిఁగిన కొన్ని జంతువులు, నటనవలనఁ బ్రాణములు దక్కించుకొనుచున్నవి. ఈ జంతువులు ముఖ్యముగ మృతినొందినట్లు నటించుచున్నవి.

సాలెపురుగు జాతిలోని జంతువులనేకము లిట్లు చేయుచున్నవి. ఒకానొక ప్రకృతి శాస్త్రజ్ఞుఁడు సాలెపురుగు జాతిలోని యొకపురుగును గురించి యిట్లు చెప్పుచున్నాడు:— “ఈజాతిసాలెపురుగు తన దారము నుంచి వ్రేలాడు నపుడు మనుష్యులెవరైనను దానినిఁ జేతితో నంటిన యెడల, ఎవరో దాని నాకస్మికముగఁ గొట్టివైచినట్లుగ నది వెంటనే దారమునుండి క్రిందికి జారిపడిపోవును. అప్పుడు పురుగును బరిశీలించిన యెడల, చనిపోయినజంతువు కనబఱచిన చిహ్నములన్నియు నది కనబఱచును. దానినపుడు పట్టి, నొక్కినను, అది యెంతమాత్రమును గదలక, చనిపోయిన దానివలెనే గనఁబడును!”

వేఱుజాతి జంతువులు కొన్నియు నిట్లే చేయుటఁ గనిపెట్టిన ప్రేయరు అనునొక శాస్త్రజ్ఞుఁడు, ఈజంతువిట్లు చేయుటకుఁ గారణము, ప్రాణోపద్రవము వచ్చునను భయమువలన స్మారకము తప్పిపోవుట యె యని చెప్పుచున్నాఁడు. కాని మొదట నుదహరింపఁబడిన ప్రకృతిశాస్త్రజ్ఞుఁడిది యొప్పుకొనక సాలెపురుగులు స్పృహగలిగియె యిట్లు చేయుచున్నవని పలికి, దీనికి నిదర్శనముగఁ గొన్ని సంగతులు చెప్పియున్నాడు. విపత్తు ఉన్నంతసేపు మాత్రమె పురుగిట్టి స్థితిలోనుండి, అప్పుడప్పుడు మాత్రము కాళ్ళు కొంచెము కదల్చుచుండునఁట. దీనిని బట్టి విపత్తు తొలఁగిపోయిన వెంటనే పురుగు యథాప్రకారముగ లేచి పారిపోవుటకు సిద్ధముగ నుండునని యె మనము తలంపవలసియున్నది. కాని యలుకుడు ఏమాత్రము కనిపెట్టినను, పురుగు కొయ్యవలెనే కదలకుండును! ఇది గాక, భయమువలని మూర్ఛయే పురుగిట్లగుటకుఁ గారణమైనచో, స్పృహ క్రమక్రమముగ వచ్చును.

చేఁపలలో పెర్చి స్టర్జను మొదలగు జాతులు నిట్లె చచ్చినట్లు నటించి విపత్తునుండి తప్పించుకొనునఁట.

స్తన్యపానము చేయు జాతిలోని జంతువులలో ముఖ్యముగ నిట్లు చేయునది ఒపోసం అనునది. దక్షిణ అమెరికా ఖండములో నీజంతువు



పొలములలోఁ జొచ్చి కోళ్ళను జంపివేయును. వ్యవసాయదారులు దీనిని బట్టుకొని, కఱ్ఱలతోఁ జితుకఁగొట్టెదరు. అంత నీజంతువు తల వ్రేలాడ వేసి కాళ్ళు నిగిడ్చి, తన యొడలిమీఁదఁ బడుదెబ్బల కెంతమాత్రమును జలింపకుండును. చచ్చిపోయినదని యపుడు దీనినివదలివేయుదురు. ఈజంతువునకుఁ గావలసినదేయిది. మనుష్యులు నెడలిపోయిన తోడనే యీ చిన్న జంతువు లేచి, ఒడలు జాడించి, దెబ్బలు తగిలినను జీవములు నిలువఁ బెట్టుకొన్నది గావున అడవిలోనికిఁ బారిపోవును!

దక్షిణ అమెరికా యందలి అర్జెంటైను దేశపు నక్క, వలలో దగులుకొని నపుడును కుక్కలు వెంబడించి నపుడును, మొదట భీకరముగఁ బోరాడును. కాని కొంతసేపటికిఁ గ్రిందఁబడిపోయి చనిపోయినట్లుండును. స్పృహతప్పకయె నిట్లుండునని శాస్త్రజ్ఞులు తలంచెదరు. చుట్టునుండు వారొకింత దూరము పోయిన యెడల మాత్రము, నక్క మెల్లఁగ గన్నులు తెరచి మిగులజాగరూకతతోను క్రమక్రమముగను మెల్లఁగను, దలయెత్తి, తుదకు శత్రువులు దగ్గఱ లేరని నిర్ధారణఁ జేసికొని నప్పుడు మాత్రమె లేచి పారిపోవును.

ఆ దేశవాసులగు గాకోలనువారు ఇట్లు చేతికఁజిక్కి చచ్చినట్టు నటించుచున్న నక్కను లేపుటకు, దానిని మిగుల క్రూరముగ హింసించెదరు. కాని తననేమిచేసినను, తుదకుఁ గాలు మొదలగు శరీరావయవములను గోసివైచినను, నక్క స్పృహదెలియక యుండునఁట! ఇట్టి నటనయైనచో, జంతువిట్టిబాధకోర్వలేదనియును, ఒకవిధమగు స్పృహయున్నను మిక్కిలి భయముచేత దేహము మొద్దుబారియుండి శవమువలె నగునని యును, కావుననే దాని కేబాధయు నాటకుండుననియును, ఒకొక్కప్పుడు పట్టుపడక పూర్వమును, శత్రువు దూరముననున్నపుడును, ఈ జంతువునకిట్టి మూర్ఛ వచ్చుననియును హాడ్సను అను శాస్త్రవేత్త నుడివియున్నాడు.

శత్రువు సమీపించినపుడు కొన్నిపక్షులు ఇరుగుపొరుగు పక్షుల వలె రుతము చేయుచున్నవి. తక్కిన పక్షులు జంతువులును నున్నవిగాని,

తాము మాత్ర మా ప్రదేశమున లేవని శత్రువునకు బోధించుటకే యివి యిట్లు చేయును. అమెరికాలోని కాసీకుజాతి పక్షులు తమ శత్రు పక్షులగు ఫాల్కనుపక్షులు తమదగ్గఱకు వచ్చుచుండుటఁ గనిపెట్టి, తమ రుతములను మానివైచి, ఇతరపక్షులవలె నఱచును. ఈ పక్షులిట్లు చేయుట తమ సంతోషమునకాయని యొకప్పుడు మనకు సందేహముగలుగును. గొఱ్ఱె యఱచినయెడల తోడనె యీపక్షి దానివలెనె యఱచును. బాతుగాని, కోడిగానిఁ గూసినయెడల వెంటనే దానివలెనే యీ పక్షియును గూయును. కొంతసేపటికిట్లు చేయుటమాని, స్వభావ సిద్ధమైనట్లుగనే రుతము చేయును. కాని వలసినప్పుడు తిరిగి యితర జంతువుల కంఠనాదముల ననుకరించుటకిది సిద్ధముగ నుండును.

తమ ప్రాణసంరక్షణార్థమె కాక, తమ పిల్లలను రక్షించుకొనుటకును గూడ జంతువులిట్లు నటించుచున్నవి. ఇట్లు చేయునవి ముఖ్యముగఁ దల్లిపక్షులు. కనడాలో పార్ట్రిడ్జి అను పక్షి కుంటినట్లు నడచి మనుష్యులను కుక్కలను మోసపుచ్చును. తన పిల్లల గూటిదగ్గఱకు నక్క కుక్క మొదలగు శత్రువగు జంతువేదియైన వచ్చుచుండుటఁ గనిపెట్టిన యీ పక్షి, గూటిని సమీపించుచున్న జంతువునకు ముందుగ గిఱ్ఱుమని తిరిగి కొన్ని బారలు దూరమున దానిముందు వ్రాలును. పక్షి గూటిలోని గ్రుడ్లు మ్రింగవలెనని వచ్చుచున్న నక్క తన యుద్దేశమును మఱచిపోయి, తలవని తలంపుగఁ దనముందు వ్రాలి పడిపోయిన పక్షిని బట్టి కబళింపవలెనని, ముందుకు దుముకును. కాని పక్షి యప్పుడు లేచి, యింకఁ గొంత ముందుకుఁ బోయి వ్రాలును. అంత నక్క దానిని వెంబడించును. ఇట్లీపక్షి యా నక్కను జాలదూరమువఱకును మోసపుచ్చికొనిపోయి, దానినివిడిచి పారిపోయి, తనగూటిని కాపాడుకొనుచున్నది!

తనగూటిలో గ్రుడ్లుగాక పిల్లలున్నయెడల, పార్ట్రిడ్జిపక్షి, శత్రువు తనగూటిని సమీపించువఱకు నుండక, దానికెదురుగఁ బోయి, గూటిదగ్గఱకది రాకపూర్వమె దానిని మోసపుచ్చి, దూరమువఱకును



గొనిపోయి, తాను వేఱొక దూరమార్గమున నిలుచేరి, కూసి, తన పిల్లలను గూటిలోనికిఁ బోగుచేసికొనుచున్నది. ఒకవేళ శత్రువు అకాస్మాత్తుగ గూటిమీఁదికి వచ్చినయెడల, ఒకవిధమగు కూఁతకూసి, అపాయమని పిల్లలకుఁ దెలియఁజేయును. అప్పుడు దానిపిల్లలు కొమ్మలక్రిందను, గడ్డిలోనికిని బోయి దాగుకొనును.

౩ వ భాగము.

కొన్ని జంతువులు పారిపోయియును, నటనవలనను, తమ శత్రువుల నుండి తప్పించుకొనునని చెప్పితిమి. ప్రాణరక్షణోపాయమింకొకటి తెలిపెదము. పై రెండుఉపాయములవలనను విరోధివాతనుండి తప్పించుకొనలేని జంతువు, తనకు శక్తియున్నంతసేపును దానితోఁ బోరాడును. శత్రువగు జంతువు మిక్కిలి బలముగలదియైనచో నిట్టి పోరాటము నిష్ఫలము కావున, సంఘీభావముగల జాతులలోని జంతువులు, బలిష్ఠమగు శత్రువు తమ్ము ముట్టడించెనేని, అన్నియును గుమిగూడి, దానితోఁ బోరాడును. ఇట్లు చేసినప్పుడు, శత్రువు పారిపోవును. లేనియెడల,

"బలవంతమైనసర్పము,
చలిచీమలచేతఁజిక్కి చావదెసుమతీ."

అనునట్టుగఁ దనప్రాణములే కోలుపోవును.

వాలిస్టికోఁతులలో నిట్టి పరస్పరసాహాయ్యము బాగుగఁ గానిపించుచున్నది. తల్లినుండి పారిపోయి, దూరపుచెట్లమీఁద నాటలాడు చిన్న కోఁతిపిల్లను ఈగిలు పక్షి ముట్టడించినయెడల, కోఁతిపిల్ల ఊరకుండక, కొమ్మలనంటిపట్టుకొని, శోక సూచకమగు కూఁతలుకూయును. దాని కూఁతలు వినఁగానె, పదిపండ్రెండు పిక్కబలముగల మగకోఁతులు దాని దగ్గఱకుఁ బరుగెత్తిపోయి, ఒకటి గొంతును, ఒకటి తోకను, ఇంకొకటి ముక్కును, బట్టుకొనిలాగి పక్షిని బాధపెట్టును. ఇన్ని శత్రుజంతువులతోఁ బోరాడవలసి వచ్చుటచేత, పక్షి ప్రాణములు విడుచును. లేదా, తన తోకల యీకలనెన్నో పోఁగొట్టుకొని, ప్రాణావశిష్టమై, యెట్టకేలకుఁ దప్పించుకొని పారిపోవును.

దున్నపోతులిట్లే తమశత్రువగు పెద్దపులిని నిర్మూలింపఁగలుగుచున్నవి. ఒంటరిగనున్న యొక దున్నపోతును పులి చూచెనా, దాని వెన్నుమీఁదికిదుమికి, అదిమి, చంపివైచును. కాని దున్నపోతుల గుమిని పులి ముట్టడించుట సంభవించినయెడల, దానిచావుమూడినదే ! కొమ్ములువంచి యొకదున్నపోతు వ్యాఘ్రముమీఁదఁబడి బలిష్ఠమగు తనతలతో దానిని పైకెగరవేయును. ఇట్లు పైకిగొట్టఁబడి స్మారకముతప్పియున్న పులి నేలమీఁదఁ బడకపూర్వమె, కొమ్ములతోఁ దానినెత్తివైచి, యింకొక పోతు, తక్కిన పోతులవైపునకుఁ బారవైచును. బంతివలె నిట్లొకదానినుండి యింకొక దానివైపునకుఁ ద్రోసివేయఁబడు వ్యాఘ్రము వేగమె మృతినొందును.

తక్కిన ఘాతుకమృగములు దున్నపోతుల జోలికిబోవు. సంఘీభవించియున్న పోతులను తోడేళ్లు ముట్టడింపవు. అవి యేపొదచాటుననో పొంచియుండి, విడిగానడుచునట్టి యేదూడనో పట్టుకొని, దున్నపోతుల గుమికిసంగతి తెలియకపూర్వమె, దాటిపోవును.

దున్నపోతు జాతిలోనివే యగు నుత్తరఅమెరికాలోని బైసనులు నిట్లే, గుమిగూడి, తోడేళ్లను బారద్రోలుచున్నవి! మనుష్యుఁడు వీరిని ముట్టడింపఁగలుగుటకుఁ గారణమేమనఁగా, తనజాడవానికిఁ దెలియకుండ దాఁగి వీనిని వధించుటయె. ఈబైసను జంతువులు మేయు పెద్దపచ్చిక బయిళ్లలోనికి, కొందఱు మనుష్యులు బైసనుతోళ్లను గప్పుకొని, ఆ జంతువులవలెనె వంగి నడచెదరు. వీరినిజూచి యాజంతువులు వీరును తమజాతి జంతువులనియె భావించి, వారి జోలికిఁబోక తాము మేయుచుండును. అంత మెల్లమెల్లఁగ నామనుష్యులు వాని నూచలతోఁగొట్టి పడఁగొట్టెదరు. దగ్గఱ మనుష్యు లెవ్వరును గానరాకుండుటచేత తక్కిన జంతువు లేవిధమగు ననుమానమును లేక, బాణములతోఁ గొట్టఁబడి క్రిందబడిపోయిన తోడిజంతువులు ఊరకబండుకొని యున్నవని భ్రమించి, తాము మేయుచునే యుండును.



గుఱ్ఱములం దిట్టి పరస్పర సాహాయ్యము గానవచ్చుచున్నది. దక్షిణఅమెరికా యెడారులలో నడవిగుఱ్ఱములు గుంపులు గుంపులుగ గలసి మేయుచుండును. విపత్తు సంభవించినపుడు ఆఁగుఱ్ఱములును, పిల్లలును మధ్యకుఁజేరఁగా, మగగుఱ్ఱములు వానిచుట్టును నిలిచియుండి, శత్రువును బారఁద్రోలుచున్నవి. సామాన్యపుశత్రువు వచ్చినప్పుడు మాత్రమవి యిట్లుచేయవు. తోడేలు గానఁబడిన యెడల, మగగుఱ్ఱములన్నియు దానినిదరిమి, తమకుఁ జిక్కినయెడల దానిని ద్రొక్కి చంపును.

మనుష్యుఁడు మచ్చికచేసిన గుఱ్ఱములు వీనికంటఁబడిన యెడల ఇవివానియెడల చోద్యమగు జాత్యభిమానమును జూపుచున్నవి. ఇవి గుఱ్ఱపుబండిచూచుట తటస్థించినయెడల, అన్నియుఁ బండియొద్దకుఁ బరుగెత్తిపోయి, బానిసయైన యాగుఱ్ఱమునుజుట్టి, తమవలెనే స్వేచ్ఛగ, నుండుమని దానికి బోధించుచున్నవా యనునట్టుగఁ గూఁతలు పెట్టి, చెరలాటములాడి, జీనులు పగ్గములను బీకివైచును. గుఱ్ఱపువాఁడు తన గుఱ్ఱమును భద్రపఱుపనెంచి దానిని విడిపింపఁ బ్రయత్నించుచున్న యడవిగుఱ్ఱములను జబుకుతోఁగొట్టెనేని, అవి కోపోద్రేకముతోఁ బండి మీఁదఁబడి, కాళ్లతో బండిని విరుగఁగొట్టి, తమ బంధువగు బండి గుఱ్ఱమును గట్టిన త్రాళ్లను గొఱికివైచి, దానికి స్వాతంత్ర్యత నొసఁగు తమ యుద్యమము నెరవేరినదిగదా యను సంతోషముతోఁ సకిలించుచుఁ బారిపోవును !

ఎంతో యైకమత్యమును గలిగియుండును గావుననే, పగటిపూఁట కాకుల నేవేఁటపక్షులును బాధింపకున్నవి. ఒకకాకి కేమైన యపాయము సంభవించిన యెడల, తక్కినవన్నియు నచటఁజేరి, యఱచి దానికి సాయముఁ జేయుట లోకవిదితమె. కాని రాత్రులు నిద్రచేఁ గాకులు మైమఱచి యున్నపుడు, శత్రుపక్షియగు గుడ్లగూబ, వానిని హింసించుచున్నది. కావున, గుడ్లగూబ తమ విరోధియని గుర్తెఱిఁగి, కాకులు దానికిఁ జెఱుపుచేయఁజూచుచుండును. గుడ్లగూబ పగటిపూట

యందేకాకి కంటనైన బడినయెడల, అది "కావు కావు" మని యుద్ధసూచకమగు కూఁతఁబెట్టును. చుట్టునుండు కాకులు, అంత తమ పనిని మానివైచి, అచటి కెగిరిపోయి ముక్కులతో దానినిబొడిచి, దాని తెక్కల నూడఁబెఱికి చంపివైచును.

పైన వివరించిన యుదాహరణములందు, ప్రాణములను రక్షించుకొనవలసివచ్చినప్పుడు జంతువులు తమశరీరావయవముల నుపయోగించునట్లు చెప్పియుంటిమి. ఒక్కొకప్పుడు, ఱాళ్లు, కఱ్ఱలు, మొదలగు పనిముట్లుకూడ జంతువు లుపయోగించుటయును కలదు. యుద్ధసమయములందు పరికరణముల నుపయోగింపఁగలిగినది యొక మనుష్యుఁడే యని పలువురి యభిప్రాయము. పనిముట్ల నుపయోగించు జంతువులు మిక్కిలి తెలివిగలిగి యుండవలయునని యింకఁ గొందఱి మతము. కాని యీ రెండు ఊహలును సరియైనవికావు. అంతగఁ దెలివితేటలులేని "టాగోస్ట్సు" అను చేఁప, తన శత్రుజంతువుల మీఁదఁ నీటిని జల్లుచున్నది. కోఁతులు, పొడుగగుచెట్లమీఁద గూర్చుండి, చేతికి దొరకిన కొబ్బరికాయలు, టెంకలు, కొయ్యలుమొదలగు పదార్థములను బగవారిమీఁదికి వైచుచున్నవి. కొండలమధ్య నివసించు బేబూను కోఁతులు, తమ్ము దరుముచుండు మనుష్యుల మీఁదికిఁ బెద్దఱాళ్లను దొరలించుచును, చిన్న ఱాళ్ళను రువ్వుచును, తమ్ముఁగాపాడు కొనుచుఁ బరుగెత్తికొని పోవును. ఒక్కొకతరి నీ కోఁతులగుంపులో 100-150 జంతువులుండును గావున వీనిని దరుమువారిమీఁదఁ బెద్ద ఱాళ్ల వర్షము గుఱియును.

ర..వ భాగము.

తమ ప్రాణములను రక్షించుకొను విషయము జంతువు లవలంబించు మూఁడువిధములయిన యుపాయములను గుఱించి యిదివఱకుఁ దెలిపితిమి. ఇప్పుడు నాలుగవపద్ధతిని గుఱించి కొంత ముచ్చటించెదము.

ఈ నాలుగవ యుపాయము కావలియుంచుట. వాలిడికోఁతుల యందీ యుపాయము బాగుగఁ గానిపించు చున్నది. అవి తమ



కాసన్నమైన విపత్తును ధైర్యముతో నెదుర్కొనుటయును, లేక చతురతతో దానినుండి తప్పించుకొనుటయునే గాక, ముందు తమకీ యాపద వచ్చునని యూహించి, అదిరాకుండఁ బ్రయత్నములుగూడఁ జేయుచున్నవి. తమలో సత్తువయు ననుభవమును గలిగినకోఁతి నవి సేనాధిపతిగఁ గోరుకొనుచున్నవి. ఒక కోఁతికిఁగల బాహుబలమును వాడియగు పండ్లనుజూచి, అది తమ్మును గాపాడఁగలదని తక్కిన కోఁతులు దానిని నాయకునిగ నియమించు కొనుచున్నవి. వానర నాయకుఁడును, తన ప్రజల సంరక్షణనిమిత్తమై మిగుల శ్రమపడునేకాని, తన యధికారమును దుర్వినియోగము జేయఁజూడఁడు. కోఁతుల మందకు ముందుగ నతఁడెప్పుడును నడచును; అతని యడుగులవెంబడినే మంద నడిచిపోవును. అప్పుడప్పుడు నాయకుఁడు పెద్ద చెట్టొకటి యెక్కి, చుట్టుపట్టులను పరీక్షించును. అంతయు భద్రముగనున్నయెడల, అతఁ డప్పుడొక ధ్వని చేసి, దానిమూలముసఁ దనమంద కాసమాచారము దెలుపును. అట్లు కాక, విపత్తేమైనఁ జేరువనున్న యెడల నాకోఁతి యింకొకవిధమైన ధ్వనిచేసి మందకుఁ దెలుపును. అప్పుడు కోఁతులన్నియు గుమిగూడి, తమ నాయకుఁడు తీసినత్రోవనె పారిపోవును.

ఇట్లే తమ మందలో నొకదాని యనుమతి చొప్పున నడచు జంతుజాతు లనేకములు గలవు. లేళ్ళు, దుప్పులు, అడవియేనుఁగులును నిట్లే అడవిలోని మార్గములను, మేఁతబయళ్ళను, చోరఁగూడని ప్రదేశములను బాగుగ నెఱిఁగిన తమజాతిలోని యేముసలిజంతువునైన నాయకునిగఁ గోరుకొనుచున్నవి.

తమ యధికారమును స్వాతంత్రతను నొకదాని కొప్పగించుటకిష్టములేని జంతువులు కొన్ని తాము విడిసియుండు ప్రదేశము చుట్టును గావలియుంచుటకై తమలోఁ గొన్నిజంతువులను నియమించు కొనుచున్నవి. ఈ యాచారము అడవికుక్కలు, కాకులు, చిలుకలు మొదలగు ననేకజాతులలోఁ గానవచ్చుచున్నది. ఇట్లు కావలియుంచుటకై

నియమింపఁబడిన కాకులు మిగుల తెలివితేటలతోఁ బనిచేయును. అవి తోడికాకుల నెప్పుడుగాని వృథాగా భయపెట్టవు. తుపాకిని బట్టుకొని వచ్చుచున్నవానికిని కఱ్ఱ చేతనుంచుకొని వచ్చుచున్న వానికిని గల తారతమ్యమివి గుర్తెఱిఁగి, కఱ్ఱచేత నున్నవాఁడు తమ తావుదగ్గఱకు వచ్చువఱకును నివి ధ్వని చేయవు.

చిలుకజాతి జంతువు లన్నియు గుంపులు గుంపులుగ నేర్పడి, పాటలు పాడుచు సంతోషముతోఁ బ్రొద్దుపుచ్చుచుండును. కాని యవి యిట్టి వినోదములలోనికి దిగుటకు ముందుగ నచ్చటచ్చట కావలివారలను నియమించి, ఆటలలోనున్నను, కావలియున్న పక్షులుచేయు ధ్వనులను జాగ్రతతో గమనించుచున్నవి.

దక్షిణ అమెరికాలోని ఆండీపర్వతప్రాంతములందుండు చిలుకలయందుఁ గానవచ్చెడి యుపాయము మిగుల చిత్రముగ నున్నది. తమ నివాసస్థలమగు కాఱడవిలో నున్నపుడవి చెవులు చిల్లులు పడిపోవునట్లుగ ఋతములు చేయుచు, పండ్లేరుకొనుచుండును. అప్పుడు దేని చిత్తము వచ్చినట్లుగ నది కూఁతలుకూయును. కాని యీపక్షులు మొక్కజొన్న చేలోఁబడి, గింజల నపహరింపవలెనని పూనినయెడల, ఆ సమయమందు కూఁతలుపెట్టినయెడలఁ బొలమువానికిఁ దెలియును గావున, ఎంతమాత్రమును శబ్దముచేయక చోరకృత్యమును జరుపుచున్నవి! చుట్టుపట్టులనుండు వృక్షములమీఁద వీనికి సైగలుచేయుటకై వీని జాతిపక్షులు కొన్ని సిద్ధముగనుండును. మానిసి యలుకుడు కాఁగానే, కావలిపక్షులు సైగచేయఁగా, చేను మేయుచుండు పక్షులు చిన్నగొంతుకతోఁ గూయును. మనుష్యులు దగ్గఱనే యున్నారని కావలిపక్షులు రెండవసూఱు తెలుపఁగానే, ఇఁక నిశ్శబ్దముగ నుండ నవసరము లేదుగావున, పొలములోని పక్షులు కూఁతలుకూయుచు నొక్కపెట్టున నెగిరిపోవును. ఒకజాతికొంగలు, ముందువిపత్తును రాకుండఁ జేసికొనుటకై, చుట్టుపట్టులకు వేగులవాండ్రనుబంపి, వారి మూలమున



నపాయముసంగతి గ్రహించి, ప్రాణసంరక్షణముఁ జేసికొనుచున్నవి. ఈ పక్షులనెవరైన బెదరించిన యెడల, తిరిగి యాప్రదేశమున కవి యెంతో జాగ్రతతోఁగాని రావు. ఇట్లు వచ్చునపుడు కొంగలమంద ఆప్రదేశమునకుఁ గొంత దూరమున నిలచి, తమలోఁ గొన్నిఁటిని ముందుగ నచటికిఁ బంపును. ఇట్లు పంపఁబడిన పక్షులుపోయి, ఆ స్థలమును బరీక్షించి సమాచారము నంతటిని కొంగలగుమికిఁ దెలుపును. వీని సమాచారమంతగఁ దృప్తికరముగ లేనియెడల, నింకఁగొన్ని కొంగలా ప్రదేశమునకుఁ బంపఁబడును. ఇట్లు కొంగలు తమ పూర్వపు స్థలమున నేయుపద్రవమును లేదని స్పష్టముగఁ దెలిసికొనిన పిమ్మటనే, అచటికిఁ బోవుచున్నవి!

ఇట్లు జంతువులు పలు విధములఁ దమ ప్రాణరక్షణమునుఁ జేసికొనఁ జూచుచు, కొంతవఱకుఁ దమ యుద్యమమును నెరవేర్చుకొనుచున్నవి. జీవజంతువులలో నిట్లు రెండు విధములగు కార్యములు గానవచ్చుచున్నవి. అవి యేవనఁగా,—తక్కిన జంతువులను దరిమి చంపుటయును, తాముతప్పించుకొని బ్రదుకుటయును, ఎప్పుడును బ్రాణములను గాపాడుకొనుటయే ముఖ్య కార్యముగ నుండ నవసరములేని కొన్ని జంతువులు, తమ శక్తియుక్తులను, ఉపయుక్తములును, వివేకసూచకములునునగు వృత్తులయందు వినియోగించుచున్నవి. ఇట్టి జంతువులలో మిక్కిలి చిన్నది చీమ. మిక్కిలి పెద్దవాఁడు మనుష్యుఁడు. మనుష్యుఁడు ఐహిక విషయములనే గాక ఆముష్మిక విషయములను గుఱించి కూడఁ దగినంతగ నాలోచించుటకు వలసిన మనశ్శాంతిని గలిగియున్నాఁడు.

---

## శ్రీ వీరేశలింగము పంతులు గారు.

మహాశయులారా !

ఈసుసమయమున ఈ మహాసభకు నన్నధ్యక్షునిగాఁ జేసి గౌరవించినందుకు మీకుఁ గృతజ్ఞుఁడను. శ్రీ వీరేశలింగముగారు నాకెంతయు స్మరణీయులు. గురువులు—చిరకాల పరిచితులు. మత సాంఘికాది విషయములందు వారితో నాకు పరిపూర్ణ సానుభూతి కలదు. అనేక మహాశయములందు వారి జీవితమె నాకాదర్శము, వారి యుదార చరితము ఉత్తమోపదేశములును, మెఱపు తీగవలె నామనః పథమున సంతతము తళ్కుతళ్కుమని మెఱయుచు, జీవితధర్మ నిర్వాహణమందు నాకు దారి చూపుచుండును. కావున శ్రీపంతులువారి జన్మదిన మహోత్సవమునఁ బాల్గొనుటకు నాకమితోత్సాహము పొడముచున్నది. కాని, నేటి దినమున నీయున్నతాసన మధిష్ఠించుటకు నాకర్హత లేదని వగచుచున్నాఁడను. ఆఘనుఁడు ఉత్తమోద్యమ నిర్వాహణము పట్లఁ జూపిన కార్యశూరత్వాది సుగుణములకు నేను నోచుకోనైతిని. ఆయన ధీరుఁడు. కార్యభీరుత్వ కళంకితుఁడను నేను! వ్యక్తి స్వాతంత్ర్యతచేఁ జెన్నొంది, పలువురను దాను బూనిన ఘనకార్యమున కాకర్షింపఁగల యపారసమర్థతగల మహనీయుఁడాయన; నేనన్ననో, విశ్వసించిన సత్యమును బ్రకటించు మాటయటుండఁగా, దాని చొప్పున నడచుకొనుటకైన ధైర్యము చాలని దుర్బలుఁడను! కావున నేఁడీ యున్నతాసన భాగ్యము నాకు లభ్యమగుటకు నాయందు మీకుఁగల యవ్యాజ సోదర ప్రేమయె కారణము.

ఒక చిత్ర ప్రతిమయొక్క సౌందర్యము మనము విస్పష్టముగఁ దిలకించి యానందింపవలెనన్నచో, దానికిఁ గొంతదూరమున నిలుచుండి చూడవలయును. అదేరీతిని శ్రీవీరేశలింగ కవివర్యుని వ్యక్తి సౌందర్యమును దర్శింపవలయునన్నచో, మనమింకను గొంత దూరప్రదేశమునుండి దృష్టి



నిగిడింపవలయును. ముఖ్యముగ రాజమహేంద్రవర నివాసులమగు మన నయనములకాయన మూర్తి మిగుల సమీపముననుండెను. కాలవిషయమునఁగూడ మనము తద్వ్యక్తికి సమీపముననే యున్నాము. శ్రీవీరేశలింగముగారి చరిత్రమునందలి సత్య సౌందర్యము మనకు సుబోధము గావలెనన్నచో, ఇంకఁ గొంతకాలము జరుగవలయును. చిత్రపటమునకు మిగుల దగ్గఱగనుండి చూచువారి కన్నులకు, అందలి సొంపులు గోచరింపవుగదా, మీఁదుమిక్కిలి దానిలో మనుజుని పోలికలె కన్పడవు! అంతయు నల్లని గీఁతలతో గప్పఁబడి, వికృతాకారముగా నుండును. అదేవిధమునఁ గొంతకాలము గడచినఁగాని, మనము వీరేశలింగముగారి జీవితమునందలి యుత్కృష్టతను స్పష్టముగ గ్రహింపనేరము. ముఖ్యముగ నంతిమదశయందా వ్యక్తిపటమున మనలోఁ గొందఱి చూడ్కులకుఁ గానవచ్చిన తాత్కాలిక నైల్యము, కాలక్రమముననఁగానిఁ రూపుమాసి, తేజస్సహితమగు నాతని నైసర్గికమూర్తిని బ్రదర్శింపఁజాలదు.

### ఆంధ్రనాయకమణి.

శ్రీ వీరేశలింగముగారు చనిపోయిన కొంతకాలమునకు పునహా వార్తాపత్రికకు వ్రాయుచు, ఆంధ్ర దేశ జననీ గర్భమున వర్తమాన కాలమున నుద్భవించిన పుత్రరత్నములలో వీరేశలింగము నాయకమణి యని నేను నుడివితిని. దీనిలో నావంతయు నతిశయోక్తి లేదని యాంధ్ర నాయకులగు నా మిత్రులొకరు పలికిరి. ఆంధ్రలోకమున నీ యున్నత స్థాన మలంకరించుటకు, పంతులుగారు ఆంధ్ర వాఙ్మయాభివృద్ధి విషయమై సల్పిన కృషియు, ఆంధ్రజనులలో సంఘసంస్కరణోద్యమము నెలకొల్పుటకుఁ జేసిన ప్రయత్నములును, ముఖ్యకారణములు. ఈ రెండు కార్యములును తీగలవలె నొకదానితో నొకటి జంటగ నల్లుకొని, వీరేశలింగ వ్యక్తికిఁ బ్రకాశము లయ్యెను. ఈ రెండును అన్యోన్యాశ్రయములు. వీరేశలింగముగారికి భాషా విషయమునఁ గల యసా

ధారణ రచనా సామర్థ్యమువలననే ముఖ్యముగ సంఘ సంస్కరణోద్యమమును వారుద్ధరింపఁ గలిగిరి. సంఘసంస్కరణ తత్పరతయే యాయన యాంధ్రగ్రంథ కల్పనాకౌశలమునకు వన్నె తెచ్చెను. వీరేశలింగ కవికృతమగు "స్త్రీపునర్వివాహ విషయక విజ్ఞాపనలహరి" యందు వారి వాక్చాతురీతరంగములు మిన్నుముట్టె నని పండితోత్తములగు మిత్రులొక్కరు నాకుఁ జెప్పిరి. సంఘదురాచారములను చెండాడు సందర్భమున నీవీరుడు చేతఁబూనిన హాస్యరస ఖడ్గపువాడి మొన తళ్కులు దశదిశలను వ్యాపించెను. ఇట్లు సంఘ సంస్కరణోద్యమాభిమానము, మాతృభాషాసేవాతత్పరతయు జీవితరంగమున వీరేశలింగము గారు పడసిన విజయములకు అమోఘసాధనము లయ్యెను.

భాషాసేవ

వీరేశలింగముగారి కీర్తిని ఆంధ్రలోకమున చిరకాలస్థాయిగఁ జేయఁ జాలిన యీ రెండింటిలో వారు సల్పిన భాషాసేవయే ప్రథమగణ్యము. ఆయన యాంధ్రభాషామాతకుఁ గావించిన సపర్యలు స్థిరములు, సుఖప్రదములును. జననీజనకులకు తొలిచూలిబిడ్డయందు ప్రేమ మెండు. తెలుఁగున నూతనశకపు వచనరచన చేయఁదొడంగినది వీరేశలింగకవియే. నేఁటి తెలుంగు గద్యమును నెలకొల్పి, అందనేకవిధములగు గ్రంథములను వీరు రచియించిరి. ప్రస్తుతము ప్రాచుర్యములోనున్న యన్నివిధములగు వచన కావ్యసౌధములకు వీరే శంకుస్థాపనముచేసిరి. ఇంతియె కాక, ఆయా తరగతుల గ్రంథములలో వీరివె యిప్పటికి నుత్తమగ్రంథములు. కథలు, వ్యాసములు, శాస్త్రములు, ప్రహసనములు, జీవితచరిత్రములు, కవిచరిత్రములు—వీని కన్నిటి కాంధ్రభాషను తొలిభిక్ష పెట్టినది వీరేశలింగకవియె. వీరు రచియించిన గ్రంథబాహుళ్యమును గూర్చియె గ్రంథరచనాపరిశ్రమ మెఱిఁగిన పలువు రాశ్చర్యము నందుచున్నారు. ఇంక వీరి శైలి వర్ణనాతీతమైన సొంపులతో నొప్పసలారుచుండును. మార్దవమను



నది వీరేశలింగకవి శైలి సొమ్మె! ఆమహనీయుఁడేమి వ్రాసినను పద్యమైనను గద్యమైనను, ప్రహసనమైనను ప్రకృతిశాస్త్రమైనను, శైలి కడు హృద్యముగనుండ వలసినదె! ఇంతేల! ఆయన భాషాంతరీకరణములు స్వతంత్రరచనల ఠీవిని దాల్చి యుండును. ల్యాంబురచిత షేక్స్పియరు నాటక కథల నీయన తెలుఁగున తొలుత వ్రాయుచున్నపుడవి చిన్ననాఁడు నేఁ జదివి, అవియన్నియు నాతని సొంత యల్లికలని భ్రమించితిని! వీనిలోని వైదర్భీవిలాసాది కథల కొన్నింటి శైలి వర్ణనాతీతమగు మధురిమమును దాల్చి యున్నది. వీరేశలింగముగారు, తమ యితర గ్రంథములందును, ఇతరులు తమ గ్రంథములన్నిటియందును, గొనిరాజాలని సొంపు లీయాంధ్రీకరణములందు నా కన్నులకుఁ గానవచ్చునవి. వీరేశలింగము గారికి సంగీతమునం దంతగ నభిరుచియున్నట్లు గానఁబడదు. కాని, ఎంతటి సంగీతశాస్త్రవేత్తయుఁ గనిపెట్టనేరని పదసౌష్ఠవ మాయన కర్ణములు నైసర్గికముగనె గ్రహింపఁ గలిగెను. కానిచో నట్టిపదముల పొందిక, శైలిసరళత వారిపుస్తకములం దెచ్చటను గానవచ్చునెట్లు? అశ్లీలమనునది వారి వ్రాఁతలయందు మచ్చునకైనఁ గానరాదు. వారి సమకాలికులలో పండితోత్తములగు గ్రంథకర్తలనేకులు గలరు. పాండిత్యప్రకర్షమెంత గలిగినను వారిలోఁ గొందఱి వ్రాఁతలలో ప్రాయకముగ కటువులగు పదములును, అశ్లీలములగు వర్ణనములును గానవచ్చును. వీరి గ్రంథములు పఠించినవారికి, పంతులుగారు రచించిన పుస్తకములు చదువుట, ఉప్పునీరు ద్రావిననోట పానకము చవిచూచి నటులుండెను.

నవీన వచనశైలి.

వీరేశలింగకవి ఆంధ్రసారస్వతమున సాధించిన ఘనకార్యము, నూతనశకమునందలి జనుల రుచుల కనుగుణమగు నవీన వచనశైలి నెలకొల్పుటయె. వీరిశైలి నాతికఠినమై, మృదుత్వ మధురిమముల కాకరమైయున్నది. ఇటీవలివారు పాటించెడి గ్రామ్యభాషా

శైలికిని చిన్నయసూరి గ్రాంథికశైలికిని మధ్యస్థముగ నుండి, వీరి శైలి ద్రాక్షాపాకమునకు మంచి లక్ష్యముగ నుండును. శ్రుతికటువులగు పదముల నెట్టులు త్యజింపవలయునో వీరికిఁ దెలిసినట్లు మఱెవరికిని దెలియదు. వలసినచోట్ల సంధి నుజ్జగించి, వ్యాకరణ సూత్రముల నుల్లంఘింపక వీరు వ్రాయుచుందురు. చదువువారు వినువారును హర్షించునట్లు వ్రాయుటయే వీరి ముఖ్యోద్దేశము. ఇట్లు వ్రాయుటకే వీరి కల మలవాటు పడియుండెను. తప్పులు నట్టులు లేకుండ ఏకధారగ వీరి రచనాధోరణి ప్రవహించుచుండును. ఒక తుడుపేనియు లేక పుటలకొలది వీరువ్రాసి యచ్చునకిచ్చిన మొదటి ప్రతులనేక పర్యాయములు నేఁజూచితిని! గ్రంథకారులకెప్పుడును శుద్ధప్రతి సిద్ధము చేయుట కష్టతరముగనుండును. దిద్దినకొలఁదని తప్పులు గోచరమగుచునే యుండును మెఱుఁగు పెట్టిన కొలఁదిని వ్రాఁతలోని 'మకిలి' గన్పట్టుచునే యుండును. కానిఁ సామాన్యముగ వీరేశలింగకవి వ్రాసిన మొదటిప్రతియె శుద్ధప్రతి. అన్ని మెఱుఁగులతోను, అన్ని అలంకారములతోను, పాలకడలినుండి లక్ష్మివలె, వీరి కలమునుండి కవితాలక్ష్మి నైసర్గిక సౌందర్యముతో ప్రభవించి లాస్యము చేయుచుండును!

## పద్యరచన.

వచనరచనయందువలెనే పద్యరచనయందును వీరి కలము మారితేరి యుండెను. వీరిపద్యములు గద్యమువలెనే మృదుత్వలాలిత్యములు చిహ్నములు గలిగియుండెను. నైషధ రామాయణములను రచించిన యౌవనకాలమునకంటె, శాకుంతలము భాషాంతరము చేసిన సమయమునకు వీరిశైలి కొంత సరళమయ్యెను. రామాయణమందలి ప్రౌఢత్వము శాకుంతల నాటకమునఁ గానరాకున్నను, అందలి పద్యము లెక్కువ ధారతో నొప్పుచున్నవి. వీరి కవితాగుణమును తీయని పానకముతోకంటె, వేసవిని జిహ్వకు చైతన్యము గలిగించెడి యావుమజ్జిగ తేటతోఁ బోలుప నొప్పును.



ఆంగ్లేయభాషలో వివిధములగు వచనరచనయందు వన్నెగాంచిన డిక్వెన్సీ, లాంబు, కార్లయిలు, మొదలగు గ్రంథకర్తల సమాచారమును, వివిధమనోభావములను చిత్రరీతులవారు వర్ణించుటయును, నేను పంతులుగారితో ముచ్చటింపఁగా, వారెంతో తమకముతో విని, ఇట్టి క్రొత్తయాభరణములు ఆంధ్రభాషావధూటికిఁ దెచ్చిపెట్టవలెనని తమ యాశయమని కుతూహలముతోఁ జెప్పుచువచ్చిరి. ఆంధ్ర భాషాభివృద్ధియే యాయన ముఖ్యకర్తవ్యముగఁ జేకొనినచో, తమ యుద్దేశముఁ జాల వఱకు నెఱవేర్చియుందురనుటకు సందియము లేదు. కాని, సంఘ సంస్కరణాది కార్యములు నిలబెట్టుటచేఁ, ఆయన వేయియిండ్ల పూజారి కావలసివచ్చెను.

## హాస్యరసము.

గ్రంథరచనాసంబంధమగు నింకొక విషయమును గుఱించికూడ నేను గొన్ని పర్యాయములు వారితో ముచ్చటించితిని. ఆంగ్లేయ భాషలో గ్రంథ రచన చేసిన షేక్సిపియరు, అడ్డిసను, గోల్డుస్మిత్తు, డికెన్సు మొదలగు వారికిఁగల హాస్యరస పోషణమునందలి నిపుణతవలన, వారు రచించిన నాటకాఖ్యాయికాది గ్రంథములకుఁ గ్రొత్తవన్నె వచ్చియుండుట నేను వారితోఁ బ్రస్తావించుచు వచ్చితిని. ఈ నిపుణతను ఆంగ్లమున చమత్కృతియనియు హాస్యరస ధోరణియనియు నందురు. పంతులుగారును, ఈ హాస్యరసము నందుఁ జాల నభిరుచి గలవారు. చిన్ననాఁడే వీరు హాస్యరస ప్రధానమగు అభాగ్యోపాఖ్యానము రచించిరి. పిమ్మట హాస్యసంజీవనులును ప్రహసనములును వ్రాసిరి. వీనియన్నిటియందును పంతులుగారికిఁగల హాస్యరచనా నిపుణత తెల్లమగుచున్నది. కాని, విద్యార్థిదశయందుండు సమయమున నాకట్టె ముదుగు హాస్యములంతగ రుచింపకుండెను. అడ్డిసను, గోల్డుస్మిత్తులు, తమ కల్పనలందు మృదువగు హాస్యరసమునుజూపించిరి. పువ్వునొవ్వకుండ మకరందమును ద్రావు మధుపము వలెనే, శ్రోతలహృదయము నొప్పింపక యీ యాంగ్లకవులు, అందు

మృదువగు నానందమును జనింపఁ జేయుదురు. పంతులుగారి హాస్యమింత మృదువైనది కాక, స్విఫ్టు, పోపు మొదలగు కవుల కటువగు హాస్యరసమును బోలియున్నదని నే నొకప్పుడు హెచ్చరింపఁగా, తామును మృదువగు హాస్యమును తమ వ్రాఁతలఁ జొప్పించెదమని చెప్పిరి. కాని యా సమయమున నాయెదుటనే వారారంభించిన "సత్యరాజా పూర్వదేశయాత్రల" లోఁ గూడ ముదురుపాకముగల హాస్యమును బ్రయోగించిరి. స్వభావము మార్చుకొనుట ఎట్టి చతురులకును దుస్సాధ్యము.

సంఘసంస్కరణము.

వీరేశలింగముగారి రెండవ గొప్ప యుద్యమము సంఘసంస్కరణము. 1879 వ సంవత్సరము నుండి చిరకాలము వఱకును సంఘసంస్కరణోద్యమము వీరి యాత్మతోఁ బెనవైచికొని యుండెను. అదివఱకును, అతిబాల్య వివాహనిరసనము, వేశ్యావృత్తి గర్హణము మొదలగు సంస్కరణముల నీయన ప్రోత్సహించుచు వచ్చెను. 1879 వ సంవత్సరమున వితంతూద్వాహముల యావశ్యకతను గుఱించి వీరు జనులలో సంఘర్షణను కలిగించిరి. 1881 సం॥ డిశెంబరు 11 వ తేది మొట్టమొదటి స్త్రీ పునర్వివాహము రాజమహేంద్రవరమున జరిగెను. అంత వితంతూద్వాహములలోఁ బాల్గొనినవా రందఱిని శ్రీ శంకరాచార్య స్వాములవారు సంఘమునుండి బహిష్కరించిరి. దీనికి భయపడి యీ యుద్యమమునఁ జేరినవా రొక్కరొక్కరే వెడలి పోయిరి. సామాన్యుల కిట్టి యసహాయస్థితిలో భీతియొదవుచుండును. కాని, యీకష్టములు వీరేశలింగముగారి ధైర్యమును కార్యదీక్షను మఱింత వృద్ధి నొందించెను. బోతుసీరును పెద్దయలలును ఈదువారి నెట్లు శోధించినను వారి కౌశలమును బెంపొందించురీతిని, సాంఘిక కష్టములు వీరేశలింగముగారి యాత్మశక్తులను మఱింత వికాసము నొందించి, వారికి స్థిరకీర్తిని సమకూర్చెను. సంస్కార కార్యములకు జనులెంత విముఖులైనను, తాను మాత్రమధైర్యము నొందక తత్కార్యసాధనముఁ జేయుటకే యీయన



నియమ మేర్పఱచుకొనెను. జనులలో వేయింటి కొక్కరియం దైనఁ గనరాని యపరూపమగు నీ నీతి ధైర్యమునకు వీరేశలింగముగారి వ్యక్తి యప్పటినుండియు పుట్టినిల్లయ్యెను!

ఆ కాలమున శ్రీ పైడా రామకృష్ణయ్యగారు మిగుల నుదారబుద్ధితో వితంతూద్వాహాభివృద్ధి విషయమై యొనరించిన ధనసాహాయ్యమును, మిత్రులు విద్యార్థులును పంతులుగారి యెడలఁ గనఁబఱచిన సహానుభూతియు, నెంతయు ప్రశంసనీయములు. వీరందఱి యుత్సాహమోదములవలననే యీసంస్కరణ రథము క్రమముగ సాగిపోఁగలిగెను. సంఘసంస్కరణ విషయమున భరతఖండమున ముందడుగువేయు జనులలో నాంధ్రులు ప్రథమగణ్యులను ఖ్యాతి మన దేశీయుల కానాఁటినుండియు లభించెను.

బ్రాహ్మమతావలంబనము.

1906 వ సంవత్సరమున రాజమహేంద్రవరమున వీరేశలింగముగారు అనుష్ఠాన బ్రాహ్మసామాజికులగుట కొందఱికి వింత గొలిపెను. కాని, సంస్కరణాభిమానము హృదయమునఁ బ్రవేశించిన నాటినుండియు మతవిషయమున వారు బ్రాహ్మమత సిద్ధాంతములనే విశ్వసించియుండిరి. రాజమహేంద్రవరమున ప్రార్థన సమాజము స్థాపించి, మొదటినుండియు వారే యధ్యక్షులుగ నుండిరి వారి మతాభిప్రాయము లిట్టివని యందఱు నెఱిఁగియే యున్నారు. కాని హిందూమతానుసారముగ వితంతూద్వాహములు నెలకొల్పుటకే బద్ధకంకణులగువారు, తుదకన్యమత స్వీకారము చేయుటవలన హిందూస్త్రీపునర్వివాహ పక్షమున కేమైన విఘాతము గలుగ వచ్చునని మిత్రులు కొందఱు భయపడిరి. లేదా, బంగాళాదేశము నందువలెనే యాంధ్రదేశమునను, వితంతూద్వాహ సంస్కరణము హిందువుల చేతినుండి జారి బ్రాహ్మసామాజికుల హస్తగతము కావచ్చునని కొందఱు భీతిల్లిరి. కాని, యట్లు జరుగదయ్యెను. పంతులుగారు తా మన్యమత స్వీకారము చేసియున్నను, తాము నడపు

హిందూ విశ్రాంత శరణాలయమును హైందవాచారముల చొప్పుననే నడుపుట కేర్పాటుచేసిరి.

నూతన మతదీక్షా స్వీకారసందర్భమున పంతులుగారు, తాము చేసిన ప్రార్థనలో, తామిన్నాళ్ళనుండియుఁ దమకు విశ్వాసములేని కర్మకాండ నియమములను బాటించుచు వచ్చితిమనియు, ఇఁకముందు వానిని విసర్జించి తమ కళంకమును బాపుకొనెదమనియుఁ జెప్పిరి. ఇది కొంత యనవసరమేమోయనినాసందియము. పంతులుగారి యాంతరంగిక మతాభిప్రాయములు, విశ్వాసములును హిందూమతమునకుఁ గొంత విరుద్ధమైనవని యెరికి దెలియదు? దీనికై వీరిని నిందించువారు విహితులలోను విరోధులలోను లేరు. వితంతూద్వాహపక్షము ననుసరించి యుండుటచేత బహిష్కరింపఁబడి, తమకుఁ బ్రియమగు హిందూసంఘము నుండి తాము వేఱుగ నుండవలసి వచ్చినటులె, తమ యభిమాన మతమగు బ్రాహ్మమత మవలంబింపక, ఏతన్మతానుసారులనుండియు, తమ స్వార్థత్యాగబుద్ధి ప్రేరణముచేతనే, ఇన్నాళ్లును పంతులుగారు వేఱుగ నుండిరని యందఱు నెఱింగినకథయే. పాలకొఱకు తాయి మోయ వలయును. తామిదివఱకుఁ గొంత కపటపు జీవితము గడపితిమని పంతులువారా సమయమున దురపిల్లుట యనవసరము. తాము చేపట్టిన ఘనోద్యమపక్షమె ప్రధానమని యదివఱకు హిందూసంఘసంస్కరణ దీక్షను పంతులుగారు చిరకాలము పూనియుండిరి. తుదకు వ్యక్తి స్వాతంత్ర్యమే ప్రధానవిషయముగఁ జేకొని పంతులుగారన్యమతావలంబనము చేసిరి. వారిపుడు త్రొక్కినమార్గము మంచిమార్గమె యైనను, అదివఱకు చాలకాల మనుసరించినది మాత్రము ఉత్తమ మార్గము.

### సార్థకజీవితము.

పంతులుగారి జీవితము దీర్ఘమైనదియు, కడు సార్థకమైనదియు. జీవితచరిత్రకారులకిట్టి కథానాయకుఁడు లభించుట యరుదు. దేశము నంతటిని కల్లోలపఱుపఁగల సంఘసంస్కరణము గావింపఁగలవారును



భాషకుఁ గ్రొత్త పోకడలు సూచించి తమ యసమాన ప్రజ్ఞచే నాభాషా సారస్వతమున వాగనుశాసనునివలెఁ దమ యధికార చిహ్నములు శాశ్వతముగ నిలుపఁగలవారును, ఏకాలమందైనను, ఏదేశమందైనను, లెక్కకు మిక్కిలి తక్కువగ నుందురు. ఫలవృక్షమున సంవత్సరపు పంట యంతటిలో నొకటియో రెండో పెద్దపండ్లు గానఁబడును. ఆంధ్రదేశాంగన భాగ్యమహిమమున నామె పుణ్యగర్భమున నుద్భవించిన శ్రీ వీరేశలింగముగారు నట్టి యుత్తమఫలము. అట్టి మేటిపురుషుఁడు ఆంధ్ర దేశోద్ధరణమునకును ఆంధ్రభాషాభ్యుదయమునకును ఆమహానీయుఁడు చేసిన ప్రయత్నములు సర్వోత్తమమైనవి.

మనుజులను, ముఖ్యముగ వారిలో కవులను, అందఱినన్ని పూలచెట్లతోఁబోల్పవచ్చును. కాని, మల్లెతీగకు మందారపుష్పములును, గోరంటకు గులాబిపూవులును బూయలేదనితప్పునట్టము. గంధవహుఁడా కుసుమముల నుండి గొనివచ్చు కమ్మతావుల నిసడించుచున్నాము! కొందఱు ముండ్లు లేని గులాబి కుసుమములకును, అలలులేని సముద్రము కొఱకును బరితపించి, లోకము సుందరవస్తు విహీనమగు నెడారియని తలంచుచున్నారు. కొందఱు వీరేశలింగము, లేనిపోనివితంతూద్వాహములు తెచ్చిపెట్టెనని కోపించి, ఆపుణ్యపురుషుఁడు రచించిన ముద్దులొలికెడి రచనల బూజు నింకను దులుపకున్నారు. ఆయన హిందూమతద్వేషియని కొందఱింకను గినుకవహించి, ఆమహానీయుఁడు పలుకష్టములపాలై నెలకొల్పిన సంస్కరణముల ప్రయోజనము గ్రహింపకున్నారు.

వీరేశలింగము, ఎంత ప్రజ్ఞావంతుఁడైనను, మనుష్యమాత్రుఁడె! ఎక్కువ తేజస్సహితమగు దీపమున కెక్కువ నీడయుండును. దేశోద్ధరణఁ జేయు మహానీయులును మనుష్యమాత్రులగుటచేత, వారియందు లోపము లుండకమానవు. వీరేశలింగముగారియందు గానవచ్చెడి లోపములకుఁ గొంతవఱకు మనమె కారకులము. సంఘమునుండి బహిష్కృతుఁడై, చిరకాల మొంటరిగఁ గాలముగడపుట కలవాటుపడిన యాయన

స్వభావమున ప్రమత్తగా, నిరంకుశాధికారేచ్ఛ, అధికారగ్రహాది గుణములు పొడసూపుట యందేమి యాశ్చర్యము ?

అంతిమదశయందీపురుషుని వర్తనవిషయమై జనులలో గొందఱికిఁ గలిగిన సందియములును, దేశమెల్ల నదివఱకు తన నీతి సందేశములతో ముంచివైచిన నీతఁడు మూఁడు కాళ్ల ముసలియైనపుడు తన ప్రవర్తన నైర్మల్యమును నిలువఁబెట్టుకొనుటకు న్యాయస్థానముల కేగ వలసి వచ్చుటయు, మొదలగు సంగతులు స్మరించుట కిది సమయము కాదు. ఈ సంగతులు పరిశీలించుటయందు మనకంటె నిపుణులగు మన తరువాతి వారు, వలసినచో చర్చచేసి, తనివి నొందెదరుగాక ! మనము మాత్ర మీ దుస్స్వప్నము మరచిపోవలయును. ఎన్నఁడును కార్యశూరుని మీఁదనే కడుమాటలు పడుచుండును. దేశోద్ధరణమునకై జీవితమును ధారవోసిన సోక్రటీసు, గ్రీకుయువకులను జెరుపుచుండెనని ఆతెన్సు నగరవాసులు నిర్ధారించి, వానికి విషమిచ్చిరి. మనః పారిశుద్ధ్యమునకై పాటుపడిన జీసను రాజ్యపదవిమీఁద గన్నువైచెనని యూదీయులాతని గొఱతవేసిరి. ఇది మాఱరాని లోకమర్యాద ! ఇహమునే నమ్మియుండువా రిట్టిఫలములె పర్యాప్తము లని తలంతురు. వర్తమానమై ప్రధానమును వారికిట్టి వర్తమానపు పరిస్థితులు పరిపూర్ణ సంతృప్తి నీయ వచ్చును. తదితరుల దృష్టిమాత్రము దూరప్రదేశములకుఁ బోకమానదు. న్యాయసత్యవిమర్శన నెఱుఁగఁగల న్యాయస్థానము లింతటితో నంతరింప లేదు. వీనిపై యధికారము గలవి పరమునఁగలవు. పుడమినే గావలయు నన్నచో నట్టి సత్యధర్మ నిర్ధారణ చేయఁగలది కొంతవఱకు భవిష్యత్కాలమే.

## పౌరుల కర్తవ్యము.

నేను వేదాంతవచనములు పలుకుటకు రాలేదు, మన ముఖ్య కర్తవ్య మాలోచించుటయే నాయుద్దేశము. యౌవనమున విరాగి యగువాఁడు వార్ధకమున విషయలోలుఁ డగుట కేమియభ్యంతర మున్న



నంశమును విమర్శనచేయుచు రాజమహేంద్రవర వాసులిపుడు పోట్లాడు పుచ్చుచున్నారనియు, శ్రీనాథుని వీధినాటక కాలమునుండియు వారికిట్టి కుతర్కములయం దత్యంతాభిరతియనియు నితరమండల వాసులు మనలను పరిహసించుచున్నారు ! సోదరులగు రాజమహేంద్ర పురవాసులు, మన మంచిపేరు దలంచియైన నింతటితో నీ నిరుపయోగమగు నంశమును మఱచి పోవుట శ్రేయము ! శ్రీ వీరేశలింగ వృక్షముయొక్క పాశ్చాత్త్యమును మనము విమర్శింపఁగోరితిమేని, ఆ మహావృక్షమునం దంతిమదశయందుఁ గొందఱి కన్నులకుఁ గానవచ్చిన బదనికలు, ఎండుటాకులు, జీర్ణశాఖలును బరిశీలించుటకంటె, జీవితకాలమంతయు ఆ మహాతరుశాఖల విరాజిల్లిన మనోహర కుసుమములును, స్వాదుఫలములును, దర్శనీయమగు పర్ణములనీడను సుఖించిన జంతుసంతానమును, కొమ్మలమీఁద సుఖగానము చేసెడి పక్షిసమూహమును—వీటినన్నిటిని దలపోయుట న్యాయముకదా ! గోదావరినదీ నిర్మల జలమాధుర్యమును బరికింపఁ గోరువారు, సాగర సంగమ ప్రాంతమందలి క్షారోదకమును పుక్కిటఁ బట్టి చూచుటకంటె, నాసికాత్ర్యంబకమునుండి బయలువెడలి పెక్కు యోజనముల పొడవువ్యాపించి యధిక సంఖ్యాకులగు జనులకును లెక్కకు జంతుసంతానమునకును, తరులతా సస్యాదులకును తన తీయని నీటితోఁ బ్రాణమిచ్చి సేదదేర్చెడి దీర్ఘప్రవాహమునందలి మధురోదకమును గ్రోలుట యుక్తముకదా ! వీరేశలింగ కవివర్యుఁడు మన జనులకును మాతృభాషకును మహోపకారము చేసెను. ఆ మేళ్ళను గుఱించియైన మన మాయన దోషలవముల క్షమించి, మఱతుముగాక ! ఆ మహాపురుషుఁడు తన విధ్యుక్తకార్యముల నెఱపి, ధన్యుఁడయ్యెను. మనమును మన విధికార్యములను యథాశక్తి నెరవేర్చి, కృతకృత్యుల మయ్యెదముగాక !

---

## ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుఁడు.

"సంతోషచిత్తుల ముఖావలోకనము చేసి యానందించుట నాకు స్వభావము" అని యొకానొక సుప్రసిద్ధాంగ్లాఖ్యాయికా కర్త తనను గూర్చి చెప్పికొనెను. ఉత్తమోపాధ్యాయుని లక్షణము నిదియె. లోకమంతయు కష్టభూయిష్ఠముగఁ దోఁచుచున్నను, పాఠశాలలో నడుగిడఁగనె, విద్యయందు దినదినాభివృద్ధినందుచు జ్ఞాన సమార్జనముపట్ల నూతనోత్సాహమున సొబగొందెడి ముఖారవిందములతో నొప్పెడి శిష్యబృందమును జూచుటయె గురువనుభవింపఁగల సుస్థిరసౌభాగ్యము. లోకములో జరిగెడి మహాకార్యములలోఁ బాల్గొనుటకుఁ దనకంతగ నవకాశమును శక్తియుక్తులును లేకున్నను, అజ్ఞానతిమిరమును బారఁదోలి సత్యమును ప్రకటించుటకును; కష్టములను బాపి సౌఖ్యము నొసఁగూర్చుటకును సహకారమగు జ్ఞానబోధన మొకకొందఱు శిష్యులకుఁ గావించి వారిమూలమున భవిష్యత్కాలమున జరుగఁగల లోకోపకారకార్య నిర్వహణమున దాను నొకింత పాల్గొంటినని యుపాధ్యాయుఁడు సంతోషమును సంతృప్తిని జెందియుండును. అజ్ఞానమె దుఃఖహేతువు. అజ్ఞానమే మితిలేని కష్టములకాకరము. అట్టి యజ్ఞానమును రూపుమాఁపుటకుఁ గంకణము కట్టుకొనిన విద్యాబోధకుని చిత్తవృత్తి నిశ్చయముగ సంతోషమునకుఁ దావలమైయుండును.

### ప్రాథమిక విద్య.

విద్యాసౌధమునకు ప్రాథమిక విద్యయె పునాదియు మొదటి మెట్టును. సర్వకళలకును సర్వవిద్యలకును, ప్రాథమికవిద్యయె కన్నతల్లి. వనితకు 'పెండ్లినాఁడు పెట్టని నగలు రానట్టు' గనే విద్యార్థికి ప్రారంభదశలో నలవడని సుగుణజాలము పిమ్మట సామాన్యముగ లభింప నేరదు. తల్లి పెంపును బట్టి మనకు బాల్యమున శరీర సౌష్ఠవ మెటు లేర్పడి యారోగ్యము నొడగూర్చుచున్నదో యటులె, ప్రాథమిక విద్యాభ్యాస కాల



మున గురువు నిపుణతచేత మానసికశక్తు లంకురించి వికసించును. సుగుణ సామర్థ్యముల మాట యెటులుండినను ప్రారంభవిద్యా కాలమున మనకుఁ బట్టువడు దుర్గుణ దుర్బల పిశాచములు యావజ్జీవమును మనలను వెంటాడి పీడించుచునే యుండును. ఇదియె ప్రాథమిక విద్యయొక్కయు, ఆనాఁటి గురువులయొక్కయు ప్రాముఖ్యమును సూచింపఁగలదు.

### ప్రాథమిక విద్యాదుస్థితి.

విద్యాబోధనకార్యమందు గురువునకు సంతోషము నొసఁగు విషయమున నందఱు శిష్యులు సమానులయ్యును, పెద్ద తరగతిలోని వారికి విద్య నేర్పుట కంటె చిన్నవారికి నేర్పుట ఒక విధముగఁ గష్టతరమని చెప్పవచ్చును. ఎట్టి విద్యాసంపదయు నెంతటి యనుభవ కౌశలములును ప్రాథమిక విద్యా బోధనాకార్యమునఁ గావలసియుండును. దయాక్షమాద్యుత్తమ బోధక లక్షణములు ప్రాథమికవిద్యాబోధనా సందర్భమునం దత్యవసరములు. కావున నిట్టి పాఠశాలలలోని యుపాధ్యాయులను నియమించుటయందు ఉన్నత పాఠశాలలయందలి గురువుల నేర్పరచునప్పటి కంటె ప్రజలెంతో మెలకువ గలిగి యుండవలయును. ఇంగ్లండు మొదలగు కొన్ని దేశములలో, పై తరగతుల పాఠశాలలలో కంటె ప్రాథమిక విద్యాలయములలో, ఎక్కువ విద్యా సంపన్నులు ననుభవశాలులునగు నొజ్జలకు జీతము లధికముగ నిచ్చి నియమింతురని వినియున్నాను. ప్రాథమిక విద్యాబోధన విషయమై నూతన విషయములను సులభబోధనా పద్ధతులను గనిపెట్టిన విద్యాశాస్త్ర వేత్తలకా దేశముల నెంతో యాదరము గలుగుచున్నది. ఉన్నత విద్యాశాలలు, కళాశాలలును వ్యాపింపఁజేయుటకంటె దేశములో ప్రాథమిక విద్యావ్యాపనము సల్పుటయె ముఖ్యమని యనేక దేశముల వారొప్పుకొనిన విషయము. ఇఁక మన దేశమునందో ప్రాథమిక విద్యను, "అమ్మగా మిగిలిన మేకపోతు" వలెఁజూచుచున్నారు! ఆపాఠశాలను గుఱించికాని, అందు నేర్పబడు విద్యనుగుఱించికాని జనులంతగ శ్రద్ధ వహింపకున్నారు, అట్టి విద్యాలయ

ములకెంత తక్కువ వేతనమున కయ్యవారు చిక్కిన నంతమేలని ప్రజలు భావించుచున్నారు !

### ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుల కష్టములు.

“బ్రతుకలేనివాఁడు బడిపంతులగు” నను సామెతయె ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుల లోపములను గష్టములను సూచింపఁగలదు. ఎచ్చటను జీవనోపాయము గలుగని వారికీవృత్తి శరణమగుచున్నది. కాని ‘వ్రతము చెడినను ఫలము లేకున్నది !’ ప్రస్తుత పరిస్థితులనుబట్టి నెలకిరువదియైదు రూప్యములు లేక సంసార యాత్ర చేయుట యొక కుటుంబికిఁ గష్టమగుచుండఁగా ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులలోఁ జాల తక్కువ మందికైన నింత జీతము లభ్యమగుట లేదు. ఒక్కొక తరుణమున దారిద్ర్యము గౌరవాపాదకము కావచ్చునుగాని, కటిక పేదఱికమున కంటె సామాన్యముగ కష్టతరమైన దీలోకమున వేరేదియుఁ గానరాదు. అన్ని విద్యలకును, అన్ని వృత్తులకును మూలాధారమగు ప్రాథమికవిద్యా గురువునకుఁ దగినంత జీవనాధారము గలిగింపకుండుట మన దేశీయులకు విద్యయందుఁగల యౌదాసీన్యమునకుఁ దార్కాణము.

### 1. బోధనాభ్యసన పాఠశాలలు.

ప్రాథమిక పాఠశాలా బోధకుల మొదటి కష్టము వారు బోధనాభ్యసన పాఠశాలకుఁ బోవునప్పుడు గలుగును. వీరి కచట నీయఁబడు నెలజీతము (ఎనిమిది రూపాయల పై చిల్లరయు) భోజనమునకుఁ సరిపోక విద్యార్థుల కొక ప్రక్క మాడుచునే యుండుట లోకవిదితము ! పూర్వమీ కష్టమున కోర్చి, యుపాధ్యాయులెటులో యొక సంవత్సరము కనులు మూసికొని బోధనాభ్యసన పాఠశాలయం దజ్ఞాతవాసము సలుపుచు వచ్చిరి. వారి కష్టములను ద్విగుణీకృతము చేయుటకా యనునట్టుగ నిపుడట్టి విద్యాలయములలో వారు గడపవలసిన కాలము రెండు సంవత్సరములకుఁ బెంపఁబడినది. నేరము చేసిన చెఱసాలలోఁ గాలము గడుపు ఖైదీకైనను దొరతనము వారు సదుపాయము చేయు



చున్నారు. కాని దేశోద్ధరణమున కుపకరించు విద్యావ్యాపన వృత్తి నవలంబింపఁగోరు విద్యార్థులకు బోధనాభ్యసన కాలమునఁ దగిన వసతి చేయుట లేదు !

ఈ బోధనాభ్యసన పాఠశాలలు చూచి విద్యార్థుల మనములు “గుడికి గొనిపోఁబడు మేకపోతులవలె” సామాన్యముగ వెనుకడుగిడుటకుఁ గారణమేమి ? అక్కడ కఠినముగను శాస్త్రానుగుణముగను విద్యాబోధనము జరుగుచుండుటయె యని కొందఱనవచ్చును. శాస్త్రమెన్నటికేని మనుజులను నిర్హేతుకముగ హింసింపుమని బోధించునా ! మనల రక్షించుటకే శాస్త్రమేర్పడును గాని భక్షించుటకుఁ గాదు. మన దేశమునందిప్పటి సామాన్య పాఠశాలలును ముఖ్యముగ బోధనాభ్యసనపాఠశాలలును గురు శిష్యన్యాయాదుల నభినయింపననువగు నాట్యరంగములుగాని ఆయాధర్మముల నాచరణమునఁ బెట్టనేర్పడిన యాశ్రమ స్థలములు గావు

బోధనాభ్యసన పాఠశాలలలో వెనుకటికంటె నిప్పుడు శిష్యులకెక్కువగ సువిషయములు బోధింపనవకాశము గలుగుచున్నది. ప్రాథమికబోధకునికి బోధనాక్రమమె కాక వివిధ శాస్త్రములలోని సంగతులు నిపుడు నేర్పఁబడుచున్నవి. ఇది సమంజసమె కాని యధిక సంఖ్యాకములగు విషయములు నేర్పుటకంటె కాఁబోవు గురువున కత్యావశ్యకమగు శారీరశాస్త్రమువంటివి యొకటి రెండు సమగ్రముగ నేర్పి తక్కినవి పిదప వారంతట వారు చదువుకొనుటకు దారిచూపినఁ జాలునని యెంచెదను. అట్లు కానిచో అందిపుడు నేర్పు పలు విషయములకుఁ గన్ను చెదరి శిష్యులు తొట్రిలుట సంభవించుచున్నది. ఇదిగాక సూర్యోదయము మొదలు సూర్యాస్తమయము వఱకును విద్యార్థి యచట డ్రాయింగు డ్రిల్లు మొదలగు నిత్యకర్మలతోనే కాలము పుచ్చుచున్నాఁడు. బోధనాభ్యసన విద్య కుపకరించు గ్రంథములు చదువుటకును తుదకు శరీరవ్యాయామమునకును తీరిక లేకున్నది ! ఇది శ్రేయము గాదు.

## 2. జనులు.

ప్రాథమిక పాఠశాలలలోని యుపాధ్యాయుఁడు పడు కష్టములలో నింకొకటి యతఁడు పనిచేయు తావులలోఁ గలుగుచున్నది. ఉపాధ్యాయుఁ డనుభవించు దారిద్ర్యవశమున సంఘమున వాని కంత గౌరవము లేకున్నది. ఇఁక "పైకము లేనివాఁడు పరస్త్రీ వర్జితుఁ" డని లోకము వాని నిష్ఠానియమములను కూడ పరిహసించుచున్నది. జనుల కిటు లోకువయైన యుపాధ్యాయుఁడు తనకీ వృత్తివలనఁ గలుగని లాభ గౌరవములు, అన్యవృత్తుల చవిచూచిన కొంత లభింపవచ్చునని తలపోసి యితర వృత్తులందుఁ దలదూర్చుచున్నాఁడు. లేదా, తన వృత్తియందే యధిక లాభము నందఁగోరి యక్రమ కార్యాచరణమునకు లోనగుచున్నాఁడు!

## 3. అధికారి వర్గము.

అన్ని దెసలను నిరసింపఁబడు నుపాధ్యాయుఁడు తన కష్టములు బాగుగ గ్రహింపఁగల విద్యాశాఖ యుందలి యుద్యోగస్థులవలనఁ గూడఁ దనకు గౌరవసంప్రాప్తి గలుగుట లేదనియు, "ఏఱు దాటిన వెనుక తెప్ప తగులఁబెట్టు" వారివలెనే వీరును తమ విద్యావ్యాపన వృత్తియెడల విముఖులగుచున్నారనియును, మొఱ లిడుచున్నాఁడు. విద్యాలాభము నొంది విద్యావ్యాపన కార్యమె దీక్షగాఁ గలవారు నిక్కువముగ తోడి విద్యాబోధకుల ననాదరణము చేయుదురా? నేను కటికంటె నిపుడీ విషయమున ప్రాథమిక బోధకుని స్థితి బాగుపడినదని చెప్పవచ్చును. ఇప్పుడు ప్రతి మండలమునను పరీక్షాధికారు లనేకులు నియమింపఁ బడియున్నారు. వీరిలోఁ జాలమంది పట్ట పరీక్షాద్యున్నత విద్యలం దారితేరి యుదార చిత్తములతో నుండువారు. విద్యాబోధక వృత్తి యుత్తమమని మనసార నమ్మి, ప్రాపంచిక లాభములకు విముఖులై, ఋజుమార్గమున జీవితము గడపి కృతకృత్యులు కాఁగోరు పరీక్షాధికారులను గొందఱిని నేనెఱుఁగుదును. వార్షికములకును, పారితోషి



కములకును ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులను నిర్బంధించు పద్ధతి చాలవఱకు తగ్గిపోయినదని నాయభిప్రాయము. విద్యావ్యాపన మహా కార్యము జయప్రదముగ జరుగుటకు బోధకులెంత యావశ్యకమో పరీక్షకులు నంత యావశ్యకమని గుర్తెఱిఁగి విద్యాశాఖకు సంబంధించిన యీ యిరు తరగతుల వారును, లేనిపోని వైషమ్యముల కెడమీయక ఒక తల్లి బిడ్డలవలె సౌహృదము గలిగి మెలఁగుట శ్రేయము.

## ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుల లోపములు, విధులు.

ఋజుమార్గమున నడచుకొను నుపాధ్యాయుఁడు తన కష్టముల నంతగ లెక్కసేయక తన లోపములను దిద్దుకొనుచు విధులను నెరవేర్చుచుండును. కష్టములకును లోపములకును ఒక విధమగు కార్యకారణ భావము వాని కన్నులకు గోచరమగుచుండును. కావున నుపాధ్యాయులు తమ కష్టముల కూరక వెతనొందక తమ లోపములను తిన్నఁబఱచుకొనుటకుఁ బ్రయత్నింపవలయును.

## 1. అజ్ఞానము.

అజ్ఞాన తిమిరమును బాఱఁద్రోలుటయే విద్యయొక్క పరమావధి. అట్టిచో, విద్యాప్రబోధకుల యాత్మలను అజ్ఞాన తిమిరము గ్రమ్ముకొని యుండుట శోచనీయము. శిష్యులలోకంటె గురువులలోనె యొక్కొకతరి నధికముగ నజ్ఞానము పొడఁగట్టుచున్నది! సరళ స్వభావముగల విద్యార్థి యజ్ఞానము తాత్కాలికమైనది. అధికజ్ఞాన సంపాదనమున నది తొలఁగిపోవును. కాని యహంభావముతోఁ గూడిన గురువు హృదయమున నెలకొనియున్న యజ్ఞానమును పెకలించుట మాత్రము దుస్తరము! విద్యానిధులనఁదగు పూర్వకాలపు ప్రాథమిక గురువుల శకమిప్పు డంతరించిన దని చెప్పవచ్చును. దేశభాషయందు నారికేళ పాకమగు పాండిత్యమును, కొందఱికి మంచి కవిత్వధోరణియుఁ గలవు. ఇపుడవి రూపుమాసినవి. ప్రస్తుతకాలపు గురువునకు ఆంధ్రమునఁ బ్రవీణత లేదు. చాలచోట్ల విద్యా విషయములందు గురుశిష్యుల కంతగ భేదము

లేకున్నది. తెలుఁగున పంచకావ్యములు పఠించి, కొంతసాహిత్యము లవలంబించుకొనిన ప్రాథమికోపాధ్యాయు లరుదుగనున్నారు. ఇఁక వీరికి గణితాది విషయము లందును వెనుకటివారి పాండిత్య ప్రజ్ఞలు గానఁబడుట లేదు. అట్టివారి యపరిజ్ఞానమును తొలఁగించుటకు వారిని బోధనాభ్యాసనాలయములకుఁ బంపిన నేమిలాభము? వజ్రమునకు సానపట్టిన ప్రయోజనమున్నదికాని రాతికిఁబట్టిన నేమిప్రయోజనము? చిన్ననాఁడు ప్రథమపాఠశాలలో నిట్టిగురువుల బోధనా ప్రభావమువలననే కాఁబోలు. అజ్ఞాన పిశాచము, పైతరగతులకు వచ్చినను శిష్యులను వీడకున్నది! ప్రతిసంవత్సరమును వేలకొలఁది స్కూలుఫైనలు పరీక్షకు వచ్చెడి తెలుఁగు బాలురలో తెలుగు వ్రాఁత చక్కఁగ వ్రాయఁగలిగిన వారు మిక్కిలి స్వల్ప సంఖ్యగలవారె! ఇఁకఁ జదువుట కనువుగాని కొకిబికి వ్రాఁత వ్రాయువారి సంఖ్యకు మితిలేదు—చాలమందికి వర్ణక్రమము రానేరాదు! కొన్ని యక్షరములు రాక, ఒకదానికి మాఱు వేరొక యక్షరము వ్రాసి ఎటులో పరీక్షాధికారి కంటికి గంతలుగప్పి తప్పించుకొనఁ జూచువారు పలువు రున్నారు. ప్రాథమిక పాఠశాలలోఁ గడపిన మూఁడు నాలుగేండ్లకుఁ దోడు హైస్కూలులో నాఱు సంవత్సరములకుఁ దక్కువ గాకుండ తెలుఁగు వెలుఁగఁబెట్టిన విద్యార్థి, ఓనమాల బడిలోఁ దెలియవలసిన శ, ష, అ, మొదలగు నక్షరములే వ్రాయలేక పోవుటయు, వర్ణక్రమమునకు సంబంధించిన చిన్న తప్పులు పలుమాఱు పరీక్షా పత్రములలో జేయుటయు, ఎంత లజ్జాకరములగు సంగతులో ఎవరికి వారూహించుకొన వలయును.

ఒకటి మాత్రము నిశ్చయము! మన దేశమున జనులలో విద్యావ్యాపనము బాగుగ జరుగవలె నన్నచో, ముఖ్యముగ ప్రాథమిక పాఠశాలోపాధ్యాయుని విద్యాస్థితి మాఱవలయును. మాతృభాషా పరిజ్ఞానము, దుత్సాహము, మాతృదేశాభిమానము మొదలగు సుగుణబీజములు, ప్రాథమికపాఠశాలలలోని శిష్యుని హృదయమున నాటవలయును.



అట్టి సువిద్యను బోధించుట కర్తగలిగి యుండుటకై ప్రాథమికోపాధ్యాయుఁడు ఆంధ్రసారస్వతమున మంచి పరిజ్ఞానముగాంచి యుండవలయును.

ఒక భాషావిషయముననే కాదు; ఏయే విషయములను బోధింప నున్నాఁడో ఆయావిషయములందు సమగ్రమైన జ్ఞానసంపాదనముఁ జేసి మఱి యుపాధ్యాయుఁడు బోధనాకార్యమునకు దొడంగ వలయును. అట్లుగాక శిష్యునివలెనే గురువును పఠనీయ గ్రంథముమీఁదనే యాధారపడి యుండుట ఉపాధ్యాయుని యాత్మగౌరవ పోషణమున కనుకూలమగునది కాదు. గురువు బోధించునట్టి యేవిషయమునందైన విద్యార్థి కన్నులకు ఉపాధ్యాయుని జ్ఞానసంపద సముద్రమువలె నగాధముగను జగచ్చక్రము పోలె విస్తీర్ణముగను దోఁపవలయును. అప్పుడే శిష్యునికి గురువునందు నిజముగు గురుభావము గుదురును. అప్పుడే ప్రబోధకుని యుల్లమును సంతోషమున నోలలాడఁగలదు.

## బోధనమార్గములం దభివృద్ధి.

ప్రాథమిక బోధకులు బోధనాభ్యాసన పాఠశాలలలో నుండు కాలము సద్వినియోగము చేయుటలేదని నా యభిప్రాయము. తమ కష్టముల కెప్పుడును వగచుటకంటె తమ కర్తవ్యమును జూచుకొనుట శ్రేయోదాయకము. బోధనకార్యము సులభసాధ్యమగునదికాదు. మన దేశమున నుపాధ్యాయుఁడు కూపస్థమండూకమువలె ప్రాఁతపడిన పద్ధతులనే యాశ్రయించి సంకుచిత హృదయుఁడై యున్నాఁడు. శిష్యుల స్వభావము నందలి భేదములు, వివిధ బోధన పద్ధతులు వారివారికిఁ దగినట్లు విద్య యందలి రుచి గలిగించు మార్గములు. ఇట్టి యుపయుక్త విషయములు అతఁడు గ్రహింపవలయును. అనుభవ శాలులగు నచటి తమ గురువులయొద్దనుండి యా విషయములు గ్రహించుచును తద్విషయమై గ్రంథములు పత్రికలును పఠించుచు నుండవలయును. శిల్పకారుఁడెట్లు తన పనిముట్లను పదునుపఱచి చిత్రములను దీర్చుట కెపుడును సంసిద్ధముగ నుండునో, ఉపాధ్యాయుఁడు నటులె వివిధబోధన

రహస్యములను గ్రహించి తనయనుభవమున వానిఁ జొప్పింప నుద్యుక్తుఁడై యుండవలయును. పశ్చిమఖండ వాసులు, శిశుమనశ్శాస్త్రము; శిశుజ్ఞాన బోధనము — మొదలుగాఁగల విషయములం దధికపరిశ్రమము చేసి యద్భుతములగు నూతన సద్విషయముల ననేకములు కనిపెట్టుచున్నారు. వారివలెఁ గ్రొత్తసంగతులఁ గనిపెట్టి నూతనసద్గ్రంథములు రచింప సమర్థత లేకున్నను, వారు రచించిన గ్రంథసాహాయ్యమున నాయాసంగతులు గ్రహించి వలసినవాని నాచరణమునఁ జొనుప నుపాధ్యాయుఁడు సిద్ధముగ నుండవలయును. అట్టి గ్రంథములు సర్వదా చదువుచు తన జ్ఞానానుభవములు పెంపొందఁ జేయుచు నుండవలయును.

3. ఋజువర్తనము.

ఇట్లు ఉపాధ్యాయులు అధిక జ్ఞానానుభవములు గలిగి జ్ఞానసంపాదన విషయమున తమ శిష్యులకు మార్గదర్శకులు గావలయును. జ్ఞాన విషయముననేగాక ఋజువర్తనమున వారు శిష్యులకు తమ ప్రవర్తన మూలమున దారిచూపవలయును. చెప్పెడిమాటలకంటె చేసెడిపనులవలన నీతినధికముగ నుద్ధరింపఁగలము. వయస్సునఁ జిన్నవారలయ్యును ప్రాథమిక పాఠశాలా విద్యార్థులు స్వల్పసంగతులుగుఱుతించువిషయమున నిశితమైన కన్నులుచెవులును గలిగియుందురనుమాట మనము మఱవఁగూడదు. బాల్యమున ననుకరణ శక్తి తీక్ష్ణముగ నుండును. గురువునందుఁ గానవచ్చెడి గుణావగుణములను శిష్యు లనుకరింపఁ జూతురు. కావున ఋజువర్తనమును గుఱించి యుపాధ్యాయుఁ డెంతో జాగరూకతతో నుండవలయును.

తమ్మును బీడించి దారిద్ర్య ప్రభావముచేత ప్రాథమిక పాఠశాలోపాధ్యాయులు మితిలేని కష్టములకును శోధనలకును బాల్పడుచున్నారు. కుగ్రామమునందలి యయ్యవార్లు తమ పాఠశాలలలో లేని పరిస్థితు లున్నట్లును ఉన్నవి లేనట్లును దమకుఁ దెలియఁబఱచి, అందుమూలమున సక్రమముగ ధన లాభము నొందుచున్నట్లు విద్యాశాఖవారు



మొఱలిడుచున్నారు. రాత్రి పాఠశాలలలో నూటికిఁ దొంబదివంతు వట్టి బూటకపు బడులే యని యొకమండల విద్యాసంఘము వారి సభలో సభ్యులేకగ్రీవముగ బలికిరి! ఇది యెంతయుఁ జింతనీయమగు విషయము. అన్నివృత్తులకును నీతినియమములతో దారి చూపవలయు. విద్యాబోధకులె యిట్టి పనులకు దిగుచుండుట యుపాధ్యాయ సంఘమున కంతకును తలవంపులు గలుగఁజేయుచున్నది! ఇటువంటి యకృత్యముల కయ్యవార్లు ఒడబడుచున్నంత కాలమును విద్యావృత్తియందు దేశీయుల కధిక గౌరవ మెట్లు కలుగును?

4. అన్యోన్యకలహములు.

విద్యార్థుల సంఖ్యయు తరగతుల సంఖ్యయు నధికముగఁ గల విద్యాలయములలో నిద్దఱు ముగ్గురు ఉపాధ్యాయులును, అంతకంటె నధికముగను నుండుట తటస్థించును. పాఠశాలకును తక్కిన యుద్యోగస్థానములకును భేదముగలదు. సాధారణమగు నుద్యోగస్థానములందు పై యధికారి యొకరుందురు. తక్కినవారు వారిక్రిందఁ బనిచేయు లేఖికవర్గముగ నుందురు. ఇఁక విద్యాలయబోధకు లందన్ననో, ఒకరికొకరికి నుద్యోగవిషయమున భేదమున్నను, అంతగ నెక్కువ తారతమ్యముండదు. అందఱును గురువులె. బోధన విషయమున నందఱును ముఖ్యులె. లోక వ్యవహార పరిపాలనమునకై వారిలో నొకరగ్రస్థానముననుండ వలసి వచ్చినను, వారికిని తదితరులకును బోధనా కార్యమున మాత్రము సమానాధికార బాధ్యతలుండును. ఇదియే పలుమారు తగవులకుఁ గారణమగుచుండును. “గోవులు గోవులు పోట్లాడి లేగలకాళ్ళు విఱిచినట్టు” ఉపాధ్యాయులలోని పరస్పర విద్వేషము వలన బాలుర విద్యా పరిశ్రమము భగ్నమగుచుండుటయేగాక యీ యంతఃకలహములు, కలహప్రియులగు నన్యులకు అపహాస్యములగును! ప్రధానోపాధ్యాయుఁడు తక్కిన బోధకులను సమానముగఁ జూచుట లేదని వారును, తనకుఁ దగినంత విధేయతను వారగపరచుట లేదని యాతఁడును, ఒకొక్కతఱి వినుచుందుము. అత్త

తానొకప్పుడు కోడలనుట మఱచి పోవునట్లు, కోడలును తనకు అత్తకల దను మాట విస్మరించుట కలదు! ప్రేమ వినయవిధేయతలు సుగుణము లుగాని దుర్గుణములుగావు! విధేయతను జూపింపఁగలవాఁడె పరిపాలనా కార్యమున కర్హుఁడగు చుండును. ఈనాఁడు విద్యార్థి దశలోనుండి, తనపనులు తాను వినయ విధేయతలతోఁ జేయువాఁడే, రేపు, ఉపాధ్యాయ పదవినంది, యందలి పనులను క్రమముగ నిర్వర్తింపఁ గలఁడు. అటులె యుపాధ్యాయుఁడును వినయాది సుగుణములు దాల్చి ఉన్నత పదవుల కర్హుఁడసి ప్రథమోపాధ్యాయుఁడు గావచ్చును. వినయాది గుణములు స్థానభేదములను బట్టి వచ్చెడివేగాని వేఱుకావు. ఏ యుద్యోగమున నున్నను సహచరుల యెడ ప్రేమగౌరవములు, స్వామి కార్య ధురంధరత్వమును, ఆవశ్యకములు. విద్యాబోధన వృత్తియందీ సుగుణము లు మిగుల ముఖ్యములు.

ఒక్కొకతరి ఒక్క పాఠశాలలో నున్న సహబోధకులు పరస్పర మైత్రి లేక వైషమ్యములు గలిగియుందురు. గురువులలో నన్యోన్యము లేని విద్యాశాల సర్వానర్థములకుఁ దావలమగును. సమాన మహాయశములును సమానసన్నిష్ఠా నియమములునుగలిగి ప్రేమపాశముచే నొండొరుల హృదయములు గట్టఁబడిన సత్పురుషులచే జరుపఁబడవలసిన ధర్మసంస్థయె విద్యాలయము. కాని ప్రస్తుతకాలపు పరిస్థితుల ననుసరించి శ్వోద్దేశ పూర్వకముగఁ గాక, అన్యుల యాజ్ఞానుసారముగ భిన్నభిన్నమగు నీతి నియమములు ఆశయములుగల గురువులు, "అడవిలోని యుసిరిక కాయయు, సముద్రమునందలి యుప్పును గలియు విధమున" నేదో యొక పాఠశాలలో సమావేశమగుచున్నారు. దీనికిఁ దోడుగా, వారొకరియెడ నొకరీర్ష్యా ద్వేషాదులు వహించియున్నచో శాంతి నిలయములు గావలసిన విద్యాలయములు పోటరుల బలాబలములు నిర్ణయించు నట్టి మల్లరంగము లగుచున్నవి! జ్ఞానోపదేశకులు తమ యున్నతాదర్శములు మఱచుట వలననె యిట్టి యిక్కట్టులు వాటిల్లుచుండును.



"పోరు నష్టము, పొందులాభము." తామందఱును ఒకధర్మప్రతిష్ఠాపనమునకే పాటుపడవలసిన వారమనియు, వేఱు వేఱు ప్రజాదిశక్తులుగల వ్యక్తులయ్యును, అందఱును ఈశ్వరప్రసాదిత జ్ఞానమును ప్రకటించుట కామహామహాఁ డుపయోగించు నన్ని యుపకరణ విశేషములనియును గుర్తెఱిఁగి ఐహికమను ఈ "మూఁడునాళ్ళ ముచ్చట" యంతరింపఁగనే తమకృత్యములకుఁ దాము త్తర వాదులయ్యెదరని యుపాధ్యాయులు గ్రహింతురుగాక!

## 5. కుబోధకులతోటి సంసర్గము.

"తాఁ జెడిన క్రోఁతి వనమెల్లను జెఱిచి" నట్టుగఁ గొందఱు కుబోధకుల యునికివలన నుపాధ్యాయ కూటమున కంకొకు నొకప్పుడు ముప్పువాటిల్లుచుండును. విద్యాబోధక వృత్తియం దభిరుచియు దాని కధికారము లేని పురుషు లిందొకప్పుడు అవాంతరముగఁ బ్రవేశించుట తటస్థించును. లోకోపకార చింతతోడనే జ్ఞానోపదేశక వృత్తిలో నెవ్వరుగాని చొరవలయును. ధనకాంక్షాకీర్తి కాముత్వా ద్యాశలచేఁ బ్రేరేపింపఁ బడువారి కిది యనువగు వృత్తికాదు. అట్టివారు దీనికంటె నితర వ్యాపారములందు బాగుగ తమ మనోరథ సాఫల్యము నొందఁగలరు. జ్ఞానోపదేశకార్యమె పరమావధిగఁ గలిగి, అందే వర్ణింపరాని యానందము ననుభవించుచు, విద్యార్థుల కష్టసుఖములు తమవిగనే భావించి, విద్యాస్వీకారమున వారి కభిరుచి గలుగఁజేయుచు, వారి ప్రేమ, గౌరవము సానుభూతిని బడయుటకు వలయు శాంతము, శిష్య వాత్సల్యము, పవిత్రచారిత్రముగలిగి యుండువారే విద్యాబోధక వృత్తిని జేకొనవలయును. అట్లుగాక, అధికధన కాంక్షా ప్రేరితులై, విద్యాబోధన పరిశ్రమమునకు వెనుదీయుచు తమననుకరింపనున్న విద్యార్థుల శ్రేయము కొఱకైనను దాము ఋజువర్తనము గాంచియుండక సంచరించువారి కీవృత్తి బొత్తిగ సరిపడదు. అన్యమగు ఆశలతోను, ఆశయములతోను బోధకవృత్తి యందుఁ జొచ్చువారు త్వరితకాలములోనె దీనిపట్ల విరసు

లగుచున్నారు. ఎన్నటికి నెదుగు బొదుగు లేని తమ సాంసారిక స్థితి తమకన్న తక్కువ ప్రజ్ఞావంతు లితర వృత్తులందు స్వల్పకాలములోనె యుచ్ఛదశ నందుట చదువునందు లక్ష్యములేని కొందఱు పిల్లకాయలలో గాలము గడుపవలసివచ్చుట, విరామము లేని కంఠశోషము, విసుగు పుట్టించు పనులనే దినదినమును జేయుచుండుట, కాలుసేతులకు సంకెలలు వేసినట్టుగ విద్యాశాల యను చెఱసాలయందు పగలంతయు గడుపుట—ఇవి యన్నియును సరిపడనివారికి శీఘ్రకాలములోనె బోధకవృత్తియందు విముఖత్వము, వైరాగ్యము గలుగక తప్పదు. ఐనను, అనేక కారణముల వలనను ముఖ్యముగ నుదర పోషణమునకును తమ కనిష్టమును అననుగుణమును నగు నీవృత్తినే యంటి పట్టుకొని గబ్బిలములవలె పలువురు వ్రేలాడుచున్నారు. ఇట్టివారి సహవాసము వలననే యితరులకును శీఘ్రకాలములోనె విద్యాబోధక వృత్తియందసహ్యము గలిగి అందలి ధర్మమును వారు నిర్వహింపకుండుట తటస్థించుచున్నది. లోకములో నొకప్పుడు ఒకరినిజూచి యొకరు సుగుణములకంటె వేగముగ దుర్గుణము లలవఱచుకొందురు. పవిత్రమగు బోధకవృత్తిని గుఱించి హేయమగు నాదర్శములు గలిగి యుండుట, తమవి వ్యర్థపు జీవితములని పలుమాఱు దూషించుకొనుట, తోడివారి యున్నతాదర్శములను నిరసించుట, అసంతృప్తియం దహర్నిశము మునింగి యుండుట, లేని ప్రజ్ఞల మీఁదను, రానికలుముల మీఁదను గన్నులేసియుండుట, మీఁదు మిక్కిలి తమ యనర్థముల కన్నిటికిని శిష్యులె కారకులని భావించి వారలను గాసిపెట్టుట ఇవి యెల్లరకు బోధక లక్షణములు. కాలకర్మదోషమువలన మనదేశమున నిట్టివారి సంఖ్య బోధక సమూహమున నెక్కుడుగ నున్నది. ఇట్టి బోధకాభాసులఁ జూచి మోసపోక ఉపాధ్యాయులు తమ పవిత్రాదర్శములను సదా తమ మనోనేత్రముల యెదుటనుంచుకొని "పాలకొఱకు తాయి మోయునట్టుగ" తమ ఘనకార్య నిర్వహణమునకై కష్టములను బరిగణింపక కృతకృత్యులు గావలయును. సువిద్యాబోధకుల కెల్ల శుభములను ఈశ్వరుఁ డనుగ్రహించు గాక !



# సంఘసంస్కరణము.

## సంఘసంస్కరణముయొక్క ఆవశ్యకత.

ముందుగా, సంఘసంస్కరణమన నేమియో దాని యావశ్యకమేమియో యొకింత యాలోచింతము. లోకములో నన్నిమొదలను మార్పులు గలుగుచున్నవి. అచేతనములగు కొండలు, నదులును, చైతన్యముదాల్చిన వృక్షాదులును, జీవమును చలనమునుగల జంతువులును సదా మార్పునకు లోనగుచున్నపుడు వానికంటె నధికతగాంచిన మనుజునియందు మార్పుగలదని వేఱె చెప్పవలయునా ? వేలువేలు జంతువులవలెనే, జంతుజాతులు గూడ మార్పునొందుచున్నవి. సృష్టిలో నిదివఱ కనేకవిధములగు వికారాకారములుగల జంతువు లుద్భవమై, కొంతకాలము పెఱిగి, నశించిపోయినవి. ఆయా జంతుజాతుల హానివృద్ధులు, వాని వాతావరణమున కనుగుణ్యముగ నవియుండుటనుబట్టి యుండునని పాశ్చాత్య ప్రకృతిశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఒకటి రెండు ఉదాహరణములు గైకొందము. పెద్ద పొట్టయును ఆకారమునుగలిగిన జంతుజాతులు, మొట్టమొదట నీ లోకమునఁ బుట్టినవి. కాని యవి సులభముగఁ దిరిగి యాహారము సంపాదించుటకు వలనుపడనందున శీఘ్రకాలములోనె యంతరించిపోయినవి. పక్షులవంటి కొన్ని చిన్న జంతు జాతులన్ననో సులభముగ నెగిరి యాపత్తునుండి తప్పించుకొని యాహారమును సులభముగ సంపాదించుకొనఁ గలుగుటచేత, వర్ధిల్లుచు వచ్చినవి. స్థితిగతులకును చుట్టునుండు వసతులకును అనుగుణ్యముగ నడచుకొనఁ గలిగిన జంతుజాతులు చాలకాలము వర్ధిల్లుననియు, తదితరములుకొలఁది కాలములోనే నశించుననియు, ప్రకృతిశాస్త్రజ్ఞుల మతము. అనగాఁ దేశకాలాదికము ననుసరించి మెలఁగుచుండుట స్వభావధర్మము ; మనుజులకుఁ గర్తవ్యము. దీనికి భిన్నముగ నడచుకొనుచుండు ప్రజలు, అనర్థ

ములకు లోఁబడుటయేగాక, రానురాను క్షీణించి, మధ్య ఆఫ్రికా, ఆస్ట్రేలియా మొదలగు దేశములలోని కొన్ని ప్రాచీన జాతులవలె క్షీణించి, రూపుమాసిపోవుట సంభవింపవచ్చును.

ఏ దేశమునందలి యాచారములును, కట్టుబాట్లును, ఆయాజనుల విద్యానాగరికతలను సూచించుచుండును. జ్ఞానమునందును నాగరికత యందును నభివృద్ధి నొందుచున్న కొలఁదిని, ఆచారములుఁగూడ నుచ్ఛదశ నొందుచుండవలెను. పూర్వము స్పార్టా, మీడియా, పెర్షియా మొదలగు దేశముల ప్రజలు తమ గురువు లేర్పరచిన మంచి నిబంధనల చొప్పునఁ దాము నడుచుకొనుటతోఁ దనివినొందక, తమ తరువాతి వారునుగూడ, సదా తమ సదాచారముల నవలంబించి లాభమునొంద వలెనను వెఱ్ఱిభ్రమతో తమ యాచారాదికమున వారింకముం దెన్నఁడును మార్పుచేయకుండ ఖచితముగ శాసించిరి. అందువలన నా దేశము లందు తరతరములవఱకును పూర్వాచారములందు మార్పుగాని యభివృద్ధిగాని లేకపోయెను. కావున నా దేశస్థులు నాగరికతయందు వెనుకఁబడుచు వచ్చి, తుదకు పేరులేకుండఁబోయిరి. కాని దూరదృష్టిగల మన పూర్వికులగు నార్యులుమాత్ర మట్లుగాక, కాలానుసారముగఁ దమ యాచారములయందును నడవడులందును మార్పు లేర్పఱచుకొనుచు వచ్చిరి. మన స్మృతులును, ధర్మశాస్త్రములును ఆయా యుగధర్మము లేవియో, వానికిఁదగినట్టుగ జను లెట్లు నడచుకొనుచువచ్చిరో తెలుపుచున్నవి. న్యాయధర్మములను బరిపాలించు హిందూరాజుల ప్రభుత్వకాలమున కాలానుగుణ్యముగ నాచార సంస్కరణము గలుగుచు వచ్చెడిది. ఋషులు మొదలుగాఁగల జ్ఞానసంపన్నులు, ప్రభువులకీ విషయమున కర్తవ్యాంశములు దెలుపుచు, స్థితిగతులకుఁ దగిన మార్పులు గలుగఁజేయుచునచ్చిరి. కాని యిటీవల రెండువేల సం॥రములనుండియు, హిందూరాజకుటుంబములు నాశనమై భరతఖండ మన్యదేశపు రాజుల పరిపాలనమం దుండుటచేత, పరదేశపురాజులు హిందూదేశీయుల యాచారములతో



నంతగ జోక్యము గలుగఁజేసికొనరైరి. అందుచేత నిటీవ నాచార సంస్కరణవిషయమై, హిందువులు కాపరిలేని గొఱ్ఱెలవలె నసహాయులై అంధప్రాయముగఁ బూర్వాచారములె యనుష్ఠించుట తమ ముఖ్య కర్తవ్యమని తలంపసాగిరి.

## నవీనసంఘసంస్కరణ కర్తలు.

తక్కిన కారణములమాట యటుండనిచ్చి, కాలానుసారముగఁ దమ యాచారములలో మార్పులు చేసికొనక పోవుటచేతనే, పూర్వకాలమున సకలవిద్యలయందును నాగరికమునందును ప్రసిద్ధికెక్కిన హిందువులు, రెండువేల సంవత్సరములనుండియు విద్యానాగరికతలయందంతగ వృద్ధినొందకుండిరి. జనులు రాజకీయ విషయముల యందు పరదేశముల కొదిగియుండినట్లె, విద్యాధికులు ఆచారవిషయములందు పామరజనుల కనుసన్నలనె మెలంగవలసినవారై యుండిరి. దైవానుగ్రహమువలన నిప్పుడు ఆంగ్లేయ పరిపాలనాభాగ్యముగలిగినప్పటినుండియు, హిందువులు పాశ్చాత్యవిద్యాస్వీకారమువలన దీర్ఘనిద్రనుండి మేల్కని తమ స్థితిగతుల విమర్శింపఁగలుగుచున్నారు. మొదట మన దేశమున నాంగ్లేయవిద్య బంగాళారాజ్యమున నారంభమయ్యెను. ముఖ్యముగ దాని ప్రభావమువలననే అచట ప్రస్తుతకాలపు హిందూసంఘసంస్కరణ కర్తలలో ప్రథముఁడగు శ్రీరాజా రామమోహనరాయలు జన్మించుటకుఁ గారణ మయ్యెను. పూర్వకాలమున నెంతయు వన్నెఁగాంచిన హిందువులు మూఢాచారపరాయణులై హీనస్థితియందుండుటఁ గనుగొని, వారి సాంఘిక దాస్యమునకు హేతువులగు సహగమనము, శిశువధ మొదలగు దురాచారములను శాస్త్రప్రమాణములుచూపి ఖండించి, ఆ మహామహుఁడు దొరతనము వారిసాహాయ్యమువలన వీనిని సంస్కరించెను. అచటనే యిటీవల జన్మించిన కేశవ చంద్ర సేనులు, ఈశ్వర చంద్ర విద్యాసాగరులు మున్నగు ప్రముఖులు, వివిధజాతులవారు వివాహ సంబంధములు చేసికొనుట, వితంతు వనితా పునర్వివాహములు నెలకొల్పుట, మొదలగు సంస్కరణ

ములు గావించిరి. పిమ్మట బొంబాయి రాజధానీ వాస్తవ్యులును ఉన్న న్యాయసభాధికారులును, అగు శ్రీ॥ రా॥ బ॥ మహాదేవ గోవింద రా గారు, బాగుగ నాలోచించి, రాజకీయవిషయములను గుఱించి ప్రజ త్రమకుఁగల యూహా లేశేట ప్రచురించుటకై దేశీయ మహాసభ లే ఱచినట్లే, సంఘసంస్కరణ విషయమై కూడ జనులు తమ యిక్కట్టుల గుఱించియు, వానినుండి విముక్తులగుటకు మార్గములను గుఱించి మాటాడుకొనుటకై, దేశీయ సంఘసంస్కరణ సభ నేర్పరచిరి. అం ముందే, వితంతూద్వాహములనుఁ గుఱించి బొంబాయి రాజ్యమ విష్ణుశాస్త్రిగారును, చెన్నపురి రాజధానిలో శ్రీ॥ రా॥ బ॥ కం. వీ లింగము పంతులువారును కృషిఁజేయసాగిరి. ఇట్టి నవనాగరికులు చేయఁ బూనిన సంస్కారములు పూర్వకాలమున మన ఋషులు చేయుచు వచ్చిన సంస్కరణములవంటివే గాని, వేఱుగావు. అదిగాక దేశమున నధర్మ మెప్పుడు ప్రబలి, జనులను బాధింప మొదలిడునో, అప్పుడెల్లను భగవంతుఁడు తానె యుద్భవించి పుడమిలోనివారి నుద్ధరింతునని భగవద్గీతలో “ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే” యని చెప్పియున్నాఁడు. కావున రామ మోహన రాయలు, విద్యాసాగరులు, రానడే, వీరేశలింగము పంతులు మున్నగు నవీనకాలపు హిందూ దేశసంఘసంస్కర్తలు విధించిన సంస్కారములు, హిందూ దేశపు హీనస్థితిని పరికించి భగవంతుఁడు మనలనుద్ధరించుటకుఁ గావించిన మహా కార్యములనియె మనము గమనించి వానియందాదరభావముగలిగి, వాని చొప్పున నడువఁబ్రయత్నింపవలయును. పూర్వకాలపు హిందూప్రభువులు ఋషుల యనుమతి చొప్పున నాచారసంస్కరణ మొనర్చుచుండినట్లె, అన్యమతావలంబులైనను, న్యాయపరిపాలనా దక్షతగల యాంగ్లేయ దొరతనమువారును పూర్వోక్త నవీన హిందూ సంఘసంస్కరణ కర్తల యాలోచన చొప్పున చట్టములందుఁ గొన్ని మార్పులు గలుగఁజేసి సంస్కరణ కార్యమునందు వారికి సహాయము నొసంగిరి. కావున ప్రజల



మగు మనము నట్టి సంస్కరణ కర్తల సదాలోచనల చొప్పున నడచుకొని, దేశక్షేమమును గలిగించుకొనవలెను.

### సంఘసంస్కరణము గుఱించి కొన్ని విపరీతాభిప్రాయములు.

ఈసందర్భమున సంఘసంస్కరణమును గుఱించి మన దేశీయులకుఁ గల కొన్ని విపరీతాభిప్రాయములను విమర్శింతము. పూర్వాచారపరాయణుల కెప్పుడును, నూతన విషయములు అనిష్టముగఁ గన్పట్టును. కావున వానియందలి సత్యాసత్యములను గ్రహింపక వారు సంస్కరణ పక్షమునకు దొడఁగెదరు. సంఘసంస్కరణమనఁగా జుట్టును బొట్టును, లేకుండుట యనియును అనాచారవంతులగుట యనియు, మనవారు కొందఱు భ్రమించుచున్నారు! సంఘసంస్కారులు నాస్తికులును క్రైస్తవులు ననియు, వారెప్పుడును ప్రాచీన సదాచారములను బరిహాసించుచుందురనియును కొందఱు దలంచుచున్నారు! ఇవి యన్నియు వట్టి దురభిప్రాయములు. ఇట్టి యభిప్రాయములు సంఘసంస్కరణాభిమానులను గుఱించి మన వారికిఁ గలుగుటకుఁగల వివిధకారణముల నేనిచటఁ బ్రస్తావింపఁబూనలేదు. ఇవి యన్నియు, పరులకును శత్రువులకును మనము స్వాభావికముగఁ జేయునిర్హేతుకమగు దోషారోపణమువంటివని చెప్పవచ్చును. ఒక్కొకప్పుడు సంఘసంస్కరణాభిమానులమని చెప్పుకొను వారిలోఁ గొందఱివర్తనమందు పయి లోపములుండుట వలన, వారి లోపములు సంస్కరణ పక్షముననే యారోపింపఁబడ వచ్చును. సంస్కరణాభిమానులమని పేరు పెట్టుకొనిన క్షుద్రమనుజులు కొందఱు తమ నీచ ప్రవర్తనచే సంస్కరణపక్షమున కపకీర్తి సంపాదించి యుండ వచ్చును. ఏది యెటులుండినను, సంఘసంస్కరణము యొక్క యుద్దేశము దేశములో దురాచారములు ప్రతిష్ఠింపవలెనని కాదు. నేను కృష్ణా గుంటూరు మండల సంఘ సంస్కరణసభవారి యెదుట స్వాగతోపన్యాసమునందుఁ జెప్పినట్లుగ, దురాచారమును దొలఁగించి, సదాచారములను నెలకొల్పఁబూనుటయె సంస్కరణాభిమా

నుల యుద్యమముగాని కొందఱు తలంచునట్లు, భారతమాతకు తలవంపులు గలిగింపవలెననియు, అనగత్యములగు విదేశాచారములను దేశములో బ్రతిష్ఠించి జనసాంకర్యముఁ జేయవలెననియుగాదు."

### సంఘసంస్కరణమన నేమి ?

ఇంక సంఘసంస్కరణ మననేమియో, దానిని సంగ్రహముగ వివరింపవలయును. నిష్పాక్షికబుద్ధితో నాలోచించు దేశాభిమానులందఱును హిందూమహాసంఘమునుండి కొన్ని దురాచారములు తొలంగిపోయినగాని సంఘమభివృద్ధి కాఁజాలదని నమ్మియున్నారు. ప్రాచీనకాలమునందు మహోన్నతదశనొందిన రోమనువారును, గ్రీకుదేశీయులును, ఈజిప్టుజనులును, తమ సంఘములో నానాట బ్రవేశించిన కొన్ని దుర్నియమములను సాంకర్యములను దొలఁగింపకుండుటచేత రానురాను తమ వన్నెయు వాసియుఁ గోలుపోయి మూలముట్టుగ నశించిపోయిరి. పూర్వకాలమున బ్రసిద్ధినొందిన హిందూజనుల సంగతియు నిట్లేయయిపోవలసినది. మనసంఘములో గడచిన రెండువేల సంవత్సరములనుండియుఁ బ్రవేశించిన దురాచారముల సంగతియు, మనమన్య దేశప్రభువులకొదిగియుండి యసహాయస్థితిలో నుండుటయు గుర్తెఱిఁగినవారు, హిందూమహాజనసంఘ మిదివఱకే యేలశిథిలమయి పోయినది కాదనియచ్చెరువొందుచున్నారు. కాని యిట్టి ఘోరవిపత్తునుండి మన దేశము తప్పించుకొనుటకుఁ గలకారణముల నన్నింటి నిచటఁ బేర్కొనక, వానిలో ముఖ్యముగా నొకటిమాత్ర ముదహరించుచున్నాను. ఎన్ని విపత్తులు వచ్చినను ఎట్టిహీనస్థితి సంప్రాప్తించినను, హిందూదేశము భగవంతుని మఱచినది కాదు. తన్ను మఱువనివాని నెన్నఁడును దామఱువనని దేవుఁడు భక్తులకభయహస్త మిచ్చియున్నాఁడు! హిందువులు, తమ మతవిశ్వాసములను మఱచిపోక దైవమును వీడకయుండిరి. కావుననే ఎట్టి కష్టములలోను వారి సంఘము తుత్తునియలై పోక నిలిచినది. హిందూమతమె హిందూమహాజనులనేకముగ సంఘటింపఁజేసిన ముఖ్యసూత్రము. పుటము పెట్టిన



కొలఁదిని బంగారము వన్నె హెచ్చురీతిని యమూల్యమగు నీమతము రానురాను జనుల తర్కపరిశోధనముల వలనను, అన్యమత సంపర్కముల వలనను కాంతి తగ్గుటకు మాఱుగా మఱింత నిర్మలముగను తేజోవంతముగను నయ్యెను. కొమ్మలు కెల్లను చెట్టుమొదలె యాధారమగునట్టుగ, హిందూమత ధర్మమూలమె శైవ వైష్ణవ స్మార్తాది మతశాఖల కాధార మయ్యెను. అందుచేత, మతాభిప్రాయములు కొంతవఱకు భేదించినను, హిందూ సంఘము మాత్ర మొకటియయి వర్ధిల్లెను. ప్రస్తుత కాలమందును, హిందూమత హిందూ సంఘములు క్రైస్తవాది యితరమతముల యొక్కయు, మత సంఘములవారి యొక్కయు, వాఁడితూపులకుఁ గాచికొనవలసి యున్నవి. కాలానుగుణ్యమగు మార్పులు సంఘమునఁజేసికొనఁ జాలినట్టి చతురత హిందూమత సంఘమునకు లేనిచో, ఇట్టిమార్పుల కొఱకైనను జనులు కొందఱు అన్యమతావలంబనముఁ జేయుదురు. అందుచేత హిందూమహాసంఘమునకు బలముతగ్గును. పూర్వకాలమున బౌద్ధులును జైనులును హిందూసంఘమును విడిచిపోయి, మాతృసంఘమును దుర్బలపఱచిరి. మధ్యకాలమునందును నిట్లే సిక్కులు హిందూజనులనుండి చీలిపోయి ప్రత్యేకసంఘముగ నేర్పడిరి. ఇటీవల కాలమునందును హిందూసంఘముయొక్క యైకమత్యమున కిట్టి వ్యాఘాతములు వాటిల్లినవి. దీనికి ఆర్యసమాజ బ్రాహ్మసమాజ స్థాపనములే నిదర్శనములు. ప్రస్తుతమున హిందువులు మాలమాదిగలను హేయముగఁ జూచుటవలన, వారితర మతసంఘములలోఁ గలిసిపోవుచున్నారు. అన్య దేశపు క్రైస్తవమత సంఘమువారు, తమ మత స్వీకారముఁ జేసినచో, పంచములకు సాంఘికాభివృద్ధివిషయమై యింకఁ బంచత్వము గలుగదని బోధించి, వారిలోఁ గొందఱినిగలుపుకొనుచున్నారు. వేలకొలఁదిసంవత్సరములనుండి హిందూమహాసంఘమువారు తమ యోగక్షేమము లరయక నిరసనభావముతోనుండిరి గావున, ఇంక వారియండ విడిచిపెట్టి తమలోఁ గలియుఁడని మహమ్మదీయులుకూడఁ బంచముల నిపుడు ప్రేరేపించుచున్నారు !

కావున సంఘసంస్కరణ కర్తలిపుడు మన దేశమునఁ జేయవలసిన ముఖ్యప్రయత్న మేమనఁగావారు మతవిషయముల జోలికిని సదాచారముల జోలికిని బోక, ఏయేసాంఘికాచారముల మూలమున సంఘముయొక్క యైక్యము, బలము, అభివృద్ధి, నయసంపదయును భంగము నొందినవో, ఏయాచారముల వలన జనులు నాగరికతగల యితర దేశీయులకంటె వెనుకఁబడి యున్నారో, ఏపద్ధతు లవలంబించుట వలన సాంఘికులకు మితిలేని కష్టనష్టములు గలుగుచున్నవో, అట్టి యాచారములు పద్ధతులును ఉచితమగు రీతిని సంస్కరింప వలయును. ఉన్న యాచారములనుసంస్కరింప వలయుననియె, అనఁగా, బాగుచేయ వలయుననియె, వీరి యుద్దేశముగాని పాడుచేయుట కాదు ! ఇంకను వీరుతలంచిన సంస్కరణకార్యము, ఉచితమగు రీతిని, అనఁగా సాధ్యమగునంతవఱకు శాస్త్రానుసారముగను, మెల్లఁగను, జనానుమోదముగను జేయవలయుననియె వీరితలంపు. వీరియుద్యమము హిందువులను మతభ్రష్టలనుగ జేయవలయుననికాదు. పూర్వమునుండియు దేశీయులనీతిని గాపాడిన మతము మఱింత యభివృద్ధి నొందునటుల, హిందూసంఘమున నవాంతరముగఁ బ్రవేశించిన నాగరికుల పద్ధతులను దురాచారములను శారదోలవలయును. ఇటీవలి కాలమునందుఁగాక, పూర్వమున, విద్యా నాగరికతలు మొదలగు సకలైశ్వర్యములతో దేశము తులతూగుచున్నపుడు ప్రబలియుండిన ప్రాచీనసదాచారములనువానినిబోలిన మరికొన్ని మంచి యాచారములను దేశమున నెలకొల్పవలెననియె సంఘసంస్కరణకర్తల కోరిక. ఇట్టి మంచి దశయొకసారిగ రాఁజాలదు. కావున, మన యాచారములందు క్రమక్రమముగ మంచిమార్పులు గలిగించుకొనుచు నానాట సంఘమును మంచిదశకుఁ గొనిరావలెనని సంస్కరణాభిమానుల ముఖ్యోద్దేశము. మనకుఁ గావలసిన ముఖ్య సంఘసంస్కరణములను గుఱించి సంగ్రహముగ నిక దెల్పెదను.

విద్యావిషయిక సంస్కరణము.

మన దేశమున కిపుడు కావలసిన సంస్కరణములు ముఖ్యముగ రెండువిధములయినవి. మొదటివి విద్యావిషయిక మయినవి. రెండవవి



వివాహమును గుఱించినవి. వివాహమునకు ముందుగ విద్య గావలయును. కావున విద్యనుగుఱించి ముందు ప్రస్తావించెదను. పూర్వకాలమందు విద్యలకెల్ల జన్మభూమియై జ్ఞానతేజముచే నలరారెడి హిందూదేశమిపుడు అవిద్యా తిమిరముచేఁ గప్పఁబడియున్నది. ఆంగ్లేయదొరతనము మనకు లభించినపిమ్మట విద్యావిషయిక మగు కొఱంత కొంత తొలంగినను, ఇంక నెంతయో చేయవలసియున్నది. మనుజునికి విద్యయే భూషణము. విద్యలేని జనులు మృగసమానులు. అట్టివారి గొప్పితనమును, సంతోషమును, చతుష్పాదజంతువు లనుభవించువానికంటె నెక్కువయగునవి కావు. కాఁబట్టి నాగరికత మొదలగు వానియందు హిందూదేశమభివృద్ధి నొందఁగోరితిమేని, మన దేశీయులు బాగుగ విద్యగఱచునట్టి యుపాయమారయవలెను. మనలోఁ బలువురు మనకు రాజకీయపు విషయములయం దెక్కువ యధికారములు గలుగవలయునని కోరుచున్నారు. కాని మన దేశీయు లిప్పటికంటె నెక్కువగ విద్యాస్వీకారముఁ జేసి, గౌరవార్హతను సంపాదించినఁగాని, ప్రభుత్వమువారు మనకట్టి యధికారము లిచ్చునంతటి వెఱ్ఱివారుకారు. జనులు విద్యనేర్చి యుక్తాయుక్తములు గ్రహింపఁ గలుగునపుడె, సంఘసంస్కరణము నందభిలాష గలిగి, వారు సంస్కర్తలకుఁ దోడుపడి పనిచేయుట సంభవించును. కాని యిప్పటివలెనే దేశమున నూటికిఁ దొంబదిమంది యక్షరజ్ఞానము లేకయుండినచో, సంఘ సంస్కరణాభిమానులెంత పనిచేసినను, జనసామాన్యమునకు సంస్కరణము యొక్క యావశ్యకమును దాని లాభమును బోధపడవు. వారు సంస్కరణకు సహాయభూతులు గానేరరు.

పిల్లవాండ్ర విద్య.

భోజరాజు కాలమున పట్టణమున నందఱును పండితులును కవులునే యైనట్లు, అమెరికా యూరోపు మొదలగు పశ్చిమ దేశములలో జనులు సాధారణముగ నందఱును విద్యనేర్చియున్నవారు. కావుననే యా దేశములు నాగరికతచే విలసిల్లుచున్నవి. అచ్చట నందఱు బాలకులు

బాలికలును కొన్ని యేండ్లవఱకు నేదోయొక పాఠశాలలో విద్యాభ్యాసము జేయవలయునను ప్రభుచట్టము గలదు. కావుననే ప్రజలలో ముప్పాతిక మువ్వీసము మంది చదువను వ్రాయను శక్తిగలిగి యున్నారు. అందుచేత నెట్టి హీనవృత్తిలో నున్నవారును, సులభశైలిని వ్రాసిన పుస్తకములును వార్తాపత్రికలును జదివి, లోకజ్ఞానము సంపాదించుకొనుచున్నారు. ఇట్టిచట్టమును మన దేశమునందును జేయింపుఁడనియును, సామాన్యముగస్వల్పవిద్య నుచితముగనే యందఱు పిల్లలకును జెప్పింపుఁడనియును, గౌరవనీయులగు శ్రీ గోక్లేగారు సార్వభౌమిక శాసననిర్మాణసభలో విజ్ఞాపనముఁ జేసిరి. దొరతనమువారు మనకీ గొప్ప లాభమును గలుగఁజేసి, శాశ్వతమగు కీర్తిని బడయుదురు గాక! కాని మిక్కిలి లాభకరమైనను, అధిక ధనవ్యయమును గోరు నీకార్యము నింత త్వరలో కొనసాగింప నుద్యమింతురని తోఁపదు. ఐనను ఈలోపల మనమీ విషయమున నెంతో కృషిజేయ నాలోచింపవచ్చును. ఏగ్రామములోని వారాగ్రామము నందలి పిల్లలకు స్వల్పవిద్యను జెప్పింపఁ బ్రయత్నింపవలయును. దీనికి ధనముగావలయును. ఏటేటగ్రామపుమొత్తమున నుద్యోగస్థులలోఁ గొందఱికి లంచములు మామూళ్ళను సమర్పించుటకై వందలకొలఁది రూపాయలు పోగుజేయఁబడుచున్నవి. వీని సంగతి దొరతనము వారికి ఋజువు మూలమున దెలిపిన యెడల అట్టి సొమ్మిచ్చినవారికిని, బుచ్చుకొన్న వారికిని దండన విధింపఁబడును. అన్యాయపక్షమున సొమ్ము గూర్చుటకంటె ఇట్టి యన్యాయముల నన్నిఁటిని మొదలంట తొలఁగింపఁజాలిన విద్యను తమ గ్రామమునందు తమపిల్లలకే చెప్పించుటకై ధనము పోగుచేయవలెననినచో, మన దేశీయులెంతో సంతోషముతోఁబనిచేయుదురు. ముందెప్పుడో ప్రభుచట్టమువచ్చి, అందఱు పిల్లలకును విద్యాలాభము గలుగఁజేయుననియువ్విళ్ళూరుచుండుట కంటె, ఇట్టి మంచిదశను ప్రస్తుతముననె సమకూర్చుటకు మన మేల ప్రయత్నింపఁగూడదు? ఇట్లు కొన్నిప్రదేశములందు జనులు ప్రయత్నించెదరేని,



వీనినిజూచి దొరతనమువారును తమ సాహాయ్యమును వెంటనే చేయఁబూనెదరు.

## బాలికావిద్య.

బాలురకువలెనే బాలికలకును విద్య యావశ్యకము. విద్యావంతుండగు భర్తకుఁ దగిన సహధర్మచారిణి యనిపించుకొనుటకును, కుటుంబకార్యములు యుక్తముగ నెరవేర్చుటకును, పతిపూనిన సత్కార్యములం దతనికిఁ జేయూతయై నిలచుటకును, స్త్రీ విద్యావతి కావలెను. కావున చిన్ననాఁడే, మన బాలికలకు విద్యాభ్యాసముఁ జేయించి వారి విద్యకు పోషణము గలిగించుచుండవలెను. మన దేశమున నిదివఱకు మగపిల్లవాండ్రకు వివాహ మెట్లగునా యని తలిదండ్రులు పరితపించుచు వచ్చిరి. పుస్తెయో పూసయో యమ్మివైచి, వారికి విద్య చెప్పించిన యెడల, ఇఁక వారి వివాహభారము తమమీఁద నుండదని యిప్పటివారు గ్రహించియున్నారు. ఇప్పుడు మన దేశీయులు తమ కూతుండ్ర పెండ్లిండ్లను గుఱించి తహతహపడుచున్నారు. ఆఁడుపిల్లలకును మంచి విద్య చెప్పించిన యెడల, వారికిఁదగిన వరులు దొరుకుదురు కావున, పరిణయ విషయమై యంతఁగఁ దలిదండ్రులకుఁ గష్టము గలుగదు. కావున బాలకులవిద్యను గుఱించి వలెనే బాలికావిద్య విషయమైకూడ మనము తగిన శ్రద్ధ వహించవలెను. బాలురకువలెనే యందఱు బాలికలకును స్వల్పవిద్య నేర్పింపవలయును. మంచి స్థితిగలవారు బాలికలకున్నత విద్యఁ జెప్పింపవలయును. సామాన్యముగఁ బ్రతిపట్టణమునందు నట్టి విద్యను దొరతనమువారు ఉచితముగనే బాలికలకుఁ జెప్పింప సిద్ధముగ నున్నారు. ఇంకను బైతరగతులలోఁ జదువఁ గోరికఁగల బాలులకు విద్యార్థినీవేతనము లిచ్చుచున్నారు. ఎక్కువమంది వయస్సు వచ్చిన విద్యార్థినులుండు తావులందు స్త్రీలనే గురువులుగ నియమింపుఁడని దొరతనమువారిని మనము వేడవచ్చును.

## వితంతు విద్యాలయములు.

ఈ స్త్రీవిద్యాసందర్భమున, వితంతు స్త్రీలవిద్యను గుఱించికూడఁ గొంతఁ జెప్పవలయును. బాలవితంతువుల దుస్థితిని దొలఁగించుటకై, వారికిఁ బునర్వివాహ విషయమై వసతి గలిగించుట మనకుముఖ్యకర్తవ్యము. దీనిని గుఱించి ముందు ప్రస్తావించెదను. అందఱు జనులును పునర్వివాహములకు సమ్మతింపనట్టే, అందఱు బాల వితంతువులును బునర్వివాహ మాడుట కొడంబడరు, తిరిగియుండరు. బాల్యవివాహాచారానర్థము వలన వైధవ్యదశ నొందిన బాలికలకు, బాల్యదశనె వెంటనే పునర్వివాహము జేయుట కూడఁ ననర్థదాయకమె. మొదటి వివాహము జెరపుటకుండిన కొందర రెండవ వివాహమును గుఱించి యుండనవసరము లేదు. మన దేశములోని బాలవితంతువుల దుస్థితిని సవిస్తరముగ దొలఁగింపవలెనన్నచో, వారికి సువిద్యాలాభము గలుగఁజేయవలయును. 10, 12 సంవత్సరముల్లు వయస్సుగల కన్యల కున్నత విద్యనిచ్చుటకు వలనుపడదు. తొందరగనే వారు విద్యను మానివేయవలసివచ్చుచున్నది. ఇంక బాలవితంతువులన్ననో, ఎంతకాలమైనను వారు విద్యావిషయమై కృషిచేయ వచ్చును. కావున వారుపెద్దపరీక్షలకుఁ జదివి కృతార్థతఁజెంది స్వతంత్రజీవనముఁ జేయ సమర్థతను బడయవచ్చును. ఇప్పుడు బాలికా పాఠశాలలలో నుపాధ్యాయినులగుటకుఁ జదువువచ్చిన హిందూ స్త్రీలుగాని, మఱియే స్త్రీలుగాని లేకపోవుటచేత దొరతనము వారు పురుషులనే గురువులుగ నియమించుచున్నారు. విద్యావతులగు వితంతువులే యున్నచో, వారు బాలికా పాఠశాలలలో నొజ్జలై బాలికలకు విద్యాబోధనముఁ జేయుటకుఁ దగియుందురు. విద్య నేర్చిన వితంతు స్త్రీలు విద్యావిషయమై యుపన్యాసము లిచ్చుచు స్త్రీవిద్యావ్యాపనము గుఱించి మంచిపనిఁ జేయుచు తమ జన్మమును సార్థకపఱచుకొనఁగలరు. ఇంక సాంసారిక సుఖముల ననుభవింపవలెనని తలంచు వితంతువులు, విద్యానంతరమున విధ్యుక్తముగఁ బునర్వివాహము చేసికొన



వచ్చును. ఇప్పటివలె బాలవితంతువు జీవనోపాధి సంపాదించుకొనలేని యేపురుషునో, తొందరగఁ బరిణయమాడుటకు మాఱుగ, తాను విద్య నేర్చియుండుటచేత విద్యావంతుడై మంచిస్థితిలో నుండువానినే వివాహ మాడఁగలదు. కాఁబట్టి బాల వితంతువులవిద్య విషయమై కొంతకాలము క్రిందట బంగాళా రాజధానిలో బాబూశశిపాద బెనర్జీగారును, బొంబాయిరాజధానిలో పండితరామాభాయిగారును కార్వేపండితులును గృషి జేసియున్నారు. వీరు వితంతు శరణాలయములు స్థాపించి, అందు నిరుపేదలగు బాలవితంతువులకు భోజనవసతి నేర్పఱచివారికిఁ జదువు చెప్పించియున్నారు. ఇట్లే మన చెన్నరాజ్యమందును, ముఖ్యముగ తెలుఁగు జిల్లాలలోను, నేదైన యొకతావునందు హిందూ వితంతు శరణాలయము స్థాపించుట ముఖ్యము. ఈవిషయమై గుంటూరులో జరిగిన మండల సంఘ సంస్కరణ సభలో నిర్ధారణ చేయఁబడెను. ఇప్పుడు మనము దానిని బలపఱచి, అటువంటివసతి యేర్పడు విషయమునఁ బనిఁజేయవలయును.

## వయసు వచ్చినవారి విద్య.

విద్య యెల్లవారికిని లాభకారి. విద్య నేర్చిన వారు సామాన్యముగ విద్యాగంధ మెఱుఁగని వారికంటె నెన్నో మడుఁగులు సంసారధర్మములు నిర్వహించుటయందు నేర్పరితనమును జూపెదరు. విద్యాప్రభావమువలన మనకుఁ బ్రాప్తించిన కష్టములు తగ్గిపోయి, సుఖములు ద్విగుణమగును. బాల్యముననె విద్యాభ్యాసముఁ జేసియుండుట సుకృతమైయైనను, ఎంతవయస్సు వచ్చినవారైనను, విద్యాభ్యాసముఁ జేయ వెఱువనక్కఱలేదు. చిన్నతనమున నాఱునెలలలో వచ్చెడివిద్యను, ఈడు వచ్చిన వారొకనెలలోనె సంపాదింపఁగలరు. ఎంత ముదురు వయసుగలవాడైనను, మంచి పరిశ్రమ జేసినయెడల, నొకసంవత్సరములోనే దేశభాషలోఁ జదువను వ్రాయను నేరువవచ్చును. మన దేశము నాగరకత గాంచవలెనని కోరితిమేని, దేశాభిమానులు గ్రామ గ్రామమునను రాత్రి పాఠశాలలు స్థాపించి, అందు వయస్సువచ్చిన పనివాండ్రు

సేద్యగాండ్రు మొదలగువారి కుచితముగ విద్యాదానముఁ జేయవలయును. జన సామాన్యమున కిట్లు విద్యయం దభిరుచియును, కొంత ప్రవేశమును గలిగించుటయె యుత్తమ సంఘసంస్కరణమని నా నిశ్చితాభిప్రాయము. ప్రస్తుతమున మన దేశపు హీనస్థితికి ముఖ్యకారణము జనుల నావరించెడి యజ్ఞానతిమిరమె. కాని, ప్రజలు చదువను వ్రాయను నేర్చియున్నయెడల, వారు పుస్తకములును వార్తాపత్రికలును జదివి, విద్యాసంపన్నులగు వా రెంతయో పరిశ్రమచేసి సంపాదించిన జ్ఞానసారమును సులభముగ గ్రహించి లాభము నొందెదరు. దేశములో జరుగుచుండెడి సంగతులు వారపుడు బాగుగ గ్రహించి, తమ సాంసారిక, సాంఘికధర్మములు చక్కఁగ గుర్తెఱిఁగి, నెరవేర్చెదరు. రాజకీయ విషయములందును సాంఘికాచార విషయములందును నేదైన యొక మార్పుజేయింపుఁడని విద్యాధికులు దొరతనము వారిని గోరినపుడు "మీ దేశపు ప్రజలందఱును దీనిని గోరితి రేని యట్లు చేయఁజూతుమ"ని వారు ప్రత్యుత్తర మిచ్చుచున్నారు. "ఓనమాలు" రాని జనసమూహమునకు, దేశాభివృద్ధికరములగు గొప్ప మార్పుల విషయమై యభిప్రాయములు గలుగుటయు, వానిని దొరతనమువారికిఁ దెల్పుటయు నెట్లుసంభవించును! జనులలో నజ్ఞాన మెంతకాలము ప్రబలియుండునో, అంత కాలమును సాంఘిక రాజకీయ విషయములందు మంచి మార్పులుగలుగుట యసంభవము. కావున జనసామాన్యములో విద్యావ్యాపనమును గుఱించి మనము మంచి ప్రయత్నముఁ జేయవలయును.

వయసువచ్చిన పురుషులకువలెనే, కాపురముఁ జేయుస్త్రీలలోను మనము విద్యను వ్యాపింపజేయవలెను. మంచియేర్పాటు చేసినచో, తీరిక సమయమందు ప్రతిదినమున మన దేశపుస్త్రీలు సులభముగఁ జదువ నేర్చెదరు. పర దేశపు క్రైస్తవ కాంతలు, జనానాతరగతులు స్థాపించి హిందూస్త్రీల కనేక ప్రదేశములందు ఉచితముగ విద్య నేర్పుచున్నారు. అన్యదేశీయులగు వీరికి హిందూస్త్రీలయెడలఁగల దయలో స్వదేశీయుల



మగు మనకొక వీసమైన నున్నచో, సోదరీమణులగు హిందూస్త్రీలలో శీఘ్రమె విద్య బాగుగ వ్యాపించునుగదా !

ఈ సందర్భముననె మన దేశములోని యధమజాతులలోని వారగు మాలమాదిగ జాతులలోని వారి విద్యను గుఱించికూడఁ జెప్పవలసియున్నది. ఈజాతులవారిని మనము క్షుద్రజంతువులకంటెను నధములుగఁ జూచుచున్నాము. మొట్టమొదట నార్యసంతతి వారైనను కాకపోయినను, వారు వేలకొలఁది సంవత్సరములనుండి హిందూదేశమునందలి యార్యుల కొదిగి పనులు చేయుచున్నారు. హిందువుల భాషనే మాటాడుచు, వారి మతమునే నమ్మియున్నారు. ఐనను, హిందువులు వారి నుద్ధరింపకుండుట వలన, వారు వెనుకటి యనాగరికపు స్థితియందే యున్నారు. వారిదుస్థితి కగ్రజాతులవారు తప్పక యుత్తరవాదులు. నేనిది వఱకుఁ జెప్పినట్టుగ, క్రైస్తవాది యన్యమతస్థులు వీరిని దమ మతములోఁ గలుపుకొని, వీరికి గౌరవస్థానము నొసంగుచున్నారు. ఈతరుణమున హిందువులమగు మనమును పంచమజాతీయుల యుద్ధారణమునకై శాయశక్తుల ప్రయత్నింపవలయును. మనకువలెనే వారికిని, అన్ని సంస్కరణములకంటెను ముందుగ విద్యాసంస్కరణమె కావలయును. సర్వసముఁడగు భగవంతుఁడు వారికిని దెలివితేటలిచ్చియున్నాఁడు. బంగారమునకు వెలిగారముతోడైనట్లు, స్వాభావికముగ వారికిఁగల బుద్ధికుశలత మన మొసంగెడి విద్యవలన మఱింత ప్రకాశమునంది, వారికిని దేశమునకును జయప్రదమగును.

## దేహపరిశ్రమవిద్య.

మన దేశీయులు, తమపిల్లవాండ్రుఉన్నతవిద్య నేర్చి, గొప్పయుద్యోగములుచేసి, ధనమార్జించి తమ యొడి నింపవలయుననియె కోరుచుందురుగాని, విద్య నేర్చు విషయమున తమ పిల్లలెట్టి శోధనలకు లోనగుదురో విద్యాపరిశ్రమమువలన వారి దేహముల కేవిధమగు ననర్థములు కలుగుచున్నవో తగినంతగఁ దెలిసికొనకున్నారు. మనఃపరిశ్రమమువలన మనస్సు





యొక్క శక్తులన్నియు విజృంభించునట్లు, దేహపరిశ్రమమువలన శరీరావయవముల జవసత్త్వము లభివృద్ధినొందుచున్నవి. కావునఁ బ్రతి పాఠశాలయందును సామాన్యముగ విద్యతోఁబాటు, ఏదోయొక శరీరసాధనమునకుఁ దగు వసతి యేర్పడి యుండును. కసరతు, సాము మొదలగు దేహపరిశ్రమానుకూలమగు విద్యననుదినమును విద్యార్థులకు నేర్పుటకై యొక గురు వేర్పడియుండును. కాని సామాన్యముగ జ్ఞానదాయకమగు విద్యాసంపాదనమునందె ముఖ్యముగ దృష్టినిలిపి మన దేశపు విద్యార్థులు దేహపరిశ్రమమును లెక్కసేయకున్నారు. ఇంటను బాఠశాలయందును పుస్తకమే వారిహస్తముల నలంకరించుచున్నది. ఇట్లు ప్రతిదినమును రెండు మూఁడు జాము లేకదీక్షతోఁ బుస్తక పఠనముఁ జేయుచుండుటచేత, విద్యార్థి శరీరమున రోగబీజములు మెల్లఁగఁ బ్రవేశించి, నానాటవృద్ధియై చెరుపుజేయుచున్నవి. గొప్పపరీక్షలలో గెలుపొంది పిల్లవాఁ డధికైశ్వర్యయుతుఁడగునని పుట్టెఁడాసపెట్టుకొనియున్న తల్లిదండ్రుల నంత ననంత దుఃఖవార్ధిలో ముంచి పిన్నవాఁడు మృత్యువువాతఁ బడుచున్నాఁడు! ఎంతమంది విద్యార్థులు, తమ విద్యానైపుణ్యముచే గురువులను మెప్పించి, సహాధ్యాయుల నాశ్చర్యమున ముంచి, పరీక్షలో జయభేరి వేయించి, తుదకుఁ బరీక్షా విజయపత్రముచేత నందుకొను భాగ్యము కన్నులార గనకపూర్వమె మృత్యుదేవత వాతఁబడుచున్నారు. చావు తప్పినను, ఎంతమంది తమయారోగ్యమును గోలుపోయి, యావజ్జీవమును తమకును తమవారికిని భారముగనుండి, దుస్సహమగు బ్రదుకు బ్రదుకుచున్నారు! ఇంకగొందఱువిద్యార్థిదశయందుమృత్యువునోటినుండితప్పించుకొనినను, ఏగొప్ప యుద్యోగముఁ జేయుచునో, విద్యాస్వీకార కాలమందలి శరీరదౌర్బల్యము కారణము గలిగి యకాలమరణము నొందుచున్నారు. ఇవియన్నియుఁ జూచువారికి, "బ్రతుకుగలిగిన భాగ్యము ల్బడయవచ్చు" గాని, విద్యమూలమునఁ దమ పుత్రుల జీవములఁ గోలుపోఁగూడదను నొకవిధమగు తాత్కాలిక వైరాగ్యము పొడముచు



న్నది. కావున నీయనర్థములకు ముఖ్యహేతువగు శరీర పరిశ్రమయెడ నశ్రద్ధను మన విద్యార్థుల మనస్సులనుండి తొలఁగింప వలయును. ఇది యొక గొప్ప సంస్కరణమని నేను భావించెదను. తమ పిల్లవాఁడెపుడు చూచినను పుస్తకము చేతఁబట్టుకొనియె యుండుననియు, వంచిన వీపు నెత్తడనియును, మనవారు మురియుచున్నారు. జనులలోనుండు నీదురభిప్రాయమును మనము సంస్కరింపవలయును. విద్యార్థి దేహపరిశ్రమమునుగురించి తలిదండ్రు లెక్కువ శ్రద్ధవహింపవలయును. విద్యాపరిశ్రమము సులభసాధ్యమగు పనిగాదు. విద్యాస్వీకారపు దినములందు, శరీరమెంతో గాసినొందును. త్వరలో జీర్ణమై మంచి సత్తువనీయఁగల యాహార పదార్థములు విద్యార్థుల కాహారముగ నిచ్చుచు, మంచి వాయువు వీచు ప్రదేశములం దనుదినమును గొంత కాలమైన వారు గడుపునట్లును క్రమమైన శరీరసాధకముఁ జేసి వారు శరీరారోగ్యము నిలుపుకొనునట్లు, తలిదండ్రులు శ్రద్ధపుచ్చుకొన వలెను.

## నీతి విద్య.

విద్యపేరు చెప్పి విద్యార్థి యందు మెల్లఁగఁ బ్రవేశించి, వానికి నానాటహానిచేయుచెడుగులలో నింకొకటి దుర్నీతి. ఇదిరోగముకంటెను ఘోరమైనది. రోగప్రాప్తివలన నీలోక సుఖమునకే చెఱుపు గలుగవచ్చును గాని, దుర్నీతివలన జనులు ఐహికాముష్మిక సుఖములను గోలుపోవు చున్నారు! సామాన్యముగ స్త్రీకిఁ బెండ్లినాఁడు పెట్టిననగలు రానట్టె, మనుజునకుఁ జిన్ననాఁడు పట్టువడని సుగుణములు లభింపవు. బాల్యావస్థయందు హృదయమునఁబడు గుణబీజములె నానాట మొలకలు చెట్లునై, తత్తత్ఫలముల నిచ్చుచున్నవి. ప్రతి యుద్యోగమునందును, వ్యాపారమునందును, నీతివిషయమున విద్యావంతునికి నితరులకును భేదము గానఁబడవలయును. అట్టి భేదమంతగ నాకన్నుల కెపుడు కానరాకున్నదని చెప్పుటకు విచారముగ నున్నది. విద్యావంతులు తమ దుర్నీతివలన దేశమున కపఖ్యాతిఁ దెచ్చుటకుఁ గారణము, "తోటకూర

నాఁడే చెప్పవురా కొడుకా" యను నట్లుగ, వారిచిన్ననాఁటి పెంపే యని చెప్పవలసి యున్నది. పాఠశాలలలో నీతిమతబోధనముఁ జేయకుండుట వలన నీయనర్థము గలుగుచున్నదని కొందఱు తలంచుచున్నారు. బాలుర నీతిపోషణావిషయమై గురువుకంటె తలిదండ్రులె యెక్కువగసాయపడఁగలరు. తమపిల్లవానికిఁ బుస్తకజ్ఞానమె కాని దేహపరిశ్రమ మక్కఱలేదని తలంచుతలిదండ్రులు, అతఁడు దేహారోగ్యమును జెడఁగొట్టుకొని తుద కేవైద్యశాలలోనో చనిపోవుటను జూచునట్లె తమ బాలునికి నీతివిద్య యవసరములేదని తలంచువారును, అతఁడేయుద్యోగమునందలి యక్రమప్రవర్తనము వలననో దుర్యశము సంపాదించి యే కారాగృహమునందో గాసినొందుటను గన్నులార గాంచవలసివచ్చుచున్నది! కావున పాఠశాలలోని విద్యతోఁ దనివినొందక మనము మన బాలురకును, బాలికలకును నీతిమతవిషయికవిద్యను నేర్పవలయును. ఈ విద్య వట్టి పొడిమాటలతోఁ గాక, ప్రవర్తనారూపముగను, దృష్టాంతపూర్వకముగను నుండవలయును. పిల్లలకు గ్రంథసాహాయ్యము వలనను ఇతరవిధములచేతను నీతిబోధనఁజేయుచు వారికి సద్వర్తనము లభించునట్లు చేయవలయును. సత్యము, ధర్మము, దైవభక్తియు వారికి ఉగ్గుపాలలోఁ బెట్టినట్లుగ నుండవలయును, మన పూర్వీకులగు నార్యులు, పిల్లల నీతిపోషణా మహాకార్యమును మనమిపుడు చేయుచున్నట్లుగ గాలికి వదలివేయక దానియందు తగుశ్రద్ధను వహించియుండిరి. వారిని బ్రహ్మచర్యాశ్రమమునఁ బ్రవేశపెట్టి కొన్ని మంచికట్టుబాట్లతో వారిని గొంతకాలము పెఱుగనిచ్చి, ఇంద్రియ నియమాదులగు మంచియలవాటులు వారికిఁగలుగ జేసి, తరువాతనే వారి వివాహాది సంస్కారములు తలపెట్టుచుండిరి. ఇప్పుడన్ననో, పాఠశాలావిద్యార్థి విచ్చలవిడిగఁ దిరుగుచు కాఫీ తేనీళ్లు ద్రావుచు, సిగరెట్లు పీల్చుచు, బాల్యదశయందు నిక్షేపించుకొనఁదగిన దేహమనోపటుత్వ సంపదను నిర్హేతుకముగఁ గొల్లపెట్టుచున్నాడు! తక్కువనోములు నోచిన నెక్కువఫలములు వచ్చునా? ఇట్లు పెఱిగిన



మనుజుఁడు ఎట్లు విద్యను నీతినియమములును సంపాదించి, జీవయాత్ర నెట్లు సలిపి, దేశమునకు దాను జేయవలసిన విధికార్యముల నెటు నెరవేర్పఁ గలుగునో మనము సులభముగ నూహింపవచ్చును.

మన దేశమందలి విద్యాసంస్కరణమును గుఱించి నేనింత (సేపు) ప్రసంగించుటకుఁ గారణము, సంఘసంస్కరణము యొక్క యవశ్యమును లాభమును జనులు గుర్తెఱుఁగుటకు మునుముందుగ వారువిద్యాలాభము నొందవలయుననియె. కన్నులులేని మనుజుఁడు లోకమునందలి వస్తువుల రూపవర్ణాదులఁ గనుగొనని విధమున, జ్ఞానచక్షువును గాంచనివాఁడు, సాంఘికవిధులు సాంఘికాచారసంస్కరణము మొదలగువానిని గుర్తెఱుఁగఁజాలఁడు. జనుల కందఱికిని విద్య లభించువఱకును సంఘసంస్కరణ మహాకార్యము నాపివేయవలయునని నామతము కాదు. ఐనను విద్యాసంపన్నులు దేశోద్ధరణమునకై చేయుసంస్కరణముల యావశ్యమును లాభమును గుర్తెఱుఁగుటకును, వారికి సాయపడుటకును, జనులు కొంత విద్య నేర్చియుండవలయును. దేశమున సద్విద్య యల్లుకొని పెంపొందిన కొలఁదిని, జనులు సంఘసంస్కరణమునందే గాక, తక్కిన గొప్ప విషయములందును, ముందడుగు వేయఁజూతురు. భరతఖండము విద్యలకు నాలవాలముగనుండెడి పూర్వకాలమందు జనులు సాంఘిక రాజకీయాది విషయములందు మిక్కిలి గొప్ప దశయందుండిరి. హిందువులలో విద్య యడుగంటినపుడె వారి నాగరికత, స్వాతంత్రత, నీతి దక్షత మొదలగు నైశ్వర్యము లన్నియు నడుగంటినవి. కావున సంఘసంస్కరణముమూలమున తిరిగి యార్యావర్తము నున్నతదశకుఁ గొనిరావలెనని చూచు సంస్కరణాభిమానులు, తమ ఘనకార్యమును ముందుగ దేశీయుల విద్యా సంస్కరణముతో నారంభింపవలయును. అట్టి విద్యా సంస్కరణమె సంఘసంస్కరణ సౌధమునకుఁ బ్రథమ సోపానము.

## వివాహ సంస్కరణము, అతి బాల్యవివాహములు.

మన దేశమున ననేకవిధములగు వివాహసంస్కరణములు గావలయును. పూర్వకాలమున మన దేశీయులు వివాహ విషయమున మంచి

యాచారములును నియమములును గలిగియుండిరి. కాని దేశమున నానాట ననేక కారణములవలన నీమంచికట్టుబాట్లుపోయి, వాని స్థానమున దురాచారములు ప్రవేశించినవి. వివాహ విషయకమైన యీ దురాచారములలో నతి బాల్యవివాహము లగ్రగణ్యములైనవి. ఆర్యులు తమ పుత్త్రులకును, బుత్త్రికలకును మంచివిద్య చెప్పించుచు, విద్యా పరిపూర్తియైనపిమ్మటనే వయసు వచ్చినతరువాత వారికి వివాహముఁ జేయుచువచ్చిరి. స్త్రీలును, పురుషులవలెనే చిన్ననాఁట నుండియు విద్యనేర్చి బ్రహ్మవాదినులుగ నుండి చక్కని నియమములు దాల్చియుండిరి. వీరిలో గొందఱు ఉత్తమవిద్యాభ్యాసముఁ జేయుచు, తపస్సునందు గాలము గడుపుచు, అవివాహితలుగనే యుండిరి. అప్పటి యార్యులు, తపోనిష్ఠయందుండిన కన్యలగు నీస్త్రీలయం దెంతయో గౌరవభావము గలిగియుండిరి. ఈడువచ్చిన స్త్రీపురుషులకు మాత్రమె యానాఁడు వివాహము లగుచుండెననుటకు, ఇప్పటికిని మనలో వివాహ సమయమునఁ బఠింపఁబడు మంత్రములును, అవలంబింపఁబడు నాచారములును, ముఖ్యనిదర్శనములు. వయసువచ్చినవారికి వివాహమగుచుండుట వలన అనుకూల దాంపత్యములే యెల్లెడలను గానఁబడుచుండెను. పిల్లలు అంగసౌష్ఠవమును, మనోవికాసమును గలిగియుండిరి. కానిపిమ్మట దేశములోఁగలిగిన యనేకసంక్షోభముల మూలమున, నానాట నతిబాల్య వివాహములుప్రబలసాగెను. "వివాహోవిద్యానాశాయ" యను లోకోక్తి ప్రకారము, అంతట మన దేశీయులు, పిల్లవాండ్రచదువు గట్టివైచి, విద్య సాగించుటకు మారుగా వారికివివాహములు చేయసాగిరి! బాల్యముననే వివాహాది సంస్కారములు జరిపించుటచే మన దేశ మెన్నో విధములగు సాంఘికానర్థములకు జన్మభూమియయ్యెను. ఈయతిబాల్య వివాహములు సర్వానర్థములకును హేతువని మనలో నాంగ్లేయ విద్యా సంపర్కముగలవారే గాక, మన శాస్త్రములును వైద్యగ్రంథములును ఘోషించుచున్నవి.



ఇఁక నీ యతి బాల్యవివాహముల నరికట్టుటకుఁ జేయు ప్రయత్నములను గుఱించి కొంతచెప్పవలయును. బాల్యవివాహములవలన బాలవితంతువులసంఖ్య వృద్ధియగుటయు, జనులలో నంతకంతకు శరీరమందును మనశ్శక్తులందును దుర్బలత్వ మేర్పడుటయు మొదలగు ననర్థములు గలుగుచున్నవని ప్రతి పాఠశాలా విద్యార్థియు నెఱిఁగియున్నాఁడు. ఇట్టి వివాహములను నిరుత్సాహపఱచుట ముఖ్యకర్తవ్యాంశమని మహాసభలలో తీర్మానములు జరిగినవి. మైసూరు, బరోడా, సంస్థానములలో నా సంస్థానప్రభువులు బాల్యవివాహములను నిషేధించు శాసనములు చేసియున్నారు. కొన్నిసంవత్సరముల క్రిందట నిట్టి శాసనమును చెన్నపురి శాసన నిర్మాణసంఘములో తీర్మానమునకుఁ దెచ్చిరిగాని, దొరతనమువారు దాని నంగీకరింపరైరి. అయినను విద్యాలాభము నెఱింగిన వారిపుడు సామాన్యముగఁ దమ బాలికలకు 10–11 సంవత్సరములకుఁబూర్వమును, బాలురకు 16 సం॥ రములకు ముందును, వివాహములు చేయుట మానుకొని యున్నారు. కాని, అతి బాల్య, వివాహములు ప్రభుచట్టము మూలమునను జనాభిప్రాయము వలనను బాహాటముగ నిషేధింపఁబడకపోవుటచేత, సామాన్యజను లింకను వానినే యామోదించుచున్నారు. 10–11 సంవత్సరములవఱకును బాలికకును, 16 సంవత్సరముల వఱకును బాలునికిని పెండ్లి చేయకుండుట కొంతవఱకు సుగుణమె కాని, యింత మాత్రముననే వివాహములను గుఱించిన యనర్థము దేశమునుండి తొలఁగిపోఁజాలదు. విద్యాపరిపూర్తిగానట్టియు, శరీర దౌర్బల్యముతోఁ గూడిన లేఁతవయస్సులో నున్నట్టియు, బాలురకిచ్చి వివాహముఁ జేయఁబడుటచేత అనేక ప్రదేశములను మృతభర్తృకలును, అప్రయోజకులగు పతులకై వగచు స్త్రీలును గానవచ్చుచున్నారు! కొంచెము ప్రాజ్ఞత గలిగినవారగుట చేత కొన్నిచోట్ల, తమకుఁ దలిదండ్రులు తెచ్చిన సంబంధములు మంచివి కావనియు, తమకు విద్యాభంగము గలిగింపవలదనియు, ఇంకను కొంత

కాలమువఱకును, వివాహ మక్కఱలేదనియు మన బాలికలు చెప్ప సాహసించుచున్నారు ! ఇవియన్నియు పూర్వాచార పరాయణులగు తలిదండ్రుల మనశ్శాంతికిఁ గొంత భంగకరములైనను, దేశాభి వృద్ధికి శుభసూచకములనియే చెప్పవచ్చును.

వివాహవిషయికమగు కడమ దురాచారములు.

అతిబాల్య వివాహములతోఁగూడ దేశక్షేమమున కనేక విధము లగు కీడు గలిగించిన దురాచారము లేవియనఁగా:—

ఉపజాతులలో వివాహసంబంధములు లేకుండుట, అసమాన వివాహములు, అమితముగ కన్యాశుల్కవర దక్షిణలను స్వీకరించుట, స్త్రీ పునర్వివాహములు గర్హితమగుటయును. పూర్వమున మన దేశమున నిన్ని జాత్యుపజాతులు లేవు. ఒకరితో నొకరు వివాహవిషయమునను, భోజన ప్రతిభోజన విషయమునను, సంబంధములు గలిగియుండఁగూడ దను నియమమా కాలమున లేదు. వృత్తినిబట్టి జాతిభేద మేర్పడి సంఘాభి వృద్ధి కెంతమాత్రము ననర్థదాయకము గాకుండెను. ఏకాలమందు నే దేశ మందును, పునర్వివాహము లరుదుగనే యుండును. అతిబాల్య వివాహ ములు లేకుండెడి యాకాలమున బాలవితంతువుల సంఖ్య మిక్కిలి తక్కు వగనే యుండెడిది. అయినను దయార్ద్రహృదయులగు నార్యులు, పరిణ యేచ్ఛగల వితంతువులకుఁ బునర్వివాహములు జరిపించుచు వచ్చిరి. మన దేశమందిప్పుడు తటస్థించునట్టుగ, వందలకొలఁది బాలికలు నాలు గేండ్ల ప్రాయముననే వైధవ్యదశ నొందుటయు, పదేండ్ల యీఁడుగల వితంతువులు వేలకొలఁదియు, పదునాఱేండ్ల వయస్సుగల వితంతువులు లక్షలకొలఁదియు నుండుటయు నే దేశమందును, బూర్వకాలమున మన దేశమందును, ఉండునట్టి ఘోరమగు స్థితిగాదు. ఇట్టి యతిబాల్యదశనే వైధవ్యము ప్రాప్తించిన స్త్రీలు జీవితకాలమంతయు బ్రహ్మచర్యాశ్రమ మునసే యుండవలయు ననుటయు న్యాయముగాదు.



ఇఁక వివాహ మెట్టి ప్రయాసకరమైనదియు ధనవ్యయ కారణ మైనదియును, అంగటికిని దెలిసియే యున్నది. ఒక కుమార్తెకుఁ బెండ్లి చేసిన వాఁడు పునర్జన్మ మెత్తినట్టుగ భావించుచున్నాడు. కన్యాశుల్కములను గైకొనుట మానివేసితిమి గాని, వరదక్షిణలను పేరుతో కుమారుల నమ్ముకొనుచున్నాము ! ఈ వరదక్షిణా స్వీకారమను ఘోర దురా చార మిపుడు భరతఖండమునందంతటను వ్యాపించి, జనుల మనస్స్వస్థత కును దేశాభివృద్ధికిని భంగకరమగుచున్నది. ఇది నీచకార్యమని భావించు టకు మాఱుగా, మీఁదు మిక్కిలి గౌరవనీయమైనదని మన దేశీయులు భ్రమించుచున్నారు ! కూఁతుల వివాహమునకై కొంపయు గోడయు నమ్మివైచినవాఁడు, కుమారుని వివాహసమయమున దన కదివఱకుఁ గలిగిన ధననష్టమును వరదక్షిణరూపమునఁ గూడఁదీయఁ జూచు చున్నాఁడు ! ఈ విషయమున ప్రపంచానుభవము మనవారి యెడల నిష్ఫలమగుచున్నది ! వరదక్షిణ నీయనను నియమమును బూనినవాఁడు తన కూఁతును మడిమాన్యములు లేని యే నిరక్షరకుక్షికోఁ గట్టవలసి వచ్చుచున్నది ! ఆహా ! ఇది యెంతటి న్యాయము ! దుస్స్వప్నమునందు, స్వకల్పితమగు నాలోచనలతోనే మనసు కంపించుచున్నది. ఆదేరీతిని, స్వయంకృతాపరాధములచే సాంఘిక విషయములందు హిందూజనులు తమ కాలు సేతులకుఁ దామే సంకిలులు తగిలించుకొని, వెత నొందు చున్నారు !

ఈ కారణమువలన, వివాహవిషయమున మన దేశమున కిపుడొక గొప్ప సంస్కరణము గావలసి యున్నది నే నిదివఱకుఁ జెప్పినట్లుగ, మన శాస్త్రము లీ వివాహ సంస్కరణమున కెంతమాత్ర మును నాతంకములు గావని నానిశ్చితాభిప్రాయము. శాస్త్రాధారమును బురస్కరించుకొనియె మన బాలికలకును, బాలురకును యుక్త వయసు వచ్చిన పిమ్మటనే వివాహములఁ జేసినయెడల, వివాహవిష యమునఁ గానవచ్చెడి చెడుగులలో ననేకములు తొలఁగి పోవును.

శారీర శాస్త్రజ్ఞానములేని పురుషుఁడు గాని, స్త్రీ గాని వివాహము జేసికొనుట మహా పాపకార్యమని యొక గొప్ప శాస్త్రవేత్త చెప్పి యున్నాఁడు. ఐహికాముష్మిక సుఖసాధనమగు విద్యను గొంతవఱకైనఁ జెప్పింపక ముక్కుపచ్చలారని మునుపె మన పుత్రులకును బుత్రికలకును వివాహ సంస్కారము తలపెట్టుట యనాచారమనియు, రాక్షసకృత్యమనియుఁ జెప్పనొప్పును. దేశకాలానుసారముగ మనమిపుడు ప్రాజ్ఞత గలిగిన పిల్లలకే వివాహముఁ జేయవలయును, కాలానుసారముగ నిపుడు వివాహవిషయమున మనము మార్పు జేసికొననియెడల మన సంఘమున ననేక సాంకర్యములు ప్రవేశించును. దురాచారముల వలని నష్టములకుఁ దాళజాలక, ఆంగ్లేయవిద్యా సంపర్కము గలవారు చీలిపోయి, వేఱుసంఘముగనైనఁ గావచ్చును. వారు అన్యమత సంఘములలోఁ జేరి దేశీయుల పొత్తునకు వ్యాఘాతము గల్పింపవచ్చును.

యుక్తవయసు వచ్చినపిమ్మటనే వివాహములు జరుపుచు వచ్చిన యెడల, అతి బాల్యవివాహములవలని నష్టములనుండి యొకసారిగ దేశముఁ దప్పించుకొనఁ గలదు. అప్పుడు మంచివిద్య, నీతి నియమములు, ఆత్మజ్ఞానమును సంపాదించుకొనుటకు స్త్రీపురుషులకు బాల్యావస్థయందు వ్యవధిగలుగును. అతి బాల్యవివాహములు ప్రబలుటచేత నిపుడు స్త్రీపురుషు లొకసారిగ బాల్యావస్థను విడిచి, గృహస్థాశ్రమమునఁ బ్రవేశింప వలసిన వారగుచున్నారు. దీర్ఘాలోచన గలిగిన పూజ్యులగు మన పూర్వికులట్లుచేయక, బ్రహ్మచర్యాశ్రమము నందు ప్రతి పురుషుఁడును స్త్రీయును గొంతకాలము గడిపి, విద్యాస్వీకారముఁ జేసి, ఇంద్రియ నిగ్రహశక్తులను సంపాదించి, తరువాతనె వారు పరిణయము జేసికొని గృహస్థాశ్రమమునఁ బ్రవేశించునట్లు చూచిరి. కావున మనమీ వివాహ విషయక సంస్కరణముఁ జేయఁ బూనితిమేని, మన పూర్వికు లాచరించుచు వచ్చిన సదాచారమునే యనుష్ఠింపఁ జూచువార మగుదుముగాని అన్యదేశీయుల నడవడుల ననుసరించువారముగాము. అప్పుడు వివాహ మను



నది, తలిదండ్రులు తమవేడుకకొఱకును, లాభముకొఱకును జరిగించు నిరర్థకమగు కర్మగాక, స్త్రీపురుషులు విద్యానంతరమున పరస్పర ప్రేమచేఁ బురికొల్పఁబడి, యీశ్వరాజ్ఞానుబద్ధులై మనఃపూర్వకముగఁ జేసికొను పవిత్ర నియమమగును.

యుక్తవయస్సు వచ్చిన పిమ్మట వివాహములు జరుగుట తిరిగి భరతఖండమున నాచారమైనచో, అతిబాల్య అసమాన నిర్బంధ వివాహములును, వాని ననుసరించిన చెఱుఁగులును, శీఘ్రము దేశమునుండి తొలంగిపోవును. ప్రతి స్త్రీకిని బురుషునికిని వివాహము జరుగవలెనను నియమము ఒకానొక కాలమందు లాభదాయక మయినను ఇపుడు సార్వత్రిము శ్రేయోదాయకముగాదు. వివాహసంబంధమున కిచ్ఛగింపని వారును, దీనికిఁ దగనివారును, స్త్రీ పురుషులలో నిపు డనేకులుగలరు. ఇట్టివారికందఱికి నిపుడు పరిణయ మావశ్యకముగ జరుగుచుండుటచేత, జనులలో సౌఖ్యమున కెడముగలుగుచున్నది. నిరతబ్రహ్మచర్యాశ్రమమునఁ గాలము గడపిన స్త్రీపురుషులను గుఱించి మన గ్రంథములు గౌరవముగఁ బ్రశంసించుచున్నవి. మనఃపూర్వక నియమమె శ్లాఘనీయముగాని, నిర్బంధమగునదిగాదు. కన్నులు తెరువని చిన్ననాఁడు తలిదండ్రులు కట్టిపెట్టిన భర్త కాలవశమునొందిన నెపమున యావజ్జీవమును ఘోరవైధవ్యదశ ననుభవించుటకంటె, ప్రాణవల్లభుని గోలుపోయిన కాంతయును, ఉత్తమవిద్యా తపస్సులనిమిత్తమె పరిశ్రమఁ జేయఁదలఁచిన కన్యయును, సంతత బ్రహ్మచర్యాశ్రమవ్రతము సల్పుట శ్లాఘనీయము.

### సంఘసంస్కరణాభిమానుల కొక సందేశము.

తక్కిన సంఘసంస్కరణముల గుఱించి వేఱె చెప్పనక్కఱలేదు. బలిష్ఠములగు కొమ్మ లన్నిదిశలకును వ్యాపించి వృక్షమెట్లు దృఢముగను కర్షణీయముగను నుండునో, అట్లె, ఏవైపునఁజూచిన సదాచారములు గలిగియున్న సంఘము సుస్థితిని గాంచియుండును. కావున మనసంఘము అన్ని విధములగు దురాచారములనుండి విముక్తినొంది సదాచార

భూయిష్టమగునట్లుగఁ జూడవలయును. ఈ సందర్భమున సంఘసంస్కరణాభిమానుల కొక మనవి చేయుచున్నాను. సదా చీఁకటినే చూచు కన్నులకు దృష్టిమాంద్యము గలుగునట్లె, సంఘమునందలి దురాచారములనె గనిపెట్టఁ జూచువారి మనోనేత్రములకు హిందూసంఘ మందలి సదాచారములు గనిపెట్టు శక్తి తగ్గవచ్చును. పూర్వకాలమున నెంతో యున్నతదశయందుండిన యార్యుల సంతతివారమగుటచే, ఇటీవల నెన్ని యనర్థములకు లోనైనను, మన సంఘములో ననేకములగు సదాచారములున్నవని యొప్పుకొనక తప్పదు. దురాచారము లనేకములున్నను, జనులు వానిని బరిశీలించినట్టుగఁజేసి క్రమమైనమార్గమున వానిని సంస్కరింపఁ బూనవలయును. అంతియెగాని, యిన్ని దురాచారములు ప్రబలిన హిందూసంఘమున నుండుట సిగ్గులచేటని భావించి, మాతృసంఘమును నిరసించి, దానిని బూర్తిగాఁ ద్యజించి, హాయిగ వేఱుగ నుండఁజూచుట దేశభక్తులకు ధర్మముగాదు. గొప్ప యుత్సవములలోఁగాని యూరేగింపులలోఁగాని నడచువాఁడు మెల్లఁగ నడుగిడుచుఁ బోవలయునట్లె, హిందూసంఘ సంస్కరణాభిలాషి, సంస్కరణ విషయమున స్వల్పమగు మార్పులతోనే తృప్తినొందవలయును. కాని, సంఘము దానియంతటనదియె మార్పునొందుననని తానూరకుండక, దాని యభివృద్ధి నిమిత్తమై తాను శక్తివంచనలేక పాటుపడవలయును.

సంఘసంస్కరణ మహాకార్యమునకు దొడంగువారు, సంఘములోనివారి వలనఁ దమకుఁగలిగిన కష్టములు పరిగణించుటయు వారి యెడల వైరబుద్ధి వహించుటయుఁగూడదు. పూర్వకాలమున గ్రీసు దేశమునందలి ఆతెన్సునగరమున నీతిబోధనఁజేయుచు వచ్చిన సోక్రటీసను మహామహుని దుష్టుఁడని యానగరవాసులు నిర్ధారణఁజేసి, వానికి మరణదండన విధించినప్పుడు, చెరసాలనుండి తప్పించుకొని పారిపొమ్మని మిత్రులనేకులు వానికెంత బోధించినను అతఁడట్లు చేయక, భ్రాతృసదృశులగు స్వదేశీయులు తన కక్రమముఁజేసినను, తానువారి యాజ్ఞోల్లంఘన



…లము వచ్చినప్పుడు దేశమాతను వీడుట నీచమని పలికి …తో వారు విధించిన దండన ననుభవించెను. నిజముగ సంఘసంస్కరణాభిమానియు సంఘముపట్ల నిట్లు చేయవలసినదే. సంస్కరణపక్షమవలంబించువారన్ని బాధలు పడుటకును సంసిద్ధులుగ నుండవలసినదే. భారతీయులను సోదరులవలె భావించి వారి సాంఘికానర్థములను దొలఁగించు విషయమునఁ బనిచేయుటకై దైవముచే నియమింపఁబడిన దేశసేవకులమేయని వారు సదా మనస్సున జ్ఞప్తియుంచుకొనినచో, తమకు విరోధులు లేరనియు, తామొక కక్షలోని వారము కామనియు వారు గ్రహింతురు. సంఘసంస్కరణమునకు నీతి కన్ను వంటిది.

నీతిలేని సంస్కరణము సంస్కరణముగాదు. సంస్కరణకర్త జనుల నీతిని బెంపొందింపఁ జూచువాఁడు కావున నిర్మల ప్రవర్తనము లేనివాఁడు తాను సంస్కరణాభిమానియని చాటుకొనక, ఊరకయుండినేని సంస్కరణపక్షమున కెంతో మేలు చేసినవాఁడగును. మనము చెప్పు మాటలకంటె మన ప్రవర్తనయె యధికాకర్షణశక్తి గలిగి యుండును. దుర్నీతిపరులు చేయఁజూచు ఘనకార్యములను దైవమాశీర్వదింపఁడు! జనులామోదింపరు.




RAMA PRESS, ELLORE.

